

జాతీయ పక్షపత్రిక

# కృష్ణాపత్రిక

ఆగస్ట్ 15న ప్రత్యేక సంచికగా నవ వేగంతో వెలువడుతోంది

పత్రికా రచయిత పిరాట్ల వెంకటేశ్వర్లు సంపాదకత్వంలో వెలువడుతోంది
చారిత్రక నవలా చక్రవర్తి డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ లేఖిని నుండి అపూర్వ కళాసృష్టి హాలుని గాథాసప్తశతి నేపథ్యంగా వెలువడుతున్న అగ్రశ్రేణి చారిత్రక నవల.

## 'వసంతగౌతమి'

ధారావాహిక నవలా చరిత్రలో మెరుపుదాడి చేసిన 'లల్లాదేవి' కలంనుండి వెలువడిన మరో మహోత్తర సాంఘిక నవల **'భార్గవుడు'**

రచయిత్రి + వైద్యవృత్తి= డాక్టర్ కె.వి.కృష్ణకుమారి చెప్పదల్చుకున్న

## డాక్టర్లు చెప్పుకోలేని కథలు!



అక్కినేని షష్టిపూర్తి ప్రత్యేక వ్యాసం

నవ్యత సాధించే కవితలు, కార్టూన్లు, కథలకు ఇదే ఆహ్వానం.



ఎన్టీఆర్, కిసింజర్‌ల జాతకాలు ఒకే విధమైనవా?

రాజకీయ రంగంలో సంచలనం కలిగించే ఆంధ్రదేశ రాజకీయాల సమీక్ష - శ్రీ క్రొవ్విడి రంగారావు న్యూఢిల్లీ లేఖ, రాష్ట్ర వార్తలపై సంచలన వ్యాసాలు, సామాన్యుల హృదయాలకు గిలిగింతలు. బాలలకు మధురమైన కథాకథనాలు, చిరునవ్వుల పన్నీరుజల్లుల కార్టూన్లు, ముత్యాల మొగ్గల వంటి కవితలు, చామంతుల లాంటి కథలు ఎన్నో ఎన్నెన్నో... ప్రతినెల 1,15 తేదీలలో కృష్ణాపత్రిక వెలువడుతుంది. వాసిరెడ్డి సీతాదేవి, కప్పగంతుల మల్లికార్జునరావు, డా॥ పెళ్లకూరు జయప్రద, గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు మొదలైనవారి కథలతోపాటు సరస్వతీ రామానంద భరద్వాజ, రాంభట్ల కృష్ణమూర్తి, జేష్ట, బియ్యన్నార్ ఆంజనేయ శాస్త్రి, జి.కృష్ణ, జానకీజాని, మంజుశ్రీ, కె.ఆర్.కె. మోహన్, గోపాలచక్రవర్తి, డాక్టర్ ప్రసాదరాయ కులపతి, భండారు సదాశివరావు, ఆరెస్కే మూర్తి, మల్లాది సుబ్బమ్మ, పవని నిర్మల ప్రభావతి మొదలైన వారి కలాల విరవిహారం.... నేడే మీ కాపీని రిజర్వు చేసుకోండి!

సంవత్సర చందా 50 రూ॥లు మాత్రమే (జులై 30వ తేదీ తరువాత 65 రూపాయలు)
వివరములకు:
మేనేజర్: కృష్ణాపత్రిక పోస్టుబాక్స్ నెంబర్.1270 హైదరాబాద్-500 027 ఫోన్: 66618

## ముఖచిత్రం

నా అభిమాన నటుడు, సూపర్‌స్టార్ కృష్ణగారిని ముఖచిత్రంగా వేసినందుకు మా హృదయ పూర్వక అభివందనలు.

కొప్పర్తి శంకర్, కారంచేడు.

* * *

సూపర్‌స్టార్ క్రిష్ణగారి ముఖచిత్రం చాలా బాగుంది. నిజంగా ఆ ముఖచిత్రము మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది.

ఎ. యోగీశ్వరరావు, నాగు. కాశీబుగ్గ.

## ఆవేశం

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 29–6–84లో ప్రచురించిన శ్రీ జైదుబాషీగారి న్యూఢిల్లీ లేఖ శీర్షిక చదివిన తరువాత యీ ఉత్తరం వ్రాయ కుండా వుండలేకపోయినాను. నిజంగా ఆ లేఖను చదివినప్పుడు నాలో కలిగిన ఆవేశం యీ లేఖ వ్రాసిన తరువాతగాని ఉపశమించలేదు. నిజంగా శ్రీ జైదుబాషీగారిలా విషయాన్ని కులమత రాజకీయ అభిమానాలకు అతీతంగా ఆలోచించి వ్రాయగల సమర్థులు యింకెందరో యీ దేశంలో వుండివుండవచ్చును. వారందరికి ఆంధ్ర సచిత్ర వారపత్రికలాంటి పత్రికలు అవకాశమిచ్చి వారి రచనలను, భావాలను ప్రోత్సహించినచో యీ దేశంలో హిందూ శబ్దాన్ని, హైందవ జాతిని, హైందవ సంస్కృతిని అపార్థము చేసికొంటూ దానికి మతపరమైన రంగు పులిమి తమ స్వార్థ ప్రయోజనాలకుగాను పైవాటిని ద్వేషించే అనేకమంది రాజకీయ నాయకులకు, మేధావులనిపించుకొనేవారికి కనువిప్పు కలుగగలదని ఆశిస్తున్నాను.

పొత్తూరు అమరేశ్వరరావు,
నరసారావుపేట.




## కథలు

''లోపలి మనుషులు'' కథ వాస్తవానికి చాలా దగ్గరగా వుంది. నాగరికత పేరు చెప్పకొని నేటి సమాజంలో ప్రవర్తించుతున్న కొందరు వనితలు 'కన్నేపల్లి గోపాలకృష్ణగారి' కథ వలన కళ్ళు తెరుచుకుంటే మంచిది.

ఎమ్. వెంకటేష్, నరసారావు పేట.

## అద్భుత వ్యక్తులు

''హస్తసాముద్రిక, జోతిష్య, సంఖ్యా శాస్త్రాలు హీరో – కీరో'' గురించి వ్రాసిన వ్యాసం చాలా బాగుంది. ఒక మహా మనిషి గురించి సవివరంగా వివరింపచేసే ఇలాంటి విజ్ఞాన విషయాలు మీరు ప్రచురిస్తున్నందుకు చాలా అభినందిస్తున్నాను.

పి. సూర్యనారాయణమూర్తి, ఖరగపూర్.

## సినిమా

15–6–84 వ ఆంధ్ర సచిత్ర వారపత్రిక 47 వ పేజీలో 'హిందీ చిత్ర విశేషాలు' లో మొదట వాక్యం శ్రీ' అమితాబ్ బచ్‌చన్' తండ్రి పేరు 'తెజ్ బచ్‌చన్' అని పొరపాటుగా ముద్రించబడినది. శ్రీ 'అమితాబ్ బచ్‌చన్' తండ్రి పేరు ''శ్రీహరివంశ్‌రావ్ బచ్‌చన్'' అని సవరించమని ప్రార్థించు చున్నాను.

డి. శ్రీలక్ష్మి, కలకత్తా.

## కర్మయోగి

'కర్మయోగి' ఎంతో ఆధ్యాత్మికంగా వుంది. ప్రతి నిముషం బాధ నిరాశతో కుమిలిపోతున్న నాకు క్రిష్ణారావు (పాత్ర) మాటలు చక్కని స్నేహితునిలా, కన్నీళ్లు తుడిచిన కన్నతల్లిలా, ఎంతో ఓదార్పు నిస్తోంది. జీవితం అంటే ఏమిటి అని ఆలోచింప జేస్తోంది.

మెహన్‌భీ, అసన్‌పురం.

* * *

నిజంగా కర్మయోగి సీరియల్ గురించి చెప్పాలంటే నాకు పదాలు దొరకట్లేదు. దాని గొప్పతనాన్ని వర్ణించనవసరంలేదు.

కర్మయోగి గురించి విశ్లేషించి ఒక్కరూ వ్రాయలేదు.

పదాల కూర్పు కడు రమ్యంగా ఉంది. నిజంగా ఒక్కో వాక్యం చదువుతుంటే మనస్సు ఉత్తుంగ తరంగమై ఎగసి ఎగసి పడుతుంది. తెలుగులోని తేటతనమంత నవలలో తేనెలూరు తోంది.

అర్థం చేసుకోగలిగిన వారికి అన్నిరకాలా మసాలాలు ఉన్నాయి. నవలలో సెక్స్ ఉంది. యోగ్యం ఉంది. విధి విచిత్ర లీలలున్నాయి. కుట్రలు, కుతంత్రాలు, విలన్లు ఒకటేమిటి అన్నీ మిశ్రితమైన నలభీమపాకంలా ఉంది.

రచయిత్రి సంకల్పబలం చాలా గొప్పది. ఆ కృష్ణ తత్వాన్ని అంతా విపులంగా సులభ శైలిలో సామాన్యులకందరకు అందించాలన్న ఆశయం నిజంగా మహోన్నతం. ఆ కృష్ణయ్య లీలల్ని విశ్లేషించి విపులీకరించే శక్తి సాక్షాత్ ఆ నల్లనయ్య కృపవల్లనే లభ్యమై ఉంటుం దేమో!? సరస్వతిదేవి ఆవిడ కలంలో వసియించి ఇలాంటి మంచి నవల రాయిస్తోంది. కృష్ణ కుమారిగారి జన్మ ధన్యమైంది. ఇంకనారు ఏ నవల వ్రాసినా వ్రాయకపోయినా నాలాంటి వారికి మరియు సాహిత్య పిపాస గలవారికి ఆమరణం గుర్తుంటారు. వారికివే నా నమస్సుమాంజలులు.

కె. నరేష్, నాగార్జునసాగర్.

## బాధ పడనవసరంలేదు

29.6.84 ఆంధ్రపత్రిక వారపత్రికలో డాక్టరు సలహాలు కాలంలో పి యస్. జి. చంద్రగిరి, అనునతడు తనవద్ద మైసూర్కు పోవడానికి డబ్బులేదని వ్రాశాడు.

ఆయన తనకు అతి సమీపములోని లయన్స్ క్లబ్ వారిని కలసి తన పరిస్థితిని చెప్పిన వారు డబ్బు సహాయము చేయుదురు. మరియు మైసూరు వెళ్ళిన తరువాత అక్కడ కూడా మా క్లబ్ వారు సహాయము చేయుదురు. డబ్బులేదని అతను బాధ పడనవసరము లేదు.

పుట్టపర్తి లక్ష్మీనరసింహం, పెనుకొండ.

[66 వ పేజీ చూడండి]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాధుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభు ప్రసాద్**

సంపాదకుడు :

(1938-1972)

శుక్రవారం : 3-8-'84

శ్రీ రక్తాక్షినామ సం. శ్రావణ శు. సప్తమి

**సంపుటము 76 : సంచిక 47**

సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు. | 1-80 |
| ఆరు మాసాల చందా | రు. | 46-80 |
| పోస్టులో ఏడాది చందా | రు. | 101-40 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక





## లోకం పోకడ......ఊమెన్

















## విదేశంలో దుబాషీ

# దేవుళ్ళకి దూరమయిపోతే?

### అథెన్స్

మీకు నిజంగా యూరోపుని గురించి తెలుసుకోవాలంటే అథెన్స్ నగరంతో అఖండ యాత్ర మొదలు పెట్టాలి. ఈ రోజులలో ఎందరో ప్రయాణీకులు అథెన్స్‌కి వెళ్తారు. ఇది ఒక మామూల యూరోపు నగరం అని వారి అభిప్రాయం. నాకు కూడా ఇక్కడికి వెళ్ళటం ఇదే మొదటి సారి. చాలా సందడిగా ఉండే ఊరు అనిపించింది నాకు. రోమ్‌లో కూడా ఇంత చప్పుడుగా ఉండదు. ఇంగ్లీషులో "క్లాసిక్" అనే మాట ఉంది. అది గ్రీసు సంస్కృతిని దృష్టిలో ఉంచుకుని వాడే మాట. ఆ సంస్కృతి స్ఫురించదు ఈ ఊరు వచ్చినప్పుడు కాని,ఇక్కడ ఉండే కొన్ని ఆధునిక భాగాలని మినహాయిస్తే - ఇలాంటివి కొత్త ఢిల్లీలో మాత్రం లేవూ! - మళ్ళీ 2500 సంవత్సరాలు వెనక్కి వెళ్ళిపోయినట్లు ఉంటుంది. ప్రభుత్వం భవనాల నిర్మాణం కూడా ప్రాచీన పద్ధతిలో ఉంటుంది. మామూలు అథెన్స్ నగర వాసులు సయితం (ఉదాహరణకి ఒక హొటలు వెయిటరు) మన కంటికి ప్రాచీనుల లాగే కనపడతారు. మనుషుల పేరులు గ్రీకువి, భవనాల పేరులు కూడా అంతే. నేను ఉండే హొటలు బార్‌లో పని చేసే వ్యక్తి పేరు హోమర్! నాకు పొద్దుటే టీ, పత్రిక ఇచ్చే మనిషి పేరు సోఫోక్లెస్! నన్ను చూడటానికి వచ్చిన ప్రభుత్వోద్యోగి మొదటి పేరు పెరిక్లెస్‌ట - తనని అలాగే పిలవమని అన్నాడు ఆయన! ఈ పేరు గ్రీసు చరిత్రలో చాలా సుప్రసిద్ధమయినది కదా! "సింపోసియమ్" అనే పేరు కల హొటలుని చూశాను, "అపోకాలిప్స్" అన్న నామం ఉన్న హొటలు కనపడింది నాకు . . . వైజ్ఞానిక ప్రయోగాలకి పనికి వచ్చే పరికరాలు అమ్మే ఒక షాపుని "పిథాగొరోస్" అని పిలుస్తున్నారు!

గ్రీసు దేశం వారు కలుపుగోలుగా ఉంటారు. యూరోపులోకెల్లా బీద దేశం ఇదే. వాళ్ళు యూరోపియన్‌లే కాని ఆసియా వాళ్ళు కూడాను. హిందువుల లాగే గ్రీసు దేశం వాళ్ళు కూడా దేవాలయాలు కట్టే వాళ్ళు ఇక్కడ చర్చిలూ ఉన్నాయి. గ్రీసు దేశపు చర్చి రోమ్‌లోని పోప్ కింద ఉండదు. గ్రీసు దేశం వాళ్ళు శతాబ్దాలుగా తూర్పు వయిపు నుంచి వచ్చే మహమ్మదీయ దండులతో యుద్ధాలు చేస్తూ వచ్చారు. వాళ్ళు ఇంకా టర్కీ దేశపు "తుర్కు"లతో పోట్లాడుతున్నారు. అసలు గ్రీసులు టర్కీ దేశం వాళ్ళని "తుర్కు"లని పిలవరు -ముస్లిమ్‌లని పిలుస్తారు. వీళ్ళని చూస్తే గ్రీసు దేశస్తులకి అవజ్ఞ.

ఒక నాడు ఉదయమే నేను అనుకోకుండా అక్రోపొలిస్‌కి నడిచి వెళ్ళాను. అక్కడే ఉంది "పార్థెనాన్" గుడి. అథెన్స్ చుట్టూ నాలుగు కొండలు. ఒక్కొక్కటి ఒక దేవుడికి లేదా ఒక దేవికి అంకితం అయి ఉంటుందన్న మాట. ఆర్యులకి తమ దేవుళ్ళతో చాలా చనువు! గ్రీసు దైవాల కథలు మన దైవాల కథల లాగే ఉంటాయి.... "పార్థెనాన్" చాలా పెద్ద గుడి. పెరిక్లెస్ కాలంలో కట్టారు దీనిని. ప్రపంచంలోని అతి సుందరమయిన నిర్మాణాలలో ఇది ఒకటి. ఐ.రా.స. వాళ్ళు దీని జీర్ణోద్ధరణని చేపట్టారు. ఇది "అథెనా" అనే అమ్మ వారి గుడి. అథెన్స్ నగరం దేవి ఆమే. యుద్ధ దేవి కూడా ఆమే. సైనికులు యుద్ధానికి వెళ్ళే ముందు ఆమెనే ప్రార్థించే వాళ్ళు. యుద్ధం తరువాత కూడా ఆమెనే ప్రార్థించే వాళ్ళు. భారత దేశం మీద దాడి చేసిన మెకెడోనియా రాజు అలెక్సాండర్ (భారత దేశంలో ఈయనని ఎదిరించి ఆపిన రాజు పోరస్ లేదా పురుషోత్తముడు) ఇక్కడ ఆగి ప్రార్థించి ఉండాలి. ఆశ్చర్యం ఏమిటంటే, గ్రీసు చరిత్రలో అలెక్సాండర్‌కి ప్రముఖ స్థానం ఉన్నట్లు తోచదు. ఇన్ని విగ్రహాలు కల ఈ అథెన్స్ నగరంలో అలెక్సాండర్ శిలా విగ్రహం చూడటానికి నేను ఊరు మధ్య నుంచి ఒకటిన్నర కిలో మీటరు దూరం వెళ్ళవలసి వచ్చింది.

అక్రోపొలిస కింద "అగోరా" అనే చోటు ఉంటుంది. ఇదొక "పార్కు" లాంటిది. ఇక్కడే ప్లాటో, సోక్రటిస్ మొదలయిన వాళ్ళు వచ్చి సమావేశం అవుతూ ఉండే వాళ్ళు. సమావేశం అయి చర్చలు జరుపుకునే వాళ్ళు. అప్పుడు కూడా అథెన్స్ వాసులు చురుకు మనుష్యులు. రాజకీయాలు వాళ్ళ రక్తంలో జీర్ణించుకపోయి ఉండేవి. ప్లాటో, సోక్రటిస్ ప్రభృతులు నడిచిన మార్గాల వెంబడే ఇప్పుడు మనమూ నడిచి వెళ్ళ వచ్చు. జల్లు పడితే దేవాలయం లోపల తల దాచుకోవచ్చు. అప్పటి కాలంలో గ్రీసు దేశపు దార్శనికులు అదే పని చేస్తూ ఉండే వాళ్ళనుకుంటాను! అగోరాకి సుమారు వంద గజాల దూరంలో నిక్స్ అనే చిన్న గుట్ట ఉంది. అథెన్స్ పుర వాసులు ఇక్కడ పోగయి తమ ప్రతినిధులని ఎన్నుకునే వాళ్ళు - చేతులు ఎత్తి ప్రజాస్వామ్యం ఇక్కడే పుట్టిందంటారు. గ్రీసు భాషలో "డెమోస్" అంటే ప్రజలు "క్రాసీ" అంటే పాలన. డెమోక్రసీ అనే ఇంగ్లీషు మాట ఇలాగే వచ్చింది. ప్రజలు స్వాములుగా ఉండేది "ప్రజాస్వామ్యం" కదా! గ్రీసుని మిలిటరీ నియంతలు పాలించిన రోజులలో జనాన్ని ఈ నిక్స్ దగ్గిరికి వెళ్ళనిచ్చే వాళ్ళు కారు - ఎందుకో వేరే చెప్పనక్కర లేదు. నేను నిక్స్ వెళ్ళినప్పుడు అది విలాస యాత్రికులతో కిటకిటలాడుతోంది. వాళ్ళలో కొందరు పండితులూ, పరిశోధకులూ కూడా కనిపించారు. అక్కడి శిల్పాలనీ మొదలయిన వాటినీ వాళ్ళు తెగ పరిశీలించేస్తున్నారు!

★ ★ ★

క్రయిస్తవ మతం రావటంతో గ్రీసు క్షీణించటం మొదలు పెట్టింది. ఈ సంగతి ఆ దేశం వాళ్ళకీ తెలుసు. ఎందుకంటే చెప్పలేరు. గ్రీసు లిపిలో ఎందుకు అన్ని రోమ్ అక్షరాలు ఉన్నాయని నేను అడగగా ఒక యువ విశ్వ విద్యాలయాధ్యాపకుడు "రోమ్ లిపిలోనే గ్రీసు అక్షరాలు ఉంటాయి!" అన్నాడు నవ్వుతూ. "రోమ్ సంస్కృతి కన్నా గ్రీసు సంస్కృతే పాతది కదా?"

కొన్ని సంవత్సరాల కింద కొందరు పాశ్చాత్యులు వచ్చి పార్థెనాన్ ఆలయం కొలతలు తీసుకుని అలాంటిదే ఇంకొక దేవాలయాన్ని ఇంకొక చోట కట్టారుట కాని దానికి ఈ అందం రాలేదు. పార్థెనాన్ ఒక భారీ నిర్మాణమే కాని ఎగిరి పోవటానికి సిద్ధంగా ఉన్నట్లు కనపడుతుంది! పాశ్చాత్యులు కట్టిన నమూనా నేల మీద అంటుకు పోయినట్లు కనపడుతుందిట..... ఆర్యులకి దేవుళ్ళతో సంపర్కం అధికంగా ఉండేది. అది పోగానే వాళ్ళ నాగరికత క్షీణించటం మొదలు పెట్టింది. చివరికి గ్రీసు కూడా మరొక పేద రైతుల దేశం అయిపోయింది. మిగతా ప్రపంచంలోని అభివృద్ధికి దూరం అయిపోయింది. దేవుళ్ళకీ దూరం అయిపోయింది.......

హిందువులూ ఒకప్పుడు వాళ్ళ దేవుళ్ళకి దగ్గరగా ఉండే వాళ్ళు. క్రమంగా దూరం అయిపోయారు. దూరం అవటంతో వారి నాగరికత నశించటం ప్రారంభించింది......

అథెన్స్ నగరం శిథిలాల మధ్య నడుస్తున్న నాకు మళ్ళీ రెండు వేల ఏళ్ళకి పయిగా వెనక్కి వెళ్ళినట్లు అనిపించింది. గొప్ప నాగరికతల శిథిలాలు ఇలాంటి భావాలనే రేకెత్తించగలవు. "వృద్ధ వీరులు మరణించరు, క్రమంగా అదృశ్యులవుతారు" అంటారు. కాని అవకాశం వస్తే మాత్రం మళ్ళీ సజీవులయిపోతారు.

**– డా. జయ్‌దుబాషీ**

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## 1984 దీపావళి కథల పోటీ
## మొత్తం రు.6,600ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారి కూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము.......... పోయినేడాదిలాగే యీసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన 6 రు కథలను 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' దీపావళి సంచికలో, 6 తరువాతి సంచికలో వేస్తాము. ఆటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ:→ 20-8-'84 సోమవారం

పోటీలో ఎన్నికైన 6 రు కథలకు ఒక్కొక్కదానికి రు. 650/-లు చొప్పున బహుమతులు ఇస్తాము. ఆటు తరువాత బాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 700/-, రు. 600/-, రు. 500/-ల వంతున అదనపు బహుమతులు యివ్వడమేగాక మిగిలిన మూడు కథలకు రు. 300/-ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతులు అందజేస్తాము.

### నిబంధనలు

* 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా ఉండాలి. 12 అరటావులు దాటకుండా రాస్తే చాలు. సిరాతో తప్ప బాల్ పెన్‌తో రాయవచ్చు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
* కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.
* అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
* పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలం పేరు వాడినా అసలు పేరు, యింటి పేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతో పాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
* కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము.
* రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.
* పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైన వాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.
* ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలు వెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఎట్టి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము. కాబట్టి రచనలతో పాటు స్వంత చిరునామా కలస్టాంపులు అతికించిన కవరు పంపనవసరంలేదు.

—సం॥

kasi..

# వేరు కాపురం

యం.ఉమామహేశ్వరరావు

డిశంబరు నెల రెండోవారం...

చిన్నగా చలిగాలి వీస్తోందంతటా సాయంత్రం ఆరుగంటలయింది. రిక్షా దిగి ఆ యింటి ముందాగేడు మూర్తి.

రిక్షావాడు వెనగ్గా మోసుకొచ్చిన మూటను మూర్తి ఆగిన దగ్గరే దించి, కూలి పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

వీధి లైటు వెలుగులో యింటి తలుపువేపు చూసి ఉలిక్కిపడ్డాడు మూర్తి. వరండాలో లైటు లేదు. ఆ తలుపుకు వ్రేళ్ళాడుతున్న తాళం కప్పకేసి చూసి నిరుత్సాహం క్రమ్మింది. చిన్నగా అడుగులు వేసుకుంటూ వరాండాలోకి వచ్చేడు. ఇల్లంతా నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆ వరాండాకు ఆనుకునే ఉన్న ఓ చిన్న సామాన్ల గదిలాంటి దాన్లో ఎవరో ఉన్నట్లు అనిపించడంతో రెండడుగులు అటువేసి 'ఏవండీ!!' అంటూ పిలిచాడు గొంతు కాస్త పెద్దది చేసి.

ఎవరూ?! ... అంటూ బయటికొచ్చిన ఆ మనిషిని చూడ్డంతోటే మూర్తిలో చిన్నగా శరీరం కంపించింది. ఎదురుగా అరవై సంవత్సరాల 'నరశింహం'గారు నించున్నారు.

''నువ్వటయ్యా...మూర్తీ! ... రా ... రా, ఏమేవ్! యిలారా! ఎవరొచ్చారో చూడు!?...''

అంటూ లోపలున్న భార్యను కేకేసేరు ఆనందపడిపోతూ! ...

''ఎవరూ?! ... అంటూ బయటికొచ్చింది నరశింహంగారి సతీమణి అన్నపూర్ణమ్మ. మూర్తిని చూసీ చూడగానే మరింత ఆనంద పడిపోతూ ''ఇదేనా రావడం? అంతా కులాసా యేనా? ... పిల్లలు బావున్నారా? వాసవి ఎలా ఉంది. క్షేమమే గదా!!...'' అంటూ కుశల ప్రశ్నల వర్షం కురిపించడంతో, వాళ్ళ ఆప్యాయతకూ, ఆ పలకరింపులోని మాధుర్యానికీ పరవశించి పోయాడు మూర్తి.

''ఆ! ... ఆ! ... అంతా కులాసాయేనండీ. ఎటొచ్చీ మీ యోగక్షేమాలే మాకు తెలీడం లేదు...'' అన్నాడు.

''వచ్చిన వాడిని అలా నించోబెట్టే మాట్లాడుతున్నావ్, కాళ్ళూ, చేతులూ, కడుక్కుందుకు నీళ్ళు పట్టుకు రావడం ఉందా? ... లేదా ?! ... '' భార్యను కసురుకున్నారు నరశింహంగారు.

''అయ్యయ్యో! ... నించోబెట్టే మాట్లాడుతున్నాను. ఉండుబాబూ! నీళ్లిస్తాను, కాళ్లు కడుక్కో! ... ''

అంటూ లోపలకెళ్లి చెంబుతో నీళ్లు తెచ్చి మూర్తి కందించిదావిడ. మూర్తి కాళ్లు కడుక్కోవడం పూర్తిచేసి ఆవిడకు చెంబు తిరిగిస్తూ, ''మా చెల్లెలు పావనీ, మధూ,లేరా యింట్లో?'' అన్నాడు తలుపుకు వేసి ఉన్న తాళంకప్పను మరో మారు అనుమానంగా చూస్తూ.

''లేరు బాబూ!!... అలా వీధిలోకి వెళ్లొస్తామని యిద్దరూ కలిసి సాయంత్రమే వెళ్లినట్లుంది ... ఇంకా రాలేదు ... నువ్వొచ్చిన సమయానికే లేకుండా పోయారు! ...'' విచారిస్తూ అంది అన్నపూర్ణమ్మ.

మూర్తి సాలోచనగా తల పంకించాడు. అతని మనస్సు అరలలో ఏదేదో రగుల్తోంది. అదేమిటో బైటకు విప్పి చెప్పలేక పోయాడు. పార్వతీ–పరమేశ్వరుల్లాంటి ఆ వృద్ధ దంపతులను చూసి ఏమీ అడగటానికి గానీ తన మనస్సులో చెలరేగుతున్న ఆలోచనలను బైట పెట్టడానికి గాని ధైర్యం చాలడంలేదు.

తను యిక్కడకు వచ్చిన పని వేరు. తను ఊహించిందీ ... మనస్సులో ఆలోచించుకున్నదీ వేరు. కాని...అందుకు భిన్నంగా కనిపిస్తున్న ఆ వాతావరణం మరింత చిందర వందర ఆలోచన్లను రేపుతోంది. ఒకటాలోచిస్తే, మరొక్కటి ఎదురైనట్లుగా వుంది పరిస్థితి...

మూర్తి అన్యమనస్కంగా ఉండటం గమనించారు నరశింహంగారు. ''ఏమేవ్! మూర్తి యిక్కడే భోంచేస్తాడు. ఆ వంటా, అదీ ... వెంటనే కానీ...'' అన్నారు.

మూర్తి ఆలోచన్లకు నరశింహంగారు స్వరం అంతరాయం కలిగించడంతో చివాల్న తల త్రిప్పి ఆయన కేసి చూసాడు.

''ఓ! ... అదెంతపని ?! ... నిముషంలో అయిపోతుంది వంట!! ''

అంటూ లోపలకు వెళ్లిన అన్నపూర్ణమ్మ గారు 'ఏవండీ!' అంటూ భర్తను లోపలకు పిలిచింది.

''ఆ! ఆ!! వస్తున్నాను... మూర్తీ! నువ్విలా ఆ మంచంమీద కాస్సేపు రెస్టు తీసుకోవోయ్!! ఈలోగా భోజనం రడీ అయిపోతుంది!'' అని కదలబోయారాయన.

''అబ్బే!... భోజనం ఏర్పాట్లు చేయకండి మామయ్యగారూ!.. మరి ఈ రాత్రికే వెళ్లాలి నా యిల్లు చేరాలి. అక్కడ నాకోసం వాసవి ఎదురు చూస్తుంది, ఏ సమయానికైనా వచ్చేస్తానని చెప్పి మాటిచ్చాను.'' అంటూ వీధిలోకి చూసేడు మూర్తి.

''అలాగే వెళ్దువుగాని లేవయ్యా!... ఏదీ ?... మీ చెల్లెలుతోనూ... మావాడితోనూ కలిసి మాట్లాడండే వెళ్ళిపోతావా ?!... వాళ్ళూ ఈపాటికి వచ్చేస్తూ ఉంటారు. ఈలోగా నువ్వా మంచంమీద నడుం వాల్చు. ప్రయాణంలో బాగా అలిసినట్లు కన్పిస్తున్నావు.'' అనేసి లోపలకు కదిలారు నరశింహంగారు.

మూర్తి మనస్సులో ఏదో చెప్పలేని సంఘర్షణ ప్రారంభమయింది. జేబులోంచి కనిపిస్తున్న ఉత్తరాన్ని పైకి తీసేడు. ఆ రోజు ఉదయాన్నే తన భార్య వాసవి ''మీ చెల్లెలు వ్రాసిందీ ఉత్తరం. చదవండి!'' అంటూ ఆ ఉత్తరాన్నందించింది. ఒకసారి చదివిన ఉత్తరమే అయినా... మళ్ళీ చదివేడు.

''...అన్నయ్యకు. మీ చెల్లెలు 'పావని' నమస్కరిస్తూ వ్రాయునది. నన్నూ... మీ బావగార్నీ యిక్కడ మా అత్తగారూ, మామగారూ వేరు కాపురం పెట్టించేసి, మా వంట మమ్మల్నే చేసుకుతినమని చెప్పేసేరు... ఇప్పుడు మేమిద్దరమూ వేరేగా ఉంటున్నాము. అంటే ఆ ఇంట్లోనే సెపరేట్‌గా ఉంటున్నాము. వేరు కాపురం పెట్టిన ఆడపిల్లకు కన్నవాళ్ళు మా సంసారానికి కావలసిన పప్పులూ, బియ్యం... వంట పాత్రలూ వగైరాలు అమర్చి యివ్వాల్ట. అమ్మా, నాన్నా, పోయేక నాకు నువ్వూ, వదినా తప్ప ఎవరున్నారన్నయ్యా!? ఈ చెల్లెలు సంసారం కోసం ఈ భారం నువ్వే తీసుకోవాలన్నయ్యా!... తప్పదు. మీ బావగారు కూడ యీ మాటే అంటూ నన్ను దెప్పిపొడుస్తున్నారు. కనక వెంటనే నువ్వు వచ్చి, ఆ ఏర్పాట్లన్నీ చెయ్యవలసింది. లేకుంటే ఈ చుట్టుప్రక్కల తలెత్తుకుని తిరగలేను. అత్తమామల హేళన భరించలేను... నీ రాకకోసం వెయ్యికళ్లతో ఎదురుచూస్తుంటాను.

ఇట్లు
నీ చెల్లెలు పావని

ఉత్తరం చదివి మడతబెడుతున్నప్పుడు భార్య అంది :

''తప్పకుండా వెళ్ళాలండీ మనం ?!! పావని వ్రాసినదాంట్లో అబద్ధం ఏమీలేదు. తమ ఆడపిల్ల వేరే కాపురం ఉంటున్నదీ అంటే ?... ఆమె మొదటి సంసారానికి కావలసినవి అన్నీ పుట్టింటి వాళ్లే సమకూర్చాలి. పాపం ! పావనికి మనం తప్ప ఎవరున్నారు ?'' భర్త ముఖం వంకే చూస్తూ అంది వాసవి.

''అదికాదు వాసవీ ! ఇప్పుడంత అర్జంట్‌గా వీళ్ళను వేరే పెట్టెయ్యాల్సిన అవసరం ఏమిటొచ్చిందా అత్తమామలకు ? ? ... ఉన్నది [illegible] '' [illegible]

వెరసి నలుగురు. ఇల్లా... అంత పెద్దదేం గాదు. అలాగని రెండు భాగాలదీ గాదు. అలాంటప్పుడు ఏం బరువై పోయారని వాళ్ళను వేరే పెట్టాలి చెప్పు ?''

అంటూ నశిగాడు తలపట్టుకుంటూ.

''... అక్కడే మీరు పొరపడుతున్నారండీ!.. బరువని గాదు. పెళ్ళయి సంవత్సరమే అయినా వాళ్ల ఆనందం కోసం... స్వేచ్ఛకోసం పాపం ఆ ముసలివాళ్ళు అలా చేసుంటారు... ఇందులో ఎవరేమనుకున్నా పుట్టింటి వాళ్ళం కాబట్టే మన ధర్మం ప్రకారం ఆమెకు సర్వసంబారాలూ అమర్చివ్వాలి ...''

స్థిరంగా అంది వాసవి. ఆమెకేదో చెప్పడాని కుద్యుక్తుడయ్యాడు మూర్తి. కాని ఆపేసింది వాసవి.

''మీరేం మాట్లాడొద్దు. వెంటనే ఆ సామాన్లేవో కొని, పట్టుకెళ్ళి పావనికి ఇచ్చిరండి. ఆమె బాధపడ్డంలో అర్థముంది.''

అంటున్న భార్య మాటలకు అడ్డొచ్చాడు మూర్తి.

''మొత్తానికి నువ్వూ ఆడదాన్ననిపించు కున్నావ్ !!'' అన్నాడు.

''అవునండీ !... ఆడదాన్ని గాబట్టే సాటి ఆడదాని ఆరాటం... బాధ... మనస్సు అర్థం చేసుకోగలిగేను. మరింకేం ఆలోచన్లూ రానివ్వ కుండా వెళ్ళండి !'' అంది వాసవి.

మూర్తి మరేమీ ఆలోచించకుండా, ఆ మధ్యాహ్నమే సామాన్లవీ కొని, చెల్లెలింటికి బయల్దేరేడు. అసలు పరిస్థితేవిటో? ... అంతర్గతంగా వాళ్ళచేత వేరుకాపురం ఎందుకు పెట్టించాల్సొచ్చిందో ఆ ముసలి వాళ్ళను నిలదీసి అడగటానికే నిశ్చయించుకున్నాడు మనస్సులో...

మూర్తి ఆలోచనలు నుంచి తేరుకొని చూసేడొక్కసారి...లోపల చిన్నగా ఏడుస్తున్న అన్నపూర్ణమ్మగారి గొంతు ... ఊరుకొమ్మని ఆమెను సముదాయిస్తున్న నరశింహంగారు గొంతు వినిపించడంతో చివాల్న మంచంమీద నుంచి లేచి అటడుగులు వేసేడు.

''ఏం చెయ్యమంటారండీ! వంట?! ... ఇంట్లో ఏం ఉన్నాయని వండి పెట్టడానికి. ఇన్ని బియ్యంలేక మనమే కడుపునిండా తిని రెండ్రోజులయింది. పోనీ అబ్బాయిని ఏమైనా డబ్బు అడగండీ అంటూ మీకు చెప్తున్నా... వాడిని చస్తే అడగనని భీష్మించుకు కూచున్నారు. మీతోపాటుగా ఈ రెండ్రోజులుగా మంచినీళ్లే త్రాగుతున్నానో...గంజినీళ్లే త్రాగుతున్నానో... ఆ భగవంతుడికే తెలియాలి.''

కుమిలి, కుమిలి, ఏడవసాగిందామె.

''ఊరుకోవే ... అవతలా కుర్రాడువింటే బావుండదు. మన రెండు పొట్టలకు యింతన్నం పెట్టడానికే వాళ్ళకు బాధకలిగి విడిపోయి, వేరే వెళ్ళిపోయారుగా! ... తల్లిదండ్రులన్న అనుబంధం లేకుండా వాడలా వెళ్ళి భార్యతో వేరుకాపురం పెట్టుకున్నప్పుడు మనం మాత్రం ఏం చేయగలం? పోనీలే ... సంతోషించు ఈ కొట్టు గదిలోనన్నా ఉంచారు మెడబట్టి బయటకు గెంటెయ్యక. ఛ...ఛ...ఊరుకో...ఏదో సర్ది చెబుతానులే ... ఏడవకు. అతనుగాని వింటే బావుండదు!! ...''

భార్యను సముదాయించడానికి ప్రయత్నించ సాగారు నరశింహంగారు. ఆ మాటలు వింటున్న మూర్తి రెండు కళ్ళూ అశ్రుపూరితాలయ్యాయి. గుండె బరువుతో...నీరై పోయాడు. ఆపాద మస్తకమూ కరిగి...కరిగి చలించి పోయాడొక్క మారుగా !

''భగవంతుడా! కన్నబిడ్డ అయివుండీ, కన్న వాళ్ళు బరువై పోయారని దూరం చేసుకుంటు న్నాడా మధు?! ... పోనీ, తన చెల్లెలు పావనికే మొచ్చింది ? తల్లిదండ్రుల్లా భావించాల్సిన అత్తమామల్ని చూసుకోవడం యిలాగేనా?! ... నెత్తిన పెట్టుకుని పూజించకపోయినా...కనీసం శత్రువుల్లా ఉండకూడదే...''

ఆలోచిస్తున్న మూర్తి మనస్సులో అసంకల్పితంగా ఏదో ఆలోచన ఉరికింది. అతని మనస్సు తేలిగ్గా అయింది.

అతని కన్నుల్లోంచి అంతవరకూ ఉబుకుతున్న కన్నీటి బిందువులస్థానే కరుణ



ప్రవహించింది. జాలి హిమోత్పాతమైంది. వెన్నెల మనస్సు నిండా చేరి వెలుగులు నింపింది.

నరసింహంగారు బయటకు వస్తున్న 'చడి' కావడంతో మంచంమీద వాలిపోయాడు.

నరసింహంగారు బయటకు వస్తూనే —

"!!...మరిచేపోయానోయ్ మూర్తీ !... వెధవది ఆరవై ఏళ్ళు వచ్చేశాయి కదూ?! మతి మరుపు ఎక్కువైందీ మధ్య ?!... ఈ రోజు శనివారం గదూ !... పాపం, మీ అత్తయ్య వంటా—వార్పూ చెయ్యదు... పోనీ నీ కోసం, ఏ టిఫినో చేయమంటావా అంటే ?... ఛ...ఛ ... టిఫినేం ఖర్మ ? శుభ్రంగా ఇవాల్టికి భోజనం వండేశాయ్ ! అంటూ చేప్పేసేను... పిచ్చిది... అయోమయంగా నాకేసి చూస్తుండిపోయిం దనుకో..."

ఇంకా ఏదో అంటున్నారాయన.

ఏమీ చేయలేని తన అశక్తతను ఎంత చిర్నవ్వుతో దాటవేస్తున్నారీయన... గుండెల్లో రగులుతున్న అగ్నిగుండాల్ని చిర్నవ్వుతో భరిస్తూ తియ్యటి ఓ అబద్ధాన్ని ఎంతందంగా చెపుతున్నారు ?"..."

మూర్తి యిబ్బందిగా ముఖం పెట్టి కదుల్తూ, "అబ్బెబ్బె!... అసలు నాకేమీ వద్దండి ... అసలీరోజు రాత్రి నేను కూడా భోంచేయను. టిఫినుకూడా చెయ్యను...శనివారం కదా ?!... వారంలో ఒక్క పూటైనా ఉపవాసం చేస్తే శరీరాని కెంతో ఆరోగ్యం అన్నారు గాంధీజీ...నాకోసం పాపం అత్తయ్యగారిని శ్రమ పెట్టకండి !" అన్నాడు.

"కాని...మూర్తీ!..." ఏదో అనబోయారు నరసింహంగారు.

"మావయ్యగారూ ! దయచేసి ఆ విషయం ఒదిలేయండి... ప్లీజ్ !... నేనిక్కడకు వచ్చింది, చేయబోయిన పనీ, ఒకటైతే, యిప్పుడు నా మనస్సులో వచ్చిన ఆలోచనా... యిప్పుడు తీసుకున్న నిర్ణయమూ మరొక్కటి !!!"

"ఏమిటి బాబూ !?" ఆశ్చర్యంగా అడిగారు నరశింహంగారు.

"చూడండి మావయ్యగారూ ! ముందీ సామాన్లన్నీ లోపలకు తీసుకువెళ్ళండి. అత్తయ్యా, మీరూ నా యందు అభిమానం వుంచి కాదన కూడదు. వీటన్నింటినీ వాడుకోండి ..." దగ్గరే ఉన్న సామాన్ల మూటను అటు పెడుతూ అన్నాడు మూర్తి.

"అదికాదు మూర్తీ ..." లోపల్నుంచి వస్తూనే అంది అన్నపూర్ణమ్మ. మూర్తి ఆమె కళ్ళల్లోకి సూటిగా చూసేడు.

"నాకు తెలుసునత్తయ్యా ! ఎవర్నీ ఎవరు వేరేపెట్టేరో యిప్పుడు నాకు బాగా తెలిసింది. దయచేసి మరేమీ అనుకోవద్దు. మీ బిడ్డడిగానే భావించి యిది తీసుకోండి !!!" అన్నాడు.



# వేరు కాపురం

"కాని అవి మీ చెల్లెలి వేరుకాపురం కోసం తెచ్చినవికదా !! అవి మాకిచ్చేస్తానంటావేమి టయ్యా ?" నరశింహంగారు కలుగజేసుకున్నారు.

"అవును. మా చెల్లెలు పావని వేరుకాపురం పెట్టిందని తెలిసి తెచ్చేను. కాని, యిక్కడికి వచ్చేక నగ్నసత్యం బోధ పడిందండీ ... ప్లీజ్... నా కోరిక మన్నించండి ... " ప్రాధేయపడ్డాడు మూర్తి.

నరశింహంగారు, అన్నపూర్ణమ్మ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. సరిగ్గా, యిదే సమయంలో ... ఆ ఇంటి వాకిట్లో స్కూటరాగింది. స్కూటరు దిగి లోపలకు వస్తూనే వరండాలో నించుని తన అత్త మామలతో మాట్లాడుతున్న మూర్తిని చూడగానే ఎగిరి గంతేసింది పావని.

"ఎంతసేపయిందన్నయ్యావచ్చి ? అరెరె... అలా నుంచునే ఉన్నావా ? రా ... లోపలకి ?" అంటూ తలుపు తెరచి లోపలకు వెళ్ళింది పావని.

"ఏదీ ? వచ్చి ఓ గంటయింది."

అన్నాడు మూర్తి చెల్లెల్ని చూడగానే కలిగిన కోపాన్ని కంట్రోలు చేసుకుంటూ.

"ఏవండీ !! ఇదేనా రావడం ?" పలక రించాడు మధు.

"ఆ ! ఆ !! ... యిదేనండీ !!" జవాబిచ్చాడు మూర్తి లోపలకు చూస్తూనే.

లోపల్నుంచి వచ్చింది పావని.

"లోపలకి రండన్నయ్యా !! ఒక్క పది నిముషాల్లో వంటయిపోతుంది. అలా ఆ సోఫా మీద కూర్చో " మళ్ళీ హడావుడిగా లోపలకు వెళ్లబోతూ అంది పావని. కాని మూర్తి ఆపేసేడు చెల్లెల్ని.

"ఆ అవుసరం లేదు పావనీ. ఇప్పుడే మీ అత్తయ్య బలవంతం చేస్తే అక్కడే భోంచేసేను." చెల్లెలు ముఖంలో కదిలే రంగుల్ని గమనిస్తూ అన్నాడు మూర్తి.

## తేడా !

ఆలోచింప శక్తిలేని
"హంస" పాలను, నీళ్ళను
వేరుచేసి, పాలను త్రాగి
నీళ్ళను వదిలేస్తుంది !
ఆలోచనా శక్తి ఉన్న
"మనిషి" మంచిని
గ్రహించి, చెడును
విసర్జించలేకపోతున్నాడు.

— నగేష్

"అదేంపనన్నయ్యా ?...చెల్లెలింటికి వచ్చి భోంచేయకుండా, వేరేచోట భోంచేస్తావా ?" నిష్ఠూరంగా అంది పావని.

"అవునమ్మా...

... చెల్లెలు వేరుకాపురం ఉందని, కన్న బిడ్డల కంటే ఎక్కువగా చూసుకుంటున్న ఈ మా చెల్లెలి అత్త మామలు, యిలా అర్ధాంతరంగా సంవత్సరం కాకుండగానే, ఎందుకు వేరే పెట్టించేరో !! నిలదీసి వాళ్లను అడుగుదామని వచ్చేను. ఆ వేరు కాపురం ఉంటున్న చెల్లెలి కోసం సంసారానికి సరిపడా సామాన్లూ తెచ్చేను. కాని...ఆ చెల్లెల్లో చెల్లెల్నికాక మానవత్వం లేని ఓ మనిషిని చూస్తున్నానిప్పుడు. తల్లిదండ్రుల్లాంటి అత్తమామలకు కనీసం చారెడు గింజలు తినడానికివ్వలేదు సరిగదా ... వండుకోవడానికి ఓ చిప్పయినా యివ్వని కఠిన మనస్సున్న స్త్రీని చూస్తున్నానిప్పుడు !!... "

ఆగేడు మూర్తి ఊపిరి పీల్చుకుందుకు. చుట్టూ కలియచూసేడు. అతని కళ్ళకు అందంగా అలంకరించిన ఆ ఇల్లూ...ఆ గదిలో సోఫాలూ, కుర్చీలూ, వగైరాలు నిండుగా కనిపించేయి.

పావని నిశ్చేష్టురాలై మూర్తి వంకే చూస్తోంది.

మళ్లీ మూర్తే గొంతు విప్పేడు.

"చూడమ్మా పావనీ..., నీ ఇంట్లో ఉన్న ఈ సోఫాలూ, కుర్చీలూ, ఆ డైనింగ్ టేబిలూ, ఈ సామాన్లూ, నీ భర్తా, నువ్వూ కలిసి హాయిగా తిరిగి వచ్చేందుకు ఉన్న ఆ స్కూటరూ చూసి, యితరులు నువ్వేదో గొప్పదానివని అనుకుంటారని భ్రమ పడితే...అది నీ వెర్రి భ్రమే అవుతుంది.

ఇవన్నీ మీ అత్తమామలు కాలిగోటికి కూడ పోలవు...వాళ్ళు నీ భర్తను ఎలా చదివించు కున్నారో?...ఎన్ని అవస్థలు పడ్డారో నీకుతెలీదు. అత్తమామల్ని వేరేపెట్టి, వాళ్ళుండేందుకు నీ ఇంట్లోనే ఓ చీకటి కొట్లో స్థానం కల్పించిన నువ్వు, లోకులు నిన్నేదో అంటారని వ్రాస్తే అది సిగ్గుచేటవుతుంది... వస్తాను." అంటూ కదలబోయి, అయోమయంగా చూస్తున్న తన బావ మధువేపు తిరిగి అన్నాడు.

"మధూ !... కన్నవాళ్ళ కడుపులు మాడ్చి పస్తులు పెట్టి నువ్వు షికార్లూ, సినిమాల్లు తిరిగితే కాదనేందుకు ఎవళ్ళూ లేకపోవచ్చునేమో గాని... రేపు నువ్వు కన్నవాళ్ళు నిన్ను యిలాగే, యిప్పుడు నీ కన్నవాళ్ళను నువ్వు చూస్తున్నట్లుగానే చూస్తే, నీకెలా వుంటుందో ఆలోచించు... వస్తాను."

అంటూ చరచరా కదిలి వెళ్ళిపోతున్న మూర్తివేపు రెప్పలు వేయకుండా చూస్తు నించుండిపోయారు ఆ గదిలో ఉన్న పావనీ, మధూలు, వరండాలో వున్న నరశింహం — అన్నపూర్ణమ్మగార్లున్నూ...



# హొయసల శిల్పకళా యశోవైభవం!



హళెబీడులోని హోయలేశ్వరుని ఆలయ దృశ్యం

పదకొండవ శతాబ్దం అంతంలో హోయసల ప్రభువైన బెట్టవర్ధనుడు విశిష్టాద్వైత మూలపురుషుడైన రామానుజుని బోధనలకు పరివర్తనం చెంది విష్ణుప్రియుడై విష్ణువర్ధనుడిగా వినుతికెక్కి జైనమతాన్ని విడనాడి వైష్ణవాలయాలకు ప్రాణంపోసాడని ప్రతీతి. బేలూరులోని చెన్నకేశవస్వామి ఆలయం అమరశిల్పి జక్కనాచార్యుని శిల్పకళా విశ్వ స్వరూపం శిల్ప



సింహాన్ని మర్దిస్తున్న హోయసల మూల పురుషుడు సాలుడు (బేలూరు శిల్పం)

శాస్త్రంలోని నాగర, వేసర, ద్రవిడ తీరులలోని మెళుకువలను ఏకధాటిగా కుప్పించి ప్రతి శిల్పాన్ని సజీవ చైతన్యమూర్తిని చేసిన ఘనాపాటి జక్కన. ఆయనకు ఆయనే సాటి !

హోయసల సామ్రాజ్యం క్రీ. శ. 1047 ప్రాంతంలో అంకురించినట్లు చరిత్ర కథనం. వినయాదిత్యుడు ద్వార సముద్రంగా అప్పుడు పిలువబడే హళెబీడును రాజధానిగా చేసుకొని పాలించేవాడని తెలుస్తోంది. అసలు ''హోయసల'' పేరు రావడానికి ఒక గమ్మత్తయిన కథ చెబుతారు. సాలుడు హోయసల మూలపురుషుడు. గురూపదేశం పొందుతున్న తరుణంలో ఒక సింహం భయంకరంగా గర్జిస్తూ రాగా అందరూ చెల్లాచెదురుగా పారిపోయారు. అయితే సాలుడు మాత్రం చెక్కుచెదరలేదు. గురుప్రాణాన్ని రక్షించడమే పరమావధి అనుకొన్నాడు. ''హోయ్, సాలా'' అంటూ గురువు ఆజ్ఞాపించాడు. సింహాన్ని సంహరించాడు సాలుడు. గురుభక్తి ప్రకటితమయింది. భుజశక్తి సృష్టీకరించబడింది. రాజసం తొణికిసలాడుతుండగా వినయం ఉట్టిపడుతున్న సాలుని చూచి గురువు ఆశీర్వదించాడు. అతని పేరుమీదనే హోయసల వంశవృక్షం శాఖోపశాఖలుగా విస్తరించు కొందని చరిత్రకారుల వ్యాఖ్యానం. హోయసల పరాక్రమానికి మచ్చుతునకగా నిలిచే సాలుని ఉదంతం హోయసల ఆలయాలలో కనిపిస్తూ ఉండడం విశేషం !

హోయలు కురిపించే హోయలేశ్వరుని ఆలయం ఉన్నది హళెబీడులో. శాంతలేశ్వరుని మందిరం కూడ ఇక్కడే ఉన్నది. హోయసల పట్టపురాణి శాంతలాదేవి పేరుమీద ఈ ఆలయ నిర్మాణం జరిగిందని చెప్పబడుతున్నది. జైన బస్తి, కేదారేశ్వరస్వామి ఆలయం మొదలైనవి కూడ హళెబీడులోనే ఉన్నాయి. ఏడు శతాబ్దాలు గడచినప్పటికీ శిల్పాలు నవనవలాడుతూ ఉండడం ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఇప్పుడిప్పుడే శిధిల దశకు చేరుకొంటున్న శిల్పలావణ్యాలను మెరుగు పరచవలసిన అగత్యం ఉన్నది. బేలూరులో జగత్ప్రసిద్ధి పొందిన చెన్నకేశవస్వామి దేవళముంది. ఈ ఆలయ నిర్మాణానికి ఒక ప్రత్యేక కథనముంది. విష్ణువర్ధనునికి ఇరువురు భార్యలుండేవారని ఆధారాలున్నాయి. అందులో ఒకరికి కుష్ఠువ్యాధి సోకినదని, వైద్యులు నిస్సహాయులై పోగా, విష్ణుభగవానుని నమ్మిన విష్ణువర్ధనుడు బేలూరులో చెన్నకేశవుని ఆలయాన్ని నిర్మించాడని, ఆ తదుపరి విచిత్రంగా రాణి జబ్బు నయమైపోయినదని తెలియవస్తోంది. వేలాపురిలోని చంద్రద్రోణ పర్వతంమీద చెన్నకేశవస్వామి నిలయం నెలకొని ఉంది. ప్రస్తుతం ఆ వేలాపురినే బేలూరని, చంద్రద్రోణ పర్వతాన్నే బాబాబుడాన్ పర్వతమని పిలుస్తున్నారు. సోమనాథపురంలో కావేరీనది తీరాన ప్రసన్న చెన్నకేశవస్వామి దేవాలయముంది. హోయసల ప్రభువు మూడవ నరసింహ కాలంలో సైన్యాధిపతి సోమనాథుని పర్యవేక్షణలో క్రీ. శ. 1268లో ఒక చిన్న అగ్రహారంలో ప్రసన్న చెన్న కేశవుని ఆలయ నిర్మాణం జరిగినట్లు దాఖలాలు ఉన్నాయి.

నాట్యగణపతి





మదపుటేనుగుల ఊరేగింపు దృశ్యం

ఆ అగ్రహారం సోమనాథుని పేరుమీద నేడు సోమనాథపురమైనది. మూడడుగుల ఎత్తుగల విశాల కట్టడంమీద 218 అడుగుల పొడవు, 177 అడుగుల వెడల్పు, 32 అడుగుల ఎత్తుతో చెన్న కేశవస్వామి ఆలయం రూపకల్పన చేసుకోవడం ఒక మధురానుభవం!

బేలూరు, హళేబీడు, సోమనాథపురాలలోని శిల్ప సంపదను గురించి చెప్పవలసివస్తే మహా భారతాన్ని వ్రాయవలసి వస్తుంది. కొన్నివేల శిల్పాలతో జాజ్జ్వల్యమానంగా వికసించే హోయసల కళా వైభవాన్ని అంచనా కట్టడం సాధ్యమయ్యే పనికాదు. అయినప్పటికీ కొన్ని శిల్పాల విశేషాలను చర్చించే ప్రయత్నం చేస్తాను. ఏనుగుల ఊరేగింపు దృశ్యాన్ని శిలలో చెక్కడం అసాధారణ మనిపిస్తుంది. హళేబీడులో ఉన్న ఈ శిలలపై హోయసలుని విగ్రహం కూడ ఉంది. నెమలి వాహనముపై అధిరోహించిన షణ్ముఖుడు శిల్పపరమైన పరిణతితో విలసిల్లడం ద్యోతకమవుతుంది. హోయలేశ్వరుని ఆలయాని కిదొక మణిపూస. గజాంతక శిల్పం కల్పాల తరబడి వెన్నుతట్టే సంకల్పబలమనిపిస్తుంది. అపర కళా సరస్వతి నాట్యం చేయడం సత్యమేనన్న భ్రాంతిని కలిగించే లాగున నృత్య భారతి శిల్పం జీవాన్ని, జవాన్ని పొంది ఉండడం అపురూపమైన అపూర్వమైన విషయంగా మరులుగొలుపుతుంది. ద్వాపరయుగాన గోవర్ధనాన్ని ఎత్తి ఇంద్రుని దర్పమణచిన కృష్ణ లీల కలియుగంలో సామాన్యుల కళ్లకు సైతం గోచరించడం అమోఘం కాక మరేమిటి? హోయలేశ్వరుని ప్రాంగణంలో శిల్ప సౌందర్య పురులు విప్పుకొన్న మనోహర దృశ్యం గోవర్ధనగిరిని ఎత్తి గోవులను, గోపీ గోపాలకులను కృష్ణుడు రక్షించే శిల్పం! మాతృదాస్యాన్ని విడిపించిన విష్ణుభక్తుడు గరుడుని నిలువెత్తు శిల్పం బేలూరు శిల్ప సముద్రంలో ఆణిముత్యం! తీర్చిదిద్దబడిన నగిషీలతో కానవచ్చే గరుత్మంతుడు ముకుళిత హస్తాలతో భక్తి పారవశ్యంలో మునిగి ఉన్నమాట నిజమా అనిపించే శిల్పసోయగ చాతుర్యం చరిత్రలోనే అరుదని చెప్పవలసి వస్తుంది. విచిత్రమైన ఊహాబలంతో ఉలి ఉరవడికి జీవం పోసిన శిల్పి నేర్పుకు ప్రత్యక్ష నిదర్శనం నాట్య గణపతి విగ్రహం. సిద్ధవినాయకునికి అనూహ్య రూప కల్పన చేసి మూషికంపై ఒక పాదం మోపి నృత్యిస్తున్నట్లు శిల్పపరంగా చిత్రించడమనేది మామూలు విషయం కాదు. శిల కరిగి పాలవంకై పొంగి పారలినప్పుడే అది సాధ్యం. అట్టి అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన సిద్ధులు హోయసల శిల్పులు! అన్నిటినీ మించినది లీలా కృష్ణుని కాళింగ మర్దన శిల్ప విశేషం. ప్రాణ ప్రతిష్ఠ చేసినట్లు అగుపించే ఆ శిల్ప ప్రతిభ కడుంగడు ప్రశంసనీయమైనది. మనోరమమై, మనోహరమై ఒప్పిల్లే కాళింగమర్థన కేళిలో కృష్ణుని హావభావ విలాసం స్పష్టంగా శిలమీద కేంద్రీకరించుకోవడం అద్భుతం! అభయ హస్తంతో దుష్టశిక్షణ చేసిన తాండవకృష్ణుని, భర్త ప్రాణములను రక్షింపుమని వేడుచున్న కాళింగుని సతి చేతులు మోకరించిన దృశ్యం మనోయవనికమీద తారట్లాడుతుంది.

నృత్య భారతి



ఇలా చెప్పుకొంటూపోతే అంతమేలేదు. హోయసల శిల్పాలు సజీవమూర్తులు. ప్రతి శిల్పము వెనుక ఎంతో నేపథ్యముంది. ప్రతి శిల్పం ముందూ ఎంతో భవిష్యత్తు ఉంది. ఎన్ని జన్మల కృషిబలమో, ఎన్ని తరాల శ్రమదానమో మహోన్నత శిల్పసంపదలై మన జాతికొక ఉదాత్త చరిత్రను తెచ్చిపెడుతున్న హోయసల శిల్పకళా యశోసోయగాల అందాలు చిలికించే బేలూరు, హళేబీడాది పట్టణాలను భద్రంగా భావితరాలవారి కోసం గత వైభవ చిహ్నంగా కాపాడుకోవలసిన అవసరముంది. ఈ విషయాన్ని గుర్తించి సహృదయులందరూ స్పందిస్తారని ఆశించడం అత్యాశేమీ కాబోదు.



మయూర వాహనుడు షణ్ముఖుడు

[ఈ వ్యాసానికి ఉపకరించే చిత్రాలను, సాహిత్యసామగ్రిని అందించిన శ్రీ కెంచం గోపాలకృష్ణారావు గారికి కృతజ్ఞతలు !]

**—డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు**






## ( గత సంచిక తరువాయి )

ఆఫీసుకి తయారవుతూ అద్దంలో చూసుకొంది ఆరతి. అకాల వార్ధక్యం వాతపడినట్లు కళ్ల క్రింద నల్లని చారలు, వాడిపోయిన మొహం, కళ్లల్లో విషాదం, చిన్నగా నెరుస్తున్న చంపలు వయసుని పదేళ్లు పెంచాయి. ఉదయం లేవడం, ఓపిక ఉంటే వండుకోవడం ఆఫీసుకి వెళ్లడం. సాయంత్రం వచ్చాక తినాలనిపిస్తే వండుకోవడం లేకుంటే ఏ బ్రెడ్డో తిని కాసిన్ని పాలు త్రాగి పడుకోవడం. ఒంటరి తనం ... అంతా వంటరితనమే యిదివరకు ఎన్ని సమస్యలున్నా, ఏ కష్టం వచ్చినా భవిష్యత్తుపై ఏదో 'ఆశ' యివ్వన్ని 'వదుల్చుకొని వెళ్లిపోతాను' అన్న ఊహ కొండంత అండగా ఉండి ఉత్సాహాన్నిస్తుండేవి. ఆ ఉత్సాహం ముందు ఆ సమస్యలు దూదిపింజెల్లా తేలిపోయేవి. ఇపుడు తనకంటూ ఏ సమస్యలు లేవు ... ఏ కష్టంలేదు ... భూతంలా పీడిస్తున్న ఒంటరితనం తప్ప ... భవిష్యత్తుపై 'ఆశ' సన్నగిల్లిపోతోంది. రోజులు గడవమే కష్టంగా ఉంటోంది. రాజా దగ్గరనుండి వచ్చే ఉత్తరాలు పన్నీటిజల్లులా తోచడంలేదు. వ్రాసిందే పదే, పదే వ్రాస్తున్న ఆరతికి ... "నేను క్షేమం జాబ్‌కోసం ట్రై చేస్తున్నాను. త్వరలో కలుస్తాను!" అనే పొడి ఉత్తరాలు ఆమెలో ఉత్సాహాన్ని చంపేశాయి రాను రాను. అతని ఉద్దేశ్యమేమిటో తెలియదు. వినయ పెళ్లికూడా అయిపోయింది. అయిపోయిన వెంటనే "రాజా! నీకు లేక పోయినా, నాకు జాబ్ ఉంది యిల్లు ఉంది యిక్కడకొచ్చెయ్! నేనిలా ఉండి, ఉండీ నీ కోసం చచ్చిపోతానేమో భయంగా ఉంది!" అంటూ వ్రాసిన దానికి –

"రతీ! యింకా నిన్ను కష్టపెట్టి, నీ మీద ఆధారపడుతూ నీకు సుఖం లేకుండా చెయ్యమంటావా? యిన్నేళ్ల మన కలలు, కలలుగా ఉండిపోయినా ఫరవాలేదు. కానీ నేను కూడా నీకు భారంగా ఉంటూ నా ఊహలు, కోర్కెలు చంపేసుకొని బ్రతకలేను. కొద్దిరోజులు ఓపిక పట్టు" అని వ్రాసాడు. ఆ ఉత్తరం ఆమె అభిమానాన్ని గాయపరచింది. ఆనందం, ఆశ హరించుకుపోయాయి. ప్రేమ, మోహం స్థానే నిర్లిప్తత స్థానం సంపాయించుకొంది. అప్పటినుండి యింతే. ఆ పూట వండుకోకుండానే ఆఫీసుకి వెళ్లిపోయింది. అక్కడున్న కాస్సేపు పనిలోపడి తనేమిటో మరచిపోతుంది ఆరతి.

సాయంత్రం యింటికి వచ్చేసరికి యింట్లో క్రొత్త వ్యక్తిని చూసి తెల్లపోయింది. సందిగ్ధంగా గుమ్మంలో నిలబడ్డ ఆరతిని ... "మీరేనా ఆరతి! రండి అలా నిలబడిపోయారేం" అంటూ తన యింట్లోకి తననే ఆహ్వానిస్తున్న ఆ అమ్మాయిని చూస్తే విసుగొచ్చింది.

"యింతకీ మీరు..." అర్థోక్తితో ఆపింది.

"మీ అన్నయ్య చంద్రకాంత్ వచ్చారు. ఉదయం వచ్చాము యిద్దరం... అప్పటికే మీరు వెళ్లిపోయారు. తాళం పక్కింట్లో తీసుకున్నాం" సిగ్గుపడుతూ అంటుంటే ఆనందం వేసింది ఆరతికి.

"ఆ సంగతి చెప్పరేం... అరె నాకు ముందు తెలుస్తే ఆఫీసుకు శలవు పెట్టేదాన్ని టెలిగ్రాం యివ్వకపోయారా?" హుషారుగ అంది ఆరతి. "తన అన్న భార్య' 'తనవాళ్లు' 'తన తోడు' అనుకునే సరికి ఆ అమ్మాయి ఆప్తురాలయిపోయింది.

"మీ పేరు!" మొహం కడుక్కొంటూ అడిగింది.

"నళిని" అంటూ వేడివేడి కాఫీ అందిస్తుంటే కృతజ్ఞతగ చూసింది ఆరతి. ఆ రాత్రి పొద్దుపోయి తిరిగి వచ్చిన అన్నను ఆప్యాయంగా పలకరించింది. యిన్నాళ్లు తనని ఒంటరి చేసి ఎవరి స్వార్థం వారు చూసుకుంటూ, కనీసం చిన్న చెల్లి ఒకర్తి ఉందనే విషయాన్ని విస్మరించేసి యిపుడు హఠాత్తుగా నేనున్నానంటూ 'మెడకోడోలు' తగిలించుకొని ఊడిపడ్డ అన్నయ్యను చూసి ముందులా ఆలోచనలో పడలేదు. అసహ్యించుకోలేదు. అదే భాగ్యంగా భావించింది ఒంటరితనంతో వీగిపోతున్న ఆరతి. చంద్రకాంత్ మనసు విప్పి చెప్పక పోయినా, నళిని ద్వారా 'యిక్కడే స్థిరపడతారు' అన్నది విని తేలిగ్గా నిట్టూర్చి యింటి బాధ్యత నళిని చేతిలో పెట్టేసింది ఆరతి.

వాళ్లతోపాటు యింత తినడం సాయంత్రం వచ్చేసరికి నళిని యింట్లో ఉంటే కాస్సేపు కబుర్లు లేకపోతే, వంట చేసి డాబా మీద విశ్రాంతి తీసుకోవడం వాళ్లు తిరిగి వచ్చేవరకు. క్రొత్తలో బాగున్నా, వాళ్ల ఆనందానికి తను అడ్డుగా ఉందని నళిని మాటల్లో త్వరగానే అర్థం చేసుకొంది. నెమ్మదిగ నళిని సాయంత్రం వంట చెయ్యడం మానేసింది. ఆఫీసు నుండి ఉసూరోమని వచ్చేసరికి వంట చెయ్యాల్సి రావడం ఎంతో బాధనిపించినా, యిన్నాళ్లలా ఎదురు తిరగడానికి, ఏమి అనడానికి ఓపిక లేనట్లు పని చేయడమే ఉత్తమం అయినట్లు మౌనంగా వంటింటి నాశ్రయిస్తుంది ఆరతి.

మొదటి నుండి ఏ అభిమానం లేని అన్నయ్యను ఏమని అడుగుతుంది! ఉన్న రెండు గదుల్లో సర్దుకోవడం మహా చికాగ్గా ఉంది. తొమ్మిదయ్యేసరికి నళిని బాగా సింగారించుకొని ఆరతి చూస్తుండగానే క్రొత్త పెళ్లికూతుర్లా సిగ్గుపడుతూ పాల గ్లాసుతో వెళ్లి తలుపు మూసుకుంటుంది. ఆ పైన నవ్వులు, నటనలు, కేరింతలు ... ఆరతి మనసు రాజా చెంత వాలిపోయ్యేది అప్రయత్నంగా.

**జరిగిన కథ – 8 :** చంద్రకాంత్ ఆరతితో గొడవపడి ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. దారి తప్పిన చంద్రకాంత్, నందిని ప్రవర్తనలకు కలత చెందుతుంది భైరవి. తన ప్రేమికుడు రాజేష్‌తో నందిని వెళ్లిపోతుంది. చంద్రకాంత్ ఆచూకీ తెలుసుకొని కలుసుకొన్న రాజాని అవమానించి, ఇక ఆ ఇంటికి తనకు సంబంధంలేదని చెపుతాడు. కాలేజీలో తనవారిని గురించి చులకనగా మాట్లాడినవారి నోరు మూసేలా సమాధానం చెప్తుంది ఆరతి. తనకి జాబ్ రాగానే తన వారికి తను చేయవలసిన సహాయం చేసి ఆరతిని వివాహం చేసుకొంటానని ధైర్యం చెప్పి వెళ్లిపోతాడు రాజా. నందిని 'రాగిణి' పేరుతో సినిమాల్లో చేరుతుంది. ఆరతి తన ఫ్రెండ్ లలిత తండ్రి సహాయంతో ఉద్యోగం సంపాదించుకొంటుంది. నటిగా పైకి వచ్చిన రాగిణి జీవితంలో సుఖాన్ని కోల్పోయింది. మాధవరావుగారు చనిపోయారు. రాజా ఆరతికి ధైర్యం చెప్పి వెళ్లిపోతాడు. తండ్రి మరణవార్త తెలుసుకొని నందిని, చంద్రకాంత్ ఇంటికి వస్తారు. భైరవి కూడా మరణిస్తుంది. తల్లి కర్మకాండలు చేసి నందిని, చంద్రకాంత్ వెళ్లిపోతారు. రాజా రాక, ఆరతికి ధైర్యాన్నిస్తుంది. చంద్రకాంత్‌ను తమ స్వంత ఊరికి వెళ్లిపొమ్మని చెప్తుంది నందిని.

''ఈ పరిస్థితి కన్నా... ఆ వంటరి తనం ఎంత బాగుండేది!'' అనుకొంటూ తలగడలో మొహం దాచుకొని ఎడారుల్లాంటి కళ్లతో ... ''ఎప్పుడు తెల్లవారుతుందా?'' అని ఎదురుచూస్తూ రాత్రి గడపడం అంత సుళువుగా అన్పించలేదు ఆరతికి. అందుకే ఆలోచించి, ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చింది.

''నళిని నేను ఆఫీసు దగ్గర రూమ్ చూసుకొంటున్నాను. యిక్కడినుండి రోజూ వెళ్లడం, వచ్చాక వంట చేయడం అన్నీ కష్టంగా ఉన్నాయి. మీ మధ్య నేను అడ్డుగా ఉన్నానన్న భావన నాకు సిగ్గేస్తుంది. అందుకే చూస్తున్నాను దొరగ్గానే వెళ్లిపోతాను. నాకేమిటి ఎక్కడున్నా అయిపోతుంది. మీ యిల్లు మీకు అప్పచెప్పేశాను ...'' ఆఫీసుకి తయారవుతూ అంటుంటే విని ఊరుకొంది నళిని. నళిని ప్రవర్తనకు నిర్లిప్తంగా నవ్వుకొంటూ చెప్పులు వేసుకొని బయలుదేరింది ఆరతి.

* * *

''అమ్మగారు మీకు టెలిగ్రాం వచ్చింది!'' అన్న ప్యూన్ మాటలకు లేచి వెళ్లింది. టెలిగ్రాం తీసుకొంటుంటే ఒక్కక్షణం గుండె రెప రెపలాడింది.

''కమింగ్ బై ఎయిత్ కోరమండల్. కమ్ టు స్టేషన్. రాజా!'' అన్న వాక్యాలు పదే పదే చదువుకొంది. ఉప్పెనలా సంతోషం పొంగుకొచ్చింది. ఆ రోజు డేట్ చూసింది సెవన్త్. 'అంటే రేపు రాత్రి ఏడున్నరకి వస్తాడన్నమాట.' ''రాజా... నన్నెందుకిలా పరీక్షిస్తున్నావు. నా ప్రేమపై నమ్మకం పోయిందా? నాపై వ్యామోహం పోయిందా! జాబ్ దొరికిందా? అందుకేనా వెళ్తున్నాడు... నన్ను తీసుకువెళ్తాడా? ఏమో... అలా రెడీగా రమ్మని యివ్వలేదుగా... అయినా నా పిచ్చిగాని ఉద్యోగంలో చేరడానికి వెళ్తూ నన్నెక్కడికి తీసుకు వెళ్తాడు? ఇల్లు అదీ చూడవద్దూ... రాజా యిపుడుగాని నన్ను తీసుకువెళ్లకపోతే యింకెపుడూ నీతోరాను. నీకు అందనంత దూరం వెళ్లిపోతాను. అంతే ... యిన్నేళ్ల నిరీక్షణకి ఫలితం అదే అయితే ఆనందంగా భరిస్తాను. అంతేగాని యింక ఈ ఒంటరితనం భరించలేను. రాజా... మా అన్నయ్య యింట్లో నుండి నేను వచ్చేద్దామనుకొంటున్నాను తెలుసా? వదిన ... అన్నయ్య యిద్దరూ నా ఉనికి సహించలేకపోతున్నారు... ఎవ్వరికీ అఖ్ఖరలేని ఈ ఆరతి... నీ 'రతి' నీ కోసం, నీకు కావాలన్న ఆశతో నిరీక్షిస్తోంది. నీకూ అఖ్ఖరలేకపోతే చెప్పెయ్యి. శాశ్వతంగా 'గుడ్‌బై' చెప్పేస్తాను నన్నింకా పరీక్షించకు రాజా...'' ఆరతి మనసు మూగగా విజ్ఞాపన చేసుకొంటూనే ఉంది. పనిలో ఏ మాత్రం మనస్సు లగ్నం చేయలేకపోతోంది.

''అమ్మా మీకు ట్రంకాల్ వచ్చింది!'' అన్నమాటకి ఉలిక్కిపడి ఈలోకాని కొచ్చింది.

''రతీ!'' కొన్ని మైళ్ల దూరాన్నుండి ఆ పిలుపు తీగలపై ప్రయాణం చేసి వచ్చే శ్రవణనాడి ప్రకంపనాలకు గురై, మొద్దుబారిన మెదడును ఉత్తేజపరచి, ఆ ఉత్తేజాన్ని నరనరాన్న ప్రవహింపచేసి ఒక్కసారిగ జీవంతో నింపేసింది.

''రతీ! రేపు రాత్రి కోరమండల్‌కి తప్పకుండారా! మిస్ కావద్దు.''

''రాజా... ఎక్కడికి వెళ్తున్నావ్? జాబ్ దొరికిందా? అసలు సంగతి చెప్పు...'' ఆత్రంగా అడిగేసింది తెలివి వచ్చినదాన్లా!

''అబ్బబ్బ! అయిపోయాయా ప్రశ్నలు. అంత ఆత్రం పనికిరాదమ్మాయ్. రేపు స్టేషన్‌కి రా... అన్ని వివరాలు చెప్తాను. సరేగాని... రేపు వచ్చేటపుడు... నా కిష్టం అయినట్లు తయారై రా... తెలిసిందా! ఉంటాను మరి... రేపు కలుద్దాం!'' అంటూండగా లైన్ కట్టయిపోయింది. ఎన్నెన్నో అడుగుదామని, మరెన్నో చెప్దామని అనుకొన్న ఆరతి నిరాశ పడిపోయింది. ఒక్కసారి వళ్లు మండింది.

''ఛ... ఛ... ఏదీ సరిగ్గా చెప్పడు. సస్పెన్స్ కాబోలు...'' విసుగ్గా వెనుదిరిగి సీట్లో కూలబడింది. సాయంత్రం వరకు ముళ్ల మీదున్నట్లు గడిపింది. లోపల్నుండి తన్నుకొస్తున్న ఆనందం పట్టలేకపోతోంది. 'రేపు కేవలం వెళ్లి స్టేషన్‌లో కలవడమే కాదు... యింకేదో జరగబోతోంది' అన్న భావం... సిక్స్త్ సెన్స్ కలుగచేస్తోంది. యింటికి వెళ్లాలనిపించలేదు. తిన్నగ లలిత యింటికి వెళ్లింది. లలితకు పెళ్లయి వెళ్లిపోయింది, అయినా వాళ్లమ్మ నాన్నగార్ని చూసిరావాలనిపించి బయలుదేరింది. అక్కడో పావుగంట కూర్చుని బీచ్‌కి వెళ్లింది, చాలా రోజుల తరువాత వంటరిగా.

బీచ్‌లో కూర్చుంటే ఎన్నెన్నో మధురస్మృతులు ఆమె ఉత్సాహాన్ని ఉరకలు వేయిస్తున్నాయి. అలా ఎంతసేపు కూర్చుందో...

''హలో... తోడు కావాలా...'' అంటూ పలకరిస్తూ దగ్గరకొస్తున్న వాళ్లను చూసి ఉలిక్కిపడింది. తన మతిమరుపుకి తననే తిట్టుకొంటు దిక్కులు చూసింది. యించుమించు నిర్మానుష్యంగా ఉన్న బీచ్ భయాన్ని ఎక్కువ చేసింది. అయితే ఎపుడు ముందు చూపుగల ఆరతి... ఏ ఆలోచనతోనో రోడ్డుప్రక్కనే ఉన్న గట్టుపై లైటు వెలుగులో కూర్చుంది. వాళ్లలా అనగానే చటుక్కున లేచి...నడుస్తూ...

''లేదు బాబూ... ఈ వయసులో నాకు తోడెందుకు. నామీద ఆధారపడ్డ వాళ్లకు నా తోడు అవసరం...'' అంటూనే బస్ స్టాపు కొచ్చేసింది. అక్కడ నిలబడ్డ వాళ్లనుచూసి వాళ్లు వెనుదిరిగి పోతుంటే గుండెలనిండా గాలి పీల్చుకొని... జీవితంలో రెండోసారి ఆ భగవంతుడికి మనస్ఫూర్తిగా అంజలి ఘటించింది.





ఇటీవల మచిలీపట్నంలోని కాస్మోపాలిటన్ క్లబ్ స్వర్ణోత్సవాల సందర్భంగా ఒకనాటి ప్రముఖ బిలియార్డ్స్, బ్రిడ్జ్, టెన్నిస్ క్రీడాకారుడు, క్లబ్ సభ్యులందరికన్నా వయసులో పెద్దవారైన శ్రీ వడ్లమన్నాటి సీతారామారావుగారిని క్లబ్ అధ్యక్షులు శ్రీ ఎం జగన్నాథరావుగారు సన్మానిస్తున్న దృశ్యం.

# జీవన సరళిలో తీయని రవళి

ఎనిమిదిన్నరకు యింటికి చేరుకొన్న ఆరతిని చూసి అప్పుడే షికారు కొట్టివచ్చిన నళిని రుసరుసలాడింది.

'' 'సాయంత్రం వేగం రావడం అవదు' అని చెప్తే... నేనే ఆ వంటేదో చేసుకొని తగలబడేదాన్నికదా! యిపుడు ఛావాలి...'' స్టౌ వెలిగిస్తూ అంటుంటే,

''నేను భోజనం చెయ్యను నళిని — నాకు వండొద్దు!'' అనేసి కూజాలో నీళ్ళ గ్లాసెడు వంపుకొని గడగడా త్రాగేసి చాప, తలగడ పట్టుకొని డాబామీదకు వెళ్ళిపోయింది ఆరతి, నళిని విసుగు లెక్క చేయకుండా. ఎన్నో రోజుల తరువాత... వినీలాకాశంలోని చల్లదనం, చుక్కల చక్కదనం... దూది పింజెలా ఎగిరిపోతున్న మనసు మబ్బుల అంచుల్ని తాకుతూ వెలుగులు విరజిమ్ముతుంటే కంటిమీదకి నిదుర రానేలేదు. ఆ రేయి కమ్మని కలలతో... తెల్లవారిపోయింది.

* * *

పక్షుల కిలకిలారవాలు మంగళవాద్యాలుగా మేలుకొలుపు పాడాయి గాఢ సుషుప్తిలో మునిగిపోయిన ఆరతికి. మెల్లగా కళ్ళు విప్పి ముసురుకొన్న మసకచీకట్లను పారద్రోలుతూ సన్నసన్నగా వ్యాపిస్తున్న వెలుగు తెర ఆరతి జీవితానికి వెలుగుబాట చూపిస్తున్నట్లుంది. ప్రత్యూష పవనాలు మోసుకొచ్చే పరిమళాలు నాశికాపుటాలను సోకి మనసును మధురోహాల పల్లకిలోకి లాక్కువెళ్తున్నాయి. బద్ధకంగా వళ్ళు విరచుకొంటూ ...

''ఈ ప్రకృతి ఈవేళ యింత అందంగా పలుకరిస్తుందేందు కనో... రోజూ యిన్ని అందాలు ఉంటాయి ఆస్వాదించే మనసే ఉండదు. ఈ రోజు మనసున మెదిలే ఆనందం ఆస్వాదింపచేస్తుంది అంతే. ప్రకృతి ఎపుడూ ఒక్కలాగే మనుష్యులను పరవశింపచేస్తూంటుంది. మనుష్యులే మనసుల్ని బట్టి గుర్తిస్తుంటారు ...'' అనుకొంటూ నవ్వుకొంది.

ఈ డాబామీద... యిదే స్థలంలో ఎన్నిసార్లు ఒకరి కోసం ఒకరు తపించిపోతూ ఏకంకాలేని... సాన్నిధ్యంలో తనువులు మరచిపోలేదు... పిట్టగోడనానుకొని క్రిందకు చూసింది. వెలుగుతెర చుట్టుకొంటున్న తోటలో ఆనాటి సుగాత్రి, శాలీనులు కళ్ళముందు నిలచి కవ్వించారు.

''ప్చ్... అశ్రద్ధ వలన తోటంతా పాడయిపోయింది. నళినికే శ్రద్ధలు లేవు. ఎంతసేపు ఎక్స్ట్రా వేషాలు వేసినట్లు మరచిపోకుండా ప్రవర్తిస్తుంటుంది. ఈ యిల్లు,ఈ తోట... ఈ పరిసరాలు... తనతో ఎంత పెనవేసుకుపోయాయి ...'' అనుకొంటూ ఒక్కొక్క మెట్టు దిగసాగింది ...ఆ మెట్టుమీదకు వచ్చేసరికి... ఆ రోజు కాఫీ అందుకొని నడుంచుట్టు చెయ్యివేసి అలాగే మెట్లు దింపిన రాజా... గుర్తొచ్చాడు. ఆ అనుభూతి సజీవమైన కళ్ళల్లోకి ప్రాకి నిలువెల్లా పులకింప జేసింది.

''ఈ రోజు ఏమయ్యిందబ్బా... 'రాజాను కలుసుకొంటాను' అన్న ఊహే యిలా చేస్తోందా ?'' అనుకొంటూ తనను తాను సంబాళించుకొంటూ క్రిందకు దిగింది. మెట్ల దగ్గరే ఉన్న గది తలుపు తీసి ఉంది. అప్రయత్నంగా తల్లి అక్కడ పడుకొన్నట్లే అనిపించి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. మనస్సంతా ఒక్క క్షణం విషాదంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. తిన్నగా బాత్రూమ్‌కి వెళ్ళి ముఖం కడుక్కొని స్నానంచేసి వచ్చేసింది. పాతచీర చుట్టబెట్టుకొని బీరువా తెరిచింది.

''ప్చ్... ఏదీ సరైన చీరలేదు. ఏదీ ఈ మధ్య తనమీద తనకు శ్రద్ధ ఉంటే కదూ కొనుక్కొందుకి'' వెతకి, వెతకి అట్టడుగున అపురూపంగా దాచుకొన్న గులాబిరంగు ఎంబ్రాయిడరీ చేసిన అర్గండీ చీర .. దాని బ్లౌజు తీసింది. ఒకసారి పుట్టినరోజుకి రాజా ప్రజంట్ చేసింది ఆ చీర. తల దువ్వుకొంటూ అద్దంలో పరీక్షగా చూసుకొంది. నిద్ర లేమితో ఎర్రబడ్డ కళ్ళల్లో క్రొత్త అందాలు ప్రతిఫలిస్తున్నాయి.

''ఉత్సాహం, ఆనందం మనిషిమీద ఎంత ప్రభావం చూపుతాయి!'' ఆశ్చర్యంగా అనుకొంది కళ్ళనిండా కాటుక దిద్దుకొంటూ.

''రాజా... ఈ కళ్ళు నీ కోసం ఎన్ని కబుర్లు దాచుకొన్నాయో తెలుసా!'' తమకంగా అనుకొంది.

ఆఖరుసారిగ అద్దంలో చూసుకొంటూ .. ''రాజా నీ 'రతిలా' ఉన్నాను.'' అనుకొంటూ సంతృప్తి పడింది.

''నళిని నేను వెళ్తున్నాను. సాయంత్రం వచ్చేసరికి లేటవుతుంది. నాకోసం చూడొద్దు!'' అంటున్న ఆరతిని ఆశ్చర్యంగా చూసింది నళిని.

తను వచ్చిన దగ్గర నుండి ఒక్కనాడు ఆమెలో యింత ఆకర్షణమూ, ఆనందాన్ని చూళ్లేదు. ఉదయం నుండి చూస్తూనే ఉంది ఆరతి వాలకాన్ని. కాని ''ఆవిడెలాపోతే నాకేం!'' అన్న నిర్లక్ష్యంతో పట్టించుకోలేదు నళిని జవాబు కోసం ఆశించకుండానే హేండ్‌బాగ్ ఊపుకొంటూ వెళ్ళిపోయింది ఆరతి. బస్సు దిగాక ఆకలనిపించింది. టైమ్ చూసుకొంటే ఆఫీసుకి చాలా ముందు వచ్చేసినట్లు తెలిసింది. మరి అశ్రద్ధ చేయకుండా ఎదురుగా ఉన్న అలవాటైన హోటలుకి దారి తీసింది. స్వీటు, దోశె ఆర్డరిచ్చి తృప్తిగా తింది కాఫీ త్రాగాక ప్రాణం కుదుటపడినట్లయ్యింది. హుషారుగా ఆఫీసులో కొచ్చింది. శెలవు పెడదామన్న ఆలోచన విరమించుకొని, డి. ఎమ్. దగ్గరకు వెళ్ళి సాయంత్రం పర్మిషన్ అడిగి తీసుకొంది. అనవసరమే అయినా ఆత్రుత ఆ పని చేయించింది. ఒక్కొక్కగంట గడుస్తున్న కొలదీ ఆరాటంతో కాళ్ళు నిలవడంలేదు. మాటి మాటికి టైమ్ చూసుకొంటుంటే

రిప్రెజెంటేటివ్ శ్యామల్ వచ్చి ఏవో జోక్‌లు వేస్తే హాయిగ నవ్వుతున్న ఆరతిని ఆశ్చర్యంగా చూసాడు.

“మీరు నవ్వుతున్నారంటే యిన్నాళ్లకి నేను కరెక్ట్‌గా జోక్ చేసానన్నమాట ! ” అన్నాడు.

“వస్తానండి !” అంటూ అందరికి చెప్పి వెళ్తున్న ఆరతిని “ఈ రోజేం పిచ్చి పట్టలేదు కదా !” అన్నట్లు చూసారు అంతా !

* * *

చాలా ముందుగా స్టేషన్ కొచ్చేసిన ఆరతి వీక్లీ కొనుక్కొని చూస్తూ కూర్చుంది. ఎప్పటికీ టైమ్ గడవక నిముషమొక యుగంగా గడిచాక ఎనౌన్స్‌మెంట్ వినిపించింది. చటుక్కున లేచి నుంచుంది. మరి కాస్సేపటికి పెద్ద శబ్దంతో కోరమండల్ ఎక్స్‌ప్రెస్ వచ్చి ఆగింది. నిలువెల్లా కనులు చేసుకొని చూస్తున్న ఆరతి చూపుల్లో రాజా తొందరగా చిక్కుపడిపోయాడు ఫస్ట్‌క్లాసు కంపార్ట్‌మెంట్ దగ్గర. జనాన్ని తప్పించు కొంటూ ఎగిరిపడుతున్న గుండెలతో, అదిరే పెదవులతో, వణుకుతున్న కాళ్లతో తడబడుతూ వస్తున్న ఆరతిని చూస్తూ ఒక్క మెట్టన్నా దిగకుండా తన్మయంగా అలాగే చూస్తూ నిలబడ్డాడు.వగరుస్తూ వచ్చి ఎదురుగా నిలబడింది. అతను అందించిన చేయి అందుకొంటూ లోపలికి వచ్చేసింది. ప్రపంచంలో మరెవ్వరూ లేనట్లు... తామిద్దరే ఉన్నట్లు ఆమె నడుంచుట్టు చెయ్యివేసి నడిపించుకొంటూ రిజర్వ్ చేసిన ‘కుపే’ దగ్గరకు తీసుకువచ్చి తలుపు తెరచి ఆమెను లోపలికి నెట్టి... తనూ వచ్చి తలుపు మూసి లాక్ చేసాడు. అప్పటికి ఈ లోకంలోకి వచ్చిన ఆరతి కంగారుగ చూసింది. తలుపు దగ్గరే నిలబడి కళ్లల్లో తొణికిస లాడుతున్న తమకంతో నిలువెల్లా పులకించిపోతూ... ఆ పులకింతలకు రోమాంచితమౌతున్న శరీరంతో కోరికకు మారుపేరులా నిలబడి ఉన్న ‘రాజా’ను చూస్తూ... అప్రయత్నంగా తనూ నిలబడింది ఆరతి. ఎప్పుడో మరచిపోయిన ‘సిగ్గు’ ‘నేనున్నానంటూ’ ఆరతిలో చోటు వెతుక్కొంది.

“రతీ” కోటి జన్మల విరహం ఆ పిలుపులో రవళించింది. మరొక్క అడుగు వేసి ఆమెను కౌగిలిలో బంధించాడు. అలా ఉంచుకొనే వంగి కిటికీ తలుపులు మూసేసాడు. ఆరతికి ఆనందంతో గుండె పగిలి పోతుందేమో అనిపించసాగింది. నిలబడ్డానికి ఓపిక లేనట్లు అతన్నల్లుకు పోయింది. ఎన్నో ఏళ్ళుగా అణిచిపెట్టి ఉంచిన కోరిక వరదలా ముంచెత్తుతోంది. మాటలే రానట్లు గొంతులు మూగబోయినా స్వర్గానుభూతి అనుభవిస్తున్న అణువణువు పలకరించుకొంటున్నాయి ఒక జంట అధరాలు మరో జంటను వెతుక్కొంటూ ప్రయాణం చేసి... చేసి... దొరకగానే అలసిపోయినట్లు అతుక్కుపోయాయి. ఆ కలయిక లోని అపురూపమైన అనురాగధార స్రవించి తనువులను పునీతం చేస్తోంది... అలా ఎంతసేపు గడిచిందో... ఏళ్లతరబడి ప్రేమ తపస్సులో పునీతులైన వారిద్దరికీ తెలియనేలేదు. ట్రెయిన్ విజిల్ విని... యిహానికొచ్చిన ఆరతి చటుక్కున అతన్ని వదిలించుకొని భయంగా చూస్తూ—

“రాజా ట్రెయిన్ కదిలిపోతోంది !” అంది. ఆ గొంతులోని వణుకు చూసి పకపక నవ్వాడు రాజా.

“కదిలిపోనీ ! మనకేమి భయం... కదిలిపోతే తొందరగ కార్యక్రమం మొదలుపెట్టవచ్చు...” కొంటెగ అంటున్న అతన్ని అయోమయంగా చూసింది.

“అదేమిటి... మతిపోయిందా... ఆఫీసు... యిల్లు యింట్లో చెప్పలేదు... బట్టలు...” చేతిలో చూసుకొంటూ అంటుంటే..

“అయిపోయిందా, యింకేమన్నా ఉందా ? ద హెల్ విత్ యిల్లు ... ఆఫీసు ... లెట్ దెమ్ గో టు హెల్ ... లెట్ అజ్ గోటు హెవన్ !” అంటూ ఆరతి ప్రక్కనే కూలబడి బిగియార కౌగలించుకొని ఉక్కిరి బిక్కిరి చేసేస్తుంటే స్పీడందుకొన్న ట్రెయిన్ అతని ఉత్సాహాన్ని రెట్టింపు చేసింది.

“రాజా ! ఏమిటిది ? అసలు సంగతేమిటి ... నా బట్టలు. మరి ఈ సంగతి ముందే లెటర్ వ్రాస్తే ప్రిపేరయి వచ్చేదాన్నిగా ... ” కినుకగా అంది కట్టుకొచ్చిన చీరవంక చూసుకొంటూ.

“నువ్వు ప్రిపేరయివస్తే థ్రిల్ ఉండదుగా ... అబ్బ ఈ క్షణం కోసం ఎంత ఆరాటపడ్డాను. ఎన్నివేల గంటలు యుగాలుగా గడిపాను. ఎంత నిరాశపడిపోయాను ... ఆఖరికి యిప్పుడిలా నిన్ను నా దాన్ని చేసుకోగలిగాను ... ” రిలాక్స్ అవుతూ తనలో తనే అనుకొంటు న్నట్లు అంటుంటే యింకా జరుగుతున్నది అర్థం కానట్లు బెరుగ్గా భయంగా చూస్తోంది ఆరతి.

“రతీ ... యింకా నీకు అనుమానంగా ఉంది కదూ ... సరే ముందు నీ అనుమానం నివృత్తి చేసి ... ఆ తరువాత ఈ అందాల కళ్ళలో మెరిసే కోటికాంతుల వెలుగులో జీవన పథాన్ని పాలపుంత చేసుకొంటాను ... ” తన్మయంగా అన్నాడు. సీటు క్రింద దాచిన సూట్‌కేస్ పైకి తీసాడు. కాళ్లు పైకి మడచి మఠం వేసుకుకూర్చుని, గడ్డం క్రింద చేతులు పెట్టుకొని చూస్తోంది ఆరతి.

“రతీ కళ్లు మూసుకో -- అబ్బ మూసుకోమంటుంటే...” మెడమీద ఏదో ప్రాకినట్లయి భయంగా ఉలిక్కిపడి కళ్లు తెరిచేసింది.







## జీవన సరళిలో తీయని రవళి

పచ్చని తాడుకి మధ్యలో గుచ్చబడిన మంగళసూత్రం. ఆశ్చర్యపోతూ తల వెనక్కి వంచి రాజా కళ్ళల్లోకి చూసింది.

''రతీ.. నాకింతకన్నా మంచి అయిడియా రాలేదు. బాధగా ఉందా ఎవరూ లేరని. రతీ... పరుగెడుతున్న ఈ చెట్లు, ట్రెయిన్‌లో వెలుగుతున్న లైట్లు అలా కనిపిస్తున్న నీలాకాశం — మన వెంటనే పరుగులు తీస్తున్న భూమాత యింకా మనసునిండా నిండిపోయిన యిష్ట దైవాల సన్నిధిలో సర్వాంతర్యామి సాక్షిగా ఆరతి అనే నిన్ను నా భార్యగా స్వీకరిస్తున్నాను. నీ కష్టంలో, సుఖంలో నీ భావి జీవితానికి పూర్తిగా బాధ్యత ఈ క్షణంనుండి వహిస్తున్నాను.'' గుండె లోతుల్లోనుండి వెలువడ్డ ఆ మాటలు ఆర్తిగా ఆప్యాయంగా మరెన్నో భావాలు కలగా పులగంగా వెలువడి మృదుమధురంగా ఆరతి చెవులను సోకాయి. అంతటి ఆనందాన్ని భరించలేనట్లు — అతని నడుముచుట్టూ చేతులువేసి హత్తుకుపోతూ... ''రాజా'' అంటూంటే కళ్ళు రెండూ నయాగరాలైనాయి. అది సంతోషమో, దుఃఖమో తెలీకుండా అవిరామంగా వర్షిస్తున్న... ఆ కన్నీరు తుడిచి లేవనెత్తి గుండెలకు హత్తుకొన్నాడు. ''రతీ యిప్పటికి నమ్మకం కలిగిందా?'' మనసులు ఏనాడో ముడిపడిపోయిన మనకు తనువులు పెనవేసుకొందుకి ముహూర్తం... బాజాలు ఎందుకు ? ఏదో సెంటిమెంట్ అంతే. అందుకే న్యాయంగా, ధర్మంగా నిన్ను అర్ధాంగిగా చేసుకొన్నాను. రతీ ఈ రైలుపెట్టె మన పెళ్లి మంటపం... మన శోభనం గది... అన్నాడు. ఏం బాగుందా...'' చెవిలో గుసగుసగా అంటుంటే ముడుచుకుపోతూ మరింత ఒదిగిపోయింది అతనిలో

''రాజా... యింత ఆలోచనలో నన్ను భాగం పంచుకోకుండాచేసి ఒక్కడివే ఆ థ్రిల్ అంతా అనుభవించేశావా దొంగ. రాజా ఎక్కడికి తీసుకుపోతున్నావ్ ? నువ్వెక్కడికి తీసుకువెళ్తే అదే స్వర్గం. యింక ఈ ఒంటరితనం భరించలేను. నన్నెపుడు వెళ్లమనకు రాజా...''

''పిచ్చి రతీ... యింక నిన్నెక్కడకు వెళ్లమంటాను ? నాలోనే దాచుకొంటాను. ఇదిగో ఈ సూట్‌కేస్‌లో నీకోసం చీరలు, లంగాలు, విమల సైజులో కుట్టించిన జాకెట్లు చూడు. యిందులో విమల సహాయం కూడా చాలా వుంది తెలుసా ? రతీ... మరి... నాకిచ్చేందుకు నీ దగ్గర ఉన్నది... యిచ్చేస్తావా ?'' అంటుంటే సిగ్గుపడిపోయింది.

అంతలో బాస్కెట్ తీసి కనకాంబరాలు, సన్నజాజుల మాల తీసాడు. మౌనంగా వెనుదిరింది. ఆ బారెడు జుట్టులో ఎలా తురమాలో అర్థం కానట్లు జడంతా చుట్టేశాడు.

''అంతేనా... యింకేమైనా ఉన్నాయా...?'' అప్పటికి స్థిమిత పడ్డ ఆరతి వేళాకోళంగా అంది.

''అమ్మమ్మ అపుడేనా'' అంటూ మరో పేకట్ తీసి తెరిచాడు. కోవా స్వీట్స్! 'యింకా' వెక్కిరింతగా అంది. ఫ్లాస్కు తీసి గ్లాసులోకి వంచాడు చిక్కని బోర్నవిటా. ఫక్కున నవ్వింది ఆరతి.

''యింకేం అబ్బాయిగార్కి అన్ని తెలుసన్నమాట — ఏమిటో అనుకొన్నాను'' స్వీట్స్ తీసి అతని నోట్లో పెడుతూ అంది. ''నీకు నచ్చింది కదా ! హమ్మయ్య థేంక్ గాడ్. ఎన్ని రోజుల నుండి ఆలోచించి బుర్ర బద్దలు గొట్టుకున్నానో తెలుసా ? స్నేహితుల సలహాలు, విమల

ఇటీవల కిన్నెర ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదు ఆధ్వర్యంలో శ్రీ రాఘవాచార్యులు ఆంగ్ల కావ్యం 'ది హెవెన్ ఆఫ్ టియర్స్' ఆవిష్కరణ సందర్భంగా ధ్వన్యనుకరణని ప్రదర్శించిన మిమిక్రీ కళాకారుడు శ్రీ చిల్లర సుధాకర్‌ని అభినందిస్తున్న జస్టిస్ శ్రీ పి. కోదండరామయ్య, ఆచార్య తిరుమలగార్లని చిత్రంలో చూడవచ్చు.



# సిరిలాక్

## మంచి మీపాపకు ఒక బహుమతి



## ఉచితం

### ప్రతీ డబ్బాతోపాటు, ఒక చిన్న గిన్నె

ఈ సదుపాయం ఎంపికచేసిన పట్టణాల్లో మాత్రమే లభిస్తుంది.




NESTLÉ

# సిరిలాక్®

రుచికరమైన రూపంలో అన్ని పోషక పదార్థాలుగల సంపూర్ణ ఆహారం

# జీవన సరళిలో తీయని రవళి

సహాయంతో బుర్ర ఉపయోగించి యింత అందమైన రాత్రిని తయారు చేసాను దేవిగారి కోసం...యింకా దూరం, దూరం ఎందుకు ?'' అంటూ ఆమె ఒళ్లో తల పెట్టుకొని పడుకొన్నాడు. ఎందుకో హఠాత్తుగా మూగబోయారిద్దరూ. లయబద్ధంగా చప్పుడు చేస్తూ పోతున్నది రైలు.

''రాజా! ఈ జన్మకీ అదృష్టం పట్టదనుకొన్నాను. యింత త్వరగా కరుణిస్తావనుకోలేదు. ఈరోజు నువ్వుగాని నన్ను తీసుకువెళ్లక పోతే యింకెపుడూ నీకు అందనంత దూరం పోదామనుకొన్నాను.'' అంటుంటే ఆరతి గొంతు వణికింది.

''రతీ యిన్నేళ్లు తపస్సు చేసింది యిందుకే! కలకత్తాలోని ప్రయివేటు కంపెనీలో జాబ్ దొరికింది జాయిన్ అయిపోయా... అక్కడ యిల్లు చూసి అన్ని ఎరేంజ్ చేసుకొని నాలుగురోజుల శలవు మీద వచ్చాను. నాన్నగార్కి, అమ్మకు చెప్పేశాను. వినయ పెళ్లికి చేసిన అప్పుకోసం డబ్బు పంపిస్తానని... విమల బాధ్యత నేను వహిస్తానని... చెప్పేసి... నిన్నిట్లా తీసుకొని వచ్చేస్తున్నట్లు చెప్పేసాను. మా మూలుగా నే గొడవయ్యింది. కానీ విమల సపోర్టు... నేనిచ్చిన డబ్బు... వాళ్లకి కొంత ఉపశమనం కలిగించాయి. యింక ఏం చెప్పినా వినేస్థితిలోలేనని తెలుసుకొని అయిష్టంగానైనా గ్రీన్ సిగ్నల్ యిచ్చేశారు యిక మన జీవితం మనది. రేపు వెళ్లాక యింటికే టెలిగ్రాం యిచ్చేద్దాం. నీ ఆఫీసుకి రిజిగ్నేషన్ లెటర్ పంపించెయ్ రతీ... నీకే కష్టం కలిగినా... నాతో మనసువిప్పి చెప్పాలి. 'నీకు యింకెవరూ లేరన్న' భావం ఏ మాత్రం కలగకూడదు. నీకే బాధ కలగకుండా గుండెల్లో దాచుకుంటాను. రతీ'' అతనలా చెప్తుంటే ఎన్ని జన్మలైనా అలా వింటూ ఉండాలనిపిస్తోంది. జవాబు చెప్పాలనే అనిపించడంలేదు.

''రాజా! ఆపకు... యింకా చెప్పు. నీ పాదాలచెంత కాస్త చోటిస్తావనుకొన్నాను... నీ గుండెల గుడిలో నిలుపుకొంటే... నేనంత ఆప్యాయత భరించగలనా ? రాజా... నా కోసం యింత చేసిన నీకు నేనే మివ్వగలను ?'' ఏదో లోకంలో ఉన్నట్లు అంటున్న ఆరతిని చటుక్కున ముందుకు లాక్కుని...

''ఏమిస్తావని... యిదంతా చేసాననుకొంటున్నావు...'' రహస్యంగా అంటుంటే ఉక్కిరిబిక్కిరి అయిపోయింది ఆరతి.

''రతీ... ఈ జీవన సరళి ఎంతో విచిత్రమైంది కదూ!'' ముంగురులు సవరిస్తూ నమ్మలేనట్లు అన్నాడు.

''ఊ'' అంటూ అతన్నల్లుకుపోయింది ఆరతి తనూవల్లరి.

లయగా సాగిపోతున్న రైలు చేసే శబ్దం వింతగ, క్రొత్తగ, మత్తుగ తీయనిరవళిలా వాళ్ల ఎదలలో రవళిస్తోంది. గమ్యంకోసం పరుగుతీస్తున్న రైలుతో పోటీపడుతూ వాళ్ల హృదయాలు సుందర నందనోద్యానంలో పురులువిప్పి ఆడుతూ... విహంగాల్లా ఎగిరిపోతున్నాయి దేన్నో... వెతుక్కొంటూ.

*(అయిపోయింది)* ★

## అంకితం

''రాజాలాంటి ప్రేమమూర్తులు ఎక్కడన్నా ఉంటే... 'ఆరతి' లాంటి అదృష్టవంతురాలుంటే... వాళ్లకి అంకితం.''

_ రచయిత్రి.

కిలా చేసింది ? అక్కడ బస్సెక్కితే మా వూరు రావడానికి గంటన్నర కంటే ఎక్కువ సమయం పట్టదు. అలాంటిది నిన్న ఉదయం బయలు దేరిన అమ్మఏమైంది? ఎక్కడకు పోయింది??...

అంతులేని ఆలోచనల మధ్య కారు చీకట్లో కాంతి రేఖలా నాలో తళుక్కున చిన్న మెరుపు మెరిసింది. జయతో చెప్పి అప్పటికప్పుడు మా వూరు బయలుదేరాను. అక్కడ మేమెవరం లేక పోయినా — పెద్దన్నయ్య పిల్లలూ, ఎన్నో ఏళ్ళ పాటు మాకు నీడనిచ్చిన యిల్లూ వున్నాయి. పిల్లలమీదా, ఆ యింటిమీదా అమ్మకు అంతులేని మమకారమని నాకు తెలుసు. ఎంత స్థిమితం లేకపోయినా "ఆ యిల్లు వాళ్ళకొదిలేయండిరా" అని అమ్మ అప్పుడప్పుడూ అనేది. తప్పనిసరిగా అమ్మ అక్కడికే వెళ్ళుంటుందన్న నమ్మకంతో— రెండు గంటల తర్వాత వూళ్ళో బస్‌దిగి — ఇంట్లోకి అడుగుపెట్టాను. నిమిషం తర్వాత నా నమ్మకం నీరుకారిపోయింది. మామ్మకనిపించడంలేదన్న సంగతి తెలియగానే వాళ్ళంతా కంగారుపడ్డారు. ఆ చుట్టుపక్కల వెతకమని వాళ్ళకు చెప్పి — అక్కడనుండి మా చిన్నన్నయ్య వూరు చేరుకున్నాను. నేను వెళ్ళేసరికి అనంతరావు తమ్ముడు ఆరేళ్ళ బుచ్చిబాబు అన్నం తింటున్నాడు. మిగిలిన వాళ్ళ జాడ లేదు.

"మీ నాన్నా, అన్నయ్యా ఏరి" వాణ్ణి అడిగాను.

"ఇంకా ఇంటికి రాలేదు" అన్నాడు బుచ్చిబాబు.

"మరి మామ్మేదిరా బుచ్చీ ?" అనుకోకుండా ఆ ప్రశ్న నా నోటినుంచి వెలువడింది.

"కోపగించి మీ యింటికొచ్చేసిందట కాదేటీ" అన్నాడు నోరు సాగదీసుకొని బుచ్చి.

"ఎందుకు కోపగించిందిరా బుచ్చీ ?" బుజ్జగింపుగా అడిగాను.

"మామ్మకు విరేచనాలవుతుంటే—బట్టలు పాడవుతున్నాయని అమ్మకోపంగా మాట్లాడింది. మామ్మేదో అంటే అమ్మ కర్ర తీసుకొని మామ్మ వీపుమీద కొట్టింది. మామ్మ ఏడుస్తూ సంచి తీసుకొని వెళ్ళిపోయింది..." వాడింకా ఏదో చెబుతున్నా ఆ మాటలు నాకు వినిపించలేదు. 'ఎంత దారుణం ? అమ్మనలా బాధపెట్టడానికి వదినకు చేతులెలా వచ్చాయ్ ?' బాధతో నా మనస్సు విలవిల్లాడింది. నా కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. ఆ మరుక్షణమే కోపంతో నా నరాలు వుప్పొంగాయి... సరిగ్గా అప్పుడే వదిన లోపలికొచ్చి, "అత్తయ్య కనిపించారా మధూ ?" అంది నన్ను చూస్తూనే.

నా ఒళ్ళు మండిపోయింది, "కనిపించారు. ఆ శుభవార్త చెప్పడానికే వచ్చాను" అన్నాను, అతి కష్టంమీద కోపాన్ని నిగ్రహించుకుంటూ.

వదిన తెల్లబోయి — మరుక్షణం నా మాటల్లోని వ్యంగ్యాన్ని గ్రహించి తనూ నా వైపు తీవ్రంగా చూసింది.

"అమ్మకు మతిలేదనీ — వెంట మనిషినిచ్చి పంపాలనీ నీకు తెలియదా ?" అన్నాను.

"తెలుసుబాబూ ... ఎందుకు తెలియదు ? పంపడానికి వారంరోజులు గడువుందని కూడా తెలుసు. మేము తినో తినకో ఆవిడకు పెడుతున్నాము. తిన్న దగ్గర్నుంచీ బట్టలుపాడు చేసుకుంటూంటే ఎలా ఓర్చుకొనేది ? ఓర్పుకోలేక నిన్న చిరాకు పడ్డాను. అంతే ... ఆవిడకు రోషం పొడుచుకొచ్చి నీ దగ్గరకు వెళ్ళిపోతానని పట్టుబట్టి కూర్చున్నారు. ఎంత చెప్పినా వినిపించుకోలేదు. మీ అన్నయ్యేమో చేస్తున్న వ్యాపారం స్థిరం లేదని — ఆ గొడవలో పడి తిరుగుతున్నారు. సమయానికి ఇంట్లో ఎవరూ లేరు ... నా దగ్గర నాలుగురూపాయలుంటే యిచ్చి పంపించాను" అంది తేలిగ్గా.

వదిన నిజం చెప్పలేదన్న విషయం నాకు స్పష్టమైంది. ఒంట్లో బాగుండని మనిషిని నిర్దాక్షిణ్యంగా కొట్టి—వెళ్ళిపోతూంటే చూస్తూ వూరుకున్న వదిన అసలు వుద్దేశ్యమేమిటో నా కర్థమైంది.

అంతలోనే అన్నయ్య వచ్చాడు. జరిగిన సంగతి తెలియగానే అన్నయ్య మొహం కోపంతో జేవురించింది. నోటికొచ్చినట్టు వదినను తిట్టిపోశాడు. ఆవిడెందుకో ఏడుపు మొదలుపెట్టింది. చెయ్యవలసింది చేసి - ఏమీ ఎరగనట్టు ఏడవడం కొందరాడవాళ్ళ లక్షణం! అంతటితో ఆగకుండా "అత్తగారు ఏమైపోయారో! ముసలిదాన్ని ఇంట్లోంచి వెళ్ళగొట్టానని అందరూ నన్నాడిపోసుకుంటారు ..." అంటూ ఏడుపు స్థాయిని మరింత పెంచింది.

ఆపుకోలేని కోపంతో అన్నయ్య వదిన మీదికి చెయ్యెత్తాడు — ఆ చేతిని పట్టుకొని, అన్నయ్యను శాంతింపజేసి "ఇప్పుడు ఆవేశపడి చెయ్యగలిగింది లేదు. అమ్మ కనిపించకపోతే



# వృద్ధాప్యం నేరమా ?

తెలిసిన వాళ్ళంతా మనల్ని దుమ్మెత్తిపోస్తారు. దున్నపోతుల్లా యిద్దరుండి కాటికి కాళ్ళు చాచుకున్న ముసలిదాన్ని కాలం తీరేవరకూ చూడలేకపోయారని చెవులు కొరుక్కుంటారు. అందుచేత ఆవేశం కట్టిపెట్టి ఏం చెయ్యాలో ఆలోచించు !'' అన్నాను.

''అమ్మ వెళతానంటే మామూలుగా మనిషిని తోడిచ్చి పంపిందనే నేననుకుంటున్నాను మధూ ! ఇలా జరిగిందని నా కింతవరకూ తెలియదు. ఇప్పుడేం చేద్దామంటావ్ ?'' అని నన్నే ప్రశ్నిస్తూ అన్నయ్య దిగాలుపడి కూర్చుండిపోయాడు.

నేనేంమాట్లాడలేదు. మా మధ్య కొద్దిసేపు నిశ్శబ్దం రాజ్యం చేసింది. అప్పటికి రాత్రి పది దాటిపోయింది. సమయం గడుస్తోందేగానీ ఏం చెయ్యాలో నాకూ తోచడంలేదు. ఏది చెయ్యడానికైనా అమ్మ ఫొటో కూడా మాదగ్గర లేదు. వూరూరు తిరిగి గాలించడం తప్ప మరో గత్యంతరం లేదనిపిస్తోంది. గోటితో పోయేదానికి గొడ్డలి వరకూ పోవడం అంటే ఏమిటో ఆ క్షణాన నాకు తెలిసొచ్చింది.

దగ్గరగా మూసివున్న వీధి తలుపు తెరుచుకొని హడావుడిగా అనంతరావు లోపలికొచ్చాడు, ''మాఅమ్మ రాజమండ్రి బస్సెక్కడం నిన్న రిక్షా వీరయ్య చూశాడట'' అన్నాడు.

ఆ మాట వినడంతోనే అమ్మ రాజమండ్రి వరకూ వచ్చి — మా ఇంటికి చేరుకోలేకపోయిందేమోనన్న అనుమానం నాలో కలిగింది. అమ్మ రాజమండ్రిలోనే ఎక్కడోచోట కనిపిస్తుందన్న నమ్మకం నాలో చోటు చేసుకొంది. ఈ ఆలోచన కలిగిన మరుక్షణం ఇక అక్కడ నిలవాలనిపించలేదు, ''ఇక్కడ నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. మేము రాజమండ్రిలో యెంక్వయిరీ చేస్తాం'' అని అన్నయ్యకు చెప్పి — అనంతరావుతోబాటు రోడ్డుమీదకొచ్చాను. ఆ సమయంలో బస్సులు అరుదుగా వస్తూ — పోతుంటాయి. బస్ కోసం నిరీక్షించి లాభంలేదని అటుగా వస్తున్న ఓ లారీ ఆపుజేసి ఎక్కి కూర్చున్నాం. సుమారు గంటన్నర తర్వాత బస్ స్టేషన్ సమీపంలో మమ్మల్ని దింపి వెళ్ళిపోయింది లారీ. ముందుగా బస్ స్టేషన్ దగ్గర్నుంచి వెతకడం ప్రారంభించాం...

సరిగ్గా అప్పుడే కుటుంబ సమేతంగా సినిమా చూసి వస్తున్న రాంబాబు మేస్టారు కనిపించారు. ఆయన మా ప్రక్క వీధిలోనే వుంటున్నారు. మా కిరణ్‌కు ఆయనే ప్రైవేటు చెబుతుంటారు — ''ఏదైనా వూరెళ్ళి వస్తున్నావా ?'' అన్నారు నన్ను చూస్తూనే. అమ్మ సంగతి ఆయనకు చెప్పాను. విని చాలా నొచ్చుకున్నారాయన...

''ఎందుకా ముసలామెతో అలా ఫుట్‌బాల్ ఆడుతున్నారు ! ఎవరు చూస్తే ఏం పోయింది చెప్పు ? ఆవిడేం పట్టుచీరలూ, పంచదార అరిశెలూ, పౌడరూ, స్నోలూ అడుగుతుందా ఏమిటి ? వేళకు గుప్పెడన్నమే కదయ్యా మీరు పెట్టేది. సరే, జరిగిపోయాక అనుకొని ఏం లాభం ? ముందు పని చూడండి,'' అంటూ నా మొహం వాచేలా చివాట్లుపెట్టి వెళ్ళిపోయారాయన.

నేను అనుకున్నంతా అయింది. వదిన తొందరపాటు వల్ల ఇంకా ఎందరు ఎన్ని రకాలుగా అంటారోనన్న భయం ఆ క్షణాన నాలో కలిగింది. మాస్టారన్నట్టు చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టయింది మా పని. ఆ చుట్టు ప్రక్క ప్రాంతాలన్నీ ఉదయం పదిగంటల వరకూ గాలించినా అమ్మ కనిపించలేదు. ఇక అమ్మ కనిపించదేమోనన్న నిరాశ నా నవనాడుల్నీ కృంగదీస్తోంది నీరసం, నిస్సత్తువ నన్నావరించుకున్నాయి. అనంతరావును వాళ్ళ వూరెళ్ళమని చెప్పి నేను యింటికి వచ్చాను.

''అత్తయ్య ఎక్కడున్నారు?'' ఆత్రంగా అడిగింది జయ.

జరిగింది ఆమెతో చెప్పాను. ఆమె బలవంతం మీద నాలుగు ముద్దలు తిని, మా కిరణ్‌ని వెంటబెట్టుకొని మళ్ళీ అమ్మకోసం అన్వేషణ మొదలుపెట్టాను.

*　　*　　*

రాత్రి ఒంటిగంట వరకూ తిరిగినా ఫలితం దక్కలేదు. విపరీతంగా అలసిపోయిన శరీరం విశ్రాంతిని కోరుతుంది. తిరుగు ముఖంపట్టి రైల్వేస్టేషను దగ్గర కొచ్చేసరికి—రైలుకింద పడి ఎవరో చచ్చిపోయారని చెప్పుకుంటున్నారక్కడ. ఆ మాట వినడంతోనే భయాందోళనలతో నా శరీరం వణికిపోయింది. శిలలా అలాగే నిలబడిపోయాను. కొన్ని క్షణాల అనంతరం తేరుకొని ''ఎవరూ-ఏమిట''ని విచారిస్తే— చచ్చిపోయిందొక వృద్ధుడనీ, అతడికి నలుగురు కొడుకులనీ తెలిసింది. నలుగురు కొడుకులున్న ఆ ముసలివాడికి ఇలాంటి చావు రావాల్సింది కాదని అక్కడంతా అనుకుంటూంటే—సిగ్గుతో కుచించుకుపోతూ యిల్లు చేరుకున్నాను. కిరణ్ పడుకున్నాడూ-వచ్చిన వెంటనే అలసటతో.

నేను కూడా పడుకున్నానన్నమాటేగాని నాలో దుఃఖం ఆగడం లేదు. అమ్మరూపం కళ్ళ ముందు నిల్చి నన్ను వెక్కిరిస్తోంది...'వెధవల్లారా ... కళ్ళెదురుగా వున్నంతసేపు నన్ను వంతులేసుకొని నానా హింసా పెట్టారు. కనిపించకుండా పోతే ఎందుకురా ఏడుస్తారు?' అని అమ్మ నన్ను నిలేసి ప్రశ్నిస్తున్నట్టనిపించింది... ఎటూ తోచని స్థితిలో — యెనలేని దుఃఖంతో కొట్టుమిట్టాడుతున్న నా సమీపానికి జయ వచ్చింది, ''సుమారు ఏడెనిమిది నెలలుగా ఓ క్రమపద్ధతిలో జరుగుతూ వస్తున్నది— అందుకు భిన్నంగా ఇలా ఎందుకు జరగాలి ? అప్పటికప్పుడు ప్రయాణమై అత్తయ్య వచ్చేస్తూంటే చూస్తూ మీ వదినెలా వూరుకొంది ? ఈ అనర్థానికి, మన అందరికీ మనశ్శాంతి లేకుండా పోవడానికి కారణం ఆవిడే. ఆవిడకు యిష్టం లేకపోతే ఇక్కడకు తీసుకొచ్చి దిగబెట్టాల్సింది. లేకుంటే ఉత్తరమైనా వ్రాసి వుండాల్సింది. ఇప్పుడు మనిషి కనిపించకుండా పోయారంటే ఎంత అప్రదిష్టో చూడండి!'' అంది కళ్ళ నీళ్ళు పెట్టుకొని జయ.

జయ మాటలు నాలో మరింత మనఃక్లేశాన్ని కలిగించాయి. ఆమె అన్నదాంట్లో చాలా మట్టుకు నిజం దాగివుంది. నిన్నటికి నిన్ననేగాక ఇంతకుముందుకూడా వదిన అమ్మను శారీరకంగా హింసించి వుంటుంది. మతి స్థిమితం లేనంతలో మనిషి కోపం చచ్చిపోదు. ఇదివరలో నాలుగైదు

ఇటీవల విజయవాడ ·రోటరీక్లబ్‌వారు నిర్వహించిన కార్టూన్‌ల పోటీ విజేతలకి బహుమతి ప్రదానోత్సవ సందర్భంగా విచ్చేసిన కార్టూనిస్టులు. ముందు వరుసలో శ్రీయుతులు బొమ్మన్, తులసీరాం, ఎమ్వీఆర్, ఉత్తమ్, శేఖర్, బాలి, రోటరీ అధ్యక్షులు శ్రీ ఆకి ఆంజనేయులు, విఠల్, సుబ్రహ్మణ్యం, రాజు ఉన్నారు.



# వృద్ధాప్యం నేరమా ?

సార్లు 'మధూ, నేనిక అక్కడకు వెళ్ళనురా - నీ దగ్గరే వుండిపోతాను' అన్న అమ్మమాటలు ఆకస్మికంగా నాకు జ్ఞప్తికొచ్చాయి. ఆ మాటల కర్థం నాకిప్పుడు బోధపడింది. బోధపడినా బాధపడినా అమ్మ ఇప్పుడు లేదు — కనిపించడం లేదు... కనిపిస్తూ కళ్ళెదుట వున్నన్నాళ్ళు - నేను ఒక్కడ్నే ఎందుకు చూడాలన్న స్వార్థం నా కళ్ళు మూసేసింది.

అమ్మకు నేనొక్కడ్నే అయివుంటే ఇలా వంతులేసుకునే అవకాశం వుండి వుండేదా ? జన్మనిచ్చిన తల్లినీ — తండ్రినీ చివరి దశలో చూడ్డానికి మనిషికెందుకింత స్వార్థం ? ఎందుకని అసహ్యం ? ? ఏదీ అసహ్యమనుకోకుండా భరించి, పాలిచ్చి, లాలించి పెంచి పెద్ద చేసిన తల్లికి పట్టెడన్నం పెట్టడానికి పరిస్థితులు సహకరించవా ? రేపన్నరోజున నేను, నా భార్యా, నా వదిన — యిలా ప్రతి ఒక్కరికీ ఎదురయ్యే సమస్యేకదా యిది. వృద్ధాప్యం మనిషికి నేరమా? వయస్సు మీదపడ్డ వాళ్ళు బ్రతుకులే ఘోరమా?— పెద్దన్నయ్య చనిపోగానే ఇంత దూరం నేనెందు కాలోచించలేదు ? నాలోని స్వార్థం అమ్మను వంతులేసుకునే వూహకు రూపం కల్పించిందా? నాలో మంచి చెడుల సంఘర్షణ జరుగుతూ — భరించ శక్యంగాని బాధ మనస్సును చిత్రవధ చేస్తూండగానే భళ్ళున తెల్లవారింది

అప్పుడే అన్నయ్య వచ్చాడు. వీనులవిందైన వార్త తెచ్చాడేమోనని నేను ఎంతో ఆశపడ్డాను- అన్నయ్య పెదవి విరిచాడు నా ముఖంలోకి చూసి బరువుగా నిట్టూర్చాడు.

జయ యిచ్చిన టీ త్రాగి అమ్మకోసం మళ్ళీ అన్వేషణ మొదలుపెట్టాం ? ''

* * *

అమ్మ మాకు కనిపించకుండా పోయి ఆవేళ కైదు రోజులైంది. ఈ అయిదు రోజులుగా కంటికి నిద్రలేదు; కడుపుకింత తిండిలేదు; మనసుకు శాంతిలేదు అటు పెద్దన్నయ్యగారి పిల్లలూ — ఇటు నేనూ, అన్నయ్యా, అనంత రావూ — అడిగినచోట అడక్కుండా — వెళ్ళిన వూరు వెళ్ళకుండా మతులు పోగొట్టుకొని — తిరిగి, తిరిగి అలసిపోయాం. అమ్మ జాడలేదు మమ్మల్ని కన్నతల్లి కనిపించలేదు

ఇక అమ్మ కనిపిస్తుందన్న ఆశ నాలో అంతరించిపోతోంది. ఆ మాట తలపుకొస్తేనే ఆనకట్ట తెగిన నదిలా నాలో దుఃఖం పొంగి పొర్లుతోంది. నిజానికి అమ్మ చనిపోయినా ఇంత వ్యధ అనుభవించేవాణ్ణికాదు — ఈ జీవిత నాటక రంగంలో ఆమె పాత్ర పరిసమాప్తి అయి పోయిందనే తృప్తి అయినా మిగిలివుండేది కనీసం ఇప్పుడా తృప్తికూడాలేదు. అనుక్షణం ''అమ్మ ఏమైపోయింది ? ఎక్కడుంది ?'' అన్న జవాబు లేని ప్రశ్నలతో సతమతమైపోతున్నాను అమ్మ

## నీవూ .... రైతువే !

చీకటి పొలములో
ఆశ అనే మొక్కను నాటి
మధురోహల గొప్పులు త్రవ్వి
కరుణ రసాల ఎరువును వేసి
ప్రేమ అనే నీరును పోసి
వెలుగు పంటల కోసం
ఎదురు చూసే ''నీవు''
అందని భావాలకు
వెన్నెముకవు !

— మేడేపల్లి రంగవల్లి

మాకు దూరం కావడానికి కారణమైన వదిన మీద అంతులేని కోపం ముంచుకొస్తూంది . ఈ వృద్ధాప్యంలో, మతిలేని స్థితిలో అమ్మ ఎన్ని బాధలు పడుతుందోనన్న ఆలోచన నా అణువణువునూ దహించి వేస్తోంది ఆలోచించి ఆలోచించి మొద్దుబారిన మస్తిష్కంతో — ఇక ఆలోచించలేక -- ఇంటి వసారాలో వాలుకుర్చీ వేసుకొని, వెనక్కు జారబడి కళ్ళు మూసుకున్నాను

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు ఎవరో పిలిచినట్లై చటుక్కున కళ్ళు విప్పాను. ఎదురుగా రాంబాబు మాస్టారు — ఆయన ప్రక్కనే అమ్మ ! ఆమెనంత ఎమీసంగా చూడబట్టే నా తల్లి అని గుర్తించగలిగాను కాని- ఏ మాత్రం దూరంలో వున్నా గుర్తుపట్టలే నంతగా మారిపోయింది ఆమె రూపం . మా వీధిలో ఇంటింటికీ తిరిగి అడుక్కునే ముసలామెకు, అమ్మకు ఏ మాత్రం వ్యత్యాసంలేదు కుర్చీ లోంచి గభాలున లేచి, ఆనందోద్రేకాలతో అమాంతం అమ్మను కౌగలించుకున్నాను కానీ, ఆమెనుంచి నేనాశించిన ఫలితం రాలేదు కళ్ళు చిట్లించి క్షణంసేపు నావైపు చూసి--చూపు మరల్చుకొంది అమ్మ

''అమ్మా ! నేనమ్మా మధుని నీ మధునమ్మా !'' అన్నాను ఆవేదనగా

''అత్తయ్యా నేను మీ జయని'' అంది అప్పుడే అక్కడకు వచ్చిన జయ – ఆమె వెనుకే వచ్చిన పిల్లలు అనుమానాస్పదంగా అమ్మను చూస్తూ నిలబడి పోయారు

అమ్మ మా అందరి వైపూ ఓ మారు చూపు సారించింది ''ఆఁ ఆఁ'' అని క్షణం తర్వాత''మూడు రోజులైంది బాబూ ముద్ద తిని గుప్పెడు మెతుకులు పెట్టించండి !'' అంది, అచ్చం అడుక్కునే మనిషిలా—జాలిగా—దీనంగా

నా దవడ మీద ఎవరో చాచి కొట్టినట్టు యింది నా గుండెను పిడికిలితో పట్టి లాగినట్టు యింది. ''చందమామ రావే జాబిల్లి రావే''

అంటూ తన చల్లని చేతో గోరుముద్దలు తినిపించి, చిటికెన వ్రేలంత మనిషిని—చెట్టంత వాణ్ణిగా చేసిన నా కన్నతల్లి ఆ చేయి చాచి, ఆ నోరు తెరిచి నన్నే అడుక్కుంటోందంటే— ఇంత కన్నా నికృష్టం మరెక్కడయినా వుంటుందా? ఎంత నిగ్రహించుకున్నా ఆగకుండా నా కళ్లు ధారపాతంగా నీళ్లను వర్షిస్తున్నాయి.

"మధుమూర్తీ! ముందు ఆమెకు స్నానం చేయించి భోజనం పెట్టండి. ఆమెకు కావాల్సిందిప్పుడు మీ పరిచయాలూ, ఆప్యాయతలూ కావు — ఆకలి తీరడం" అంటున్న రాంబాబు మాస్టారి మాటలు వింటూనే కళ్లు తుడుచుకొని అమ్మను లోపలకు తీసుకెళ్లింది జయ

"అమ్మ మీ కెక్కడ కనిపించింది మాస్టారూ?" అడిగాను, ఆయన వైపు కృతజ్ఞతగా చూస్తూ.

"ఎక్కడోనటయ్యా మధుమూర్తీ! ఆమె మా వీధిలో అడుక్కుంటోంది. ఆవిడ మా గుమ్మం ముందుకొచ్చి 'కాస్త గంజి పోయించండి బాబయ్యా' అని అడిగేవరకూ నేనామెను గుర్తుపట్టలేకపోయాను నువ్వారోజు నాకు చెప్పకపోతే ఆవిడ నీ తల్లి అని నేననుకొని వుండేవాణ్నికాదు ఆవిడను గుర్తించిన మరుక్షణం నా మనస్సు ద్రవించిపోయింది" క్షణకాలం ఆగారు మాస్టారు. ఆయన కళ్లు సజలపూరితాలవడం నేను గమనించాను. సూటిగా ఆయన మొహంలోకి చూడలేక తల దించుకున్నాను

"ఇలాంటి వన్నీ చూస్తుంటే మనిషికి వృద్ధాప్యం భయంకరమైనదేమోననిపిస్తుందయ్యా మధుమూర్తీ! అడుక్కునే కొందరి జీవితాల్ని తరచి చూస్తే ఇంతకన్నా హృదయ విదారకమైన విషయాలెన్నో బయట పడతాయి ఏది ఏమైనా మధుమూర్తీ! ఇలా మరోసారి జరక్కుండా చూసుకోండి. చెబితే మీకు కోపం రావచ్చునేమోగాని – వయస్సు పైబడ్డవాళ్ళను ఈ భూమ్మీద అప్పుడే కళ్ళు తెరిచిన పసిపాపల్లా చూసుకోవాలి వృద్ధాప్యం మనిషికి నేరం కాదయ్యా! అది బ్రతికే ప్రతి మనిషికీ తప్పనిదీ - తప్పించుకోలేనిదీను నా మాటలు అర్థంచేసుకో మధుమూర్తీ! నేను మళ్ళీ వస్తాను" అని రాంబాబు మాస్టారు వెళ్ళిపోయారు.

మాస్టారి మాటలు వాడి బాణాల్లా నా గుండెల్లోకి దిగాయి. కళ్ళముందు మెరుపులు మెరిశాయి — ఇక అమ్మను ఎక్కడికీ పంపకూడదన్న నిర్ణయం ఆ క్షణాన తీసుకున్నాను. నన్ను కట్టుకున్నప్పట్నుంచీ కష్టాలను చిరునవ్వుతో భరిస్తున్న జయ — నా నిర్ణయానికి హర్షం వెలిబుచ్చుతుందనే గాఢ నమ్మకం నాకుంది... మనసుకు దెబ్బ తగిలితేనేకాని కొన్ని మంచి నిర్ణయాలు తీసుకునే బుద్ధి మనిషి కేర్పడదేమో?...

* * *

ఓ వారం రోజుల తర్వాత "జయా! 'ఓ తల్లి కథ' సినిమాకు వెళదాం పద" అన్నాను; "ఒద్దండీ, ఆ సినిమా నేనిక చూడను!" అంది జయ. ఆ తల్లి కథ కూడా నా తల్లి కథలాగే వుంటుందనుకుంటోందో — తనకు రాబోయే వృద్ధాప్యాన్ని తల్చుకొని భయపడుతోందో నాకు అర్థం కాలేదు ★

## అంకితం

కనరాని లోకాలకు వెళ్ళిపోయినా ఎప్పుడూ నా కళ్ళముందుండే నా తల్లి చోడిశెట్టి సుబయ్యమ్మ — అన్నా, వదినలు సత్యన్నారాయణ, చిన్నయ్యమ్మగార్లకు నిండు మనస్సుతో నమస్సులర్పిస్తూ...

— లక్ష్మీ శ్రీనివాసన్

# ఇవేమన పద్యాలు




తనువు నడవిజేసి తనలోనె గూర్చుండి
తపము చేయలేక తపసులెల్ల
నడవియందు బోయి నలజడి పడెదరు
విశ్వదాభిరామ వినురవేమ.

# స్వాతి జల్లు

## సీరియల్

## రావినూతల సువర్ణా కన్నన్

*(గత సంచిక తరువాయి)*

**జరిగిన కథ—1 :** కొన్ని వ్యాపార సంస్థలకు యజమానురాలయిన మాధవికి మేనకోడలు వాసంతి. వాసంతి, ప్రతాప్‌ల ప్రేమ ఉదంతం తెలుసుకొన్న మాధవి ప్రతాప్‌ను తమ ఇంటికి తీసుకొనిరమ్మని వాసంతితో చెపుతుంది.

**పా**ర్కులోని ఓ మల్లెపొద దగ్గర కూర్చున్న వాసంతి ఉత్సాహంగా మాట్లాడేస్తుంటే చిరునవ్వులు చిందిస్తూ మౌనంగా కూర్చున్నాడు ప్రతాప్.

"ఏమిటి నేనెంత వాగినా నువ్వు నోరు విప్పవ్ ?" చిరుకోపంగా అంది వాసంతి.

"ఎవరో ఒకరే కదా మాట్లాడాలి ?... నువ్వు ఆపందే నేనెలా మాట్లాడను ? ఆఁ! ఇప్పుడు చెప్పు ! పదిసార్లు రమ్మంటేనే గానీ నాతో నాలుగడుగులు వెయ్యని బుద్ధిమంతురాలివి! నీకై నువ్వు అర్జంట్‌గా పార్క్‌కి రమ్మని ఫోన్ చేయడం చూస్తుంటే నాకేదో కంగారుగా ఉంది !" నవ్వేస్తూ అన్నాడు ప్రతాప్.

"అదే మరి చిత్రం !... నీ కోసం ఓ గొప్ప న్యూస్ కాచుకుని ఉంది !" ఊరించింది వాసంతి.

"అమ్మో !" భయం నటించాడు ప్రతాప్.

"కంగారు పడకు !... ఊహించి చెప్పు చూద్దాం !"

"ఏమిటి నీ పరీక్షలు పోస్ట్‌పోనయ్యాయా?" అమాయకంగా అన్నాడు ప్రతాప్.

"ఛ! ఛ! అదేం ప్రశ్న ?..." "మీ అత్త కేడ్బరీస్ కొనిచ్చిందా?" అన్నట్టు! విసుక్కుంది వాసంతి.

"అయితే నువ్వే చెప్పు !"

"రాత్రి అత్త మనిద్దర్నీ చూసేసింది !"

తుళ్ళిపడ్డాడు ప్రతాప్.

"ఏమంది ?... తిట్టిందా ?"

"ఆ !... ముక్కచివాట్లు వేసింది !... ఈసారి అతనితో మాట్లాడితే కాళ్ళు విరక్కొడతానంది !" వచ్చేనవ్వును పెదవుల మధ్య బిగబట్టి అంది వాసంతి గంభీరంగా.

ఆమె సీరియస్‌గా అనడం లేదని గ్రహించిన ప్రతాప్ భయం నటిస్తూ "అమ్మో! నేనొస్తా!" చటుక్కున లేచాడు

ఫక్కున నవ్వేసింది వాసంతి.

"ష్ ! కూర్చో !... మన సంగతంతా అత్తకి చెప్పేశాను !"

"ఏమంది ?" కుతూహలంగా అన్నాడు ప్రతాప్.

"ముందు "ధాం! ధూం!" అంది. అంతా విన్నతరువాత నిన్నొకసారి మా ఇంటికి తీసుకు రమ్మంది !" గబగబ అంది వాసంతి.

"అమ్మబాబోయ్ !... ఆవిడంటే నాకు చచ్చేభయం " కంగారుగా అన్నాడు ప్రతాప్.

"ఛ! ఛ! ఆమాట అనడానికి సిగ్గు లేదూ ?" విసుక్కుంది వాసంతి.

"ప్చ్! ఉండేది! కానీ. ఈ మధ్య ఓ పిల్లని ప్రేమించాను అంతే! ఆ సిగ్గుకాస్తా ఆమడ దూరం పారిపోయింది!" గంభీరంగా అన్నాడు ప్రతాప్.

"అయితే ఇంకేం ఆ సిగ్గును వెతికి తెచ్చుకో నేపోతున్నాను!" లేవబోతున్న వాసంతి చెయ్యి పట్టి కూర్చోపెట్టాడు.

"ఇంతకీ మీ ఇంటికి రావాలంటావ్?"

"అవును! ... నువ్వు నన్ను ప్రేమించడం నిజం అయితే!"

"ఓ! కే...ఎప్పుడాను?"

"ఎప్పుడో కాదు! ఇవాళే! ఇప్పుడు టైము అయిదయింది. సరిగ్గా ఆరుకొట్టేసరికి అక్కడుండాలి! ...చక్కగా ట్రిమ్‌గా తయారై రా!... ఆఁ...కాస్త వినయ విధేయతలతో మాట్లాడు. ముఖ్యంగా ఆవిడకే నువ్వు నచ్చాలి!" బోధించింది వాసంతి.

"కా...నీ...నాకావిడ వద్దు ! ... నువ్వే కావాలి!" భయంగా చూస్తూ అన్నాడు ప్రతాప్.

"ఛ! వెధవ జోక్! కష్టపడ్డావ్‌గానీ శుద్ధ వేస్ట్! ఇంక నేపోతున్నా...చెప్పిందంతా బాగా గుర్తుందిగా?" లేచింది వాసంతి.

"ఆఁ...గుర్తుందిలె! ...ఇంతోటిదానికి ఆ ఫోన్లోనే చెప్పకుండా స్వయంగా రావడందేనికి?... వచ్చిన దానివి అంత పరుగులు దేనికి?" చిరుకోపంతో అన్నాడు ప్రతాప్.

"అలాకాదు డియర్! ఇంత మంచి వార్త ఆ వెధవ ఫోన్లో చెప్తే ఏం బావుంటుంది! ... ఎదుట చెప్తేనే గొప్ప థ్రిల్!" నవ్వేసింది వాసంతి.

అనుకున్నట్టే ప్రతాప్ ఆరింటికల్లా "విశ్వశాంతి" చేరుకున్నాడు.

అతను ఆశించిన దానికంటే మంచి ఆతిథ్యమే లభించిందతనికి. మాధవి ఆప్యాయంగా పలకరించింది. కాఫీ టిఫిన్ ఇచ్చి తినేదాకా ఏదో సరదాగా కబుర్లు చెప్తూనే ఉంది.

గంభీరమూర్తి మేనత్తలో ఇంత ఉత్సాహం, సరదా ఉన్నాయని ఊహించని వాసంతి తెగ మురిసిపోయింది.

అరగంట తర్వాత...ఏదో పని నెపంతో వాసంతిని లోనికి పంపింది మాధవి. వాసంతి లోనికెళ్ళగానే ప్రతాప్ అదోరకంగా నెర్వస్‌గా ఫీలయ్యాడు. అది గమనించిన మాధవి, "అదేమిటి...మీరు మరీ ఆడపిల్లలా సిగ్గుపడిపోతున్నారు?" మనసులో నవ్వుకుంటూనే, అమాయకంగా అడిగింది.

"అబ్బెబ్బె !... అదేం లేదు." కంగారు పడిపోయాడు ప్రతాప్.

"చక్కని రూపం ! గుణం కూడా రూపానికి తగ్గట్టుంటే వసు సెలక్షన్ మంచిది!" మనసులోనే మెచ్చుకుంది మాధవి.

"మీరు మా వసుని ప్రేమించారు ! అవునా ?" వ్యాపారధోరణిలో వుందామె స్వరం.

"అవును ! మనస్ఫూర్తిగా !"

"వెరీగుడ్ !... మీ ఇంట్లోవారికీ సంగతి తెలుసా ?"

"చూచాయగా !"

"ఓ ! సరే !...ఒకవేళ వారు కాదంటే?" నిశితంగా అతని కళ్ళల్లోకి చూస్తూ అంది మాధవి.

"అనరు !" స్థిరంగా ఉందతని గొంతు.

"ఏమిటంత నమ్మకం ?"

అతనికేం చెప్పాలో తోచలేదు.

"నేనంటే మా వాళ్ళకి చాలా ప్రేమ !" రెండు నిమిషాల తరువాత మెల్లగా అన్నాడు ప్రతాప్.

"ఓ !... మంచి పేరెంట్స్ !... మా వసు గురించి పూర్తి వివరాలు తెలుసుకున్నారా ?"

"ఆఁ !"

"తనింకా వన్నియర్ చదువుతుంది !"

"వన్నియర్ ఎంతలో తిరుగుతుంది ? ఇప్పుడు పెళ్ళయినా చదువయ్యాకే ఆమె మా

ఇంటికొస్తుంది !'' కాస్త ధయిర్యం తెచ్చుకున్న ప్రతాప్ ఈసారి కాస్త గట్టిగానే మాట్లాడాడు.

''దాన్ని కన్న బిడ్డలా చూసుకుంటున్నాను! ఏ మాత్రం దాని మనసుకి కష్టం కలిగించినా నేను సహించను !'' గంభీరంగా అంది మాధవి.

''తెలుసు !'' చిన్నగా నవ్వాడతను.

''ఏమిటి... ?''

''మీరు వాసంతిని కన్న కూతుర్లా చూసు కుంటారని !... అందుకే ఆమె కేవిధమైన లోటు రానివ్వనని మీకు హామీ ఇస్తున్నాను !''

''థ్యాంక్యూ!... రేపు మంచి సమయం చూసుకుని మీ ఇంటికొస్తాను మీ పెద్దల్ని సంప్రదించడానికి. న్యాయంగా వారికి తెలియ కుండా... ఇలా మిమ్మల్ని పిలిచి పెళ్ళి మాటలు మాట్లాడటం అంత సభ్యత కాదు !... కానీ... వరుడి గురించి తెలుసుకోవాలన్న ఆతృతే అలా చేయించింది. వచ్చేముందు ఫోన్ చేస్తాను !... ఆఁ! ఫోన్ నెంబరు వసుకు తెలుసుగా?'' లేచింది మాధవి. వాసంతిని పిల్చి, ఆ పిల్ల రాగానే




ఇద్దరూ కలిసి ప్రతాప్‌కి వీడ్కోలు చెప్పారు.

* * *

సాయంత్రం నాలుగున్నర దాటింది.

మాధవి స్నానం చేసి పెద్ద తరహాగా ఉంటుందని పట్టుచీర కట్టుకుని పెద్ద బొట్టు పెట్టుకుంది. మోకాళ్లనంటే వత్తయిన జుట్టు ముడికి కుదరక అలా జడలాగే వుంచేసింది. మెడలో రెండు మూడు రకాల ఆభరణాలు, చేతుల నిండుగా గాజులు వేసుకుంది.

నిజంగా పెళ్లి పెద్దలా వుండాలని ఆమె తాపత్రయం !... ఎంత ముదిపేరక్కలా తయా రవాలనుకున్నా లేత తమలపాకు లాంటి ఆమె శరీరం అందుకనుగుణంగా లేక ఆమె అందాన్ని మరీ ద్విగుణీకృతం చేసింది.

అద్దంలో మార్చి మార్చి చూసుకున్న మాధవిలో అసంతృప్తి చోటు చేస్కుంది. ''ఛీ ! ...పిల్ల తల్లిలా తను ! '' అనుకుంది. ''చక్కని యుక్త వయస్సులో ఉన్న యువతివి పిల్ల తల్లిలా ఎలా వుంటావే వింత వేషం వేస్తే మాత్రం?'' అంటున్న మనసుని ఓసారి గద్దించి, పైట భుజాల నిండుగా కప్పుకుని అద్దం కేసి వీపుంచి మెల్లగా తిరిగి చూసుకుంది.

''ఆ ! ఇప్పుడు కాస్త ఫ ర వా లా !'' అనుకుని తృప్తిపడి సిద్ధంగా ఉన్న కార్లో హుందాగా కూర్చుంది.

కారు నున్నని తారు రోడ్డు మీద అలా సాగిపోతూంటే ఆమె యోచనలు మరోలా సాగు తున్నాయి.

''ఆ అన్నగారేమంటాడో ? ... ఆఁ ! ... ఒప్పుకుంటాడని చెప్పిందిగా వసు ! ... మరి ... ఆ వదినగారు ? ఆవిడకి కాస్త లాంఛనాల ఆశ చూపిస్తే సరి ! ఇంతకీ... అసలైన పెళ్లికొడుకు గుణగణాలెలాంటివో ? ... కనిపించినంతవరకు బుద్ధిమంతుడిలానే ఉన్నాడు.

ఏమైనా అన్నీ వివరంగా మాట్లాడు కోవాలి ? ... ముసుగులో గు ద్దు లా ట లు అనవసరం ! ... ఫరవాలేదనుకుంటే అన్నయ్యకి వైరిచ్చి రప్పించవచ్చు !'' ఇలా వున్నాయి మాధవి ఆలోచనలు.

"అమ్మగారూ !" డ్రైవర్ పిలుపుతో తృళ్ళిపడి ఈ లోకంలోకొచ్చింది.

మాధవి కారును చూసి పరుగున వచ్చాడు ప్రతాప్. ఆమె కోసం వెయిట్ చేస్తున్నాడతను.

"సారీ ! కాస్త లేటయినట్టుంది !" చిన్నగా నవ్వింది మాధవి.

"నో ! నో ! అదేంలేదు ! రండి! రండి!" ఆహ్వానించి లోపలికి తీసుకొచ్చి "మా వదిన !" పరిచయం చేశాడు ప్రతాప్.

"నమస్కారం !"

"నమస్కారం! కూర్చోండి!" ఆప్యాయంగా అంది ఆవిడ.

"ఫరవాలేదు ! ఇల్లు బానే ఉంది !" అనుకుంది మాధవి.

"మా ప్రతాప్ మూలంగా మా ఇంటి కొచ్చారుగానీ... లేకపోతే మీ అంతస్తేమిటి, మా అంతస్తేమిటి ?" పన్నాయి నొక్కులు నొక్కింది ప్రతాప్ వదినగారు. ఆవిడ ఆప్యాయతంతా నటనలా తోచింది మాధవికి. ఇబ్బందిగా చూసిందోసారి.

"నా మొహం ! ఇచ్చి పుచ్చుకుంటున్న వాళ్ళం ! ఇంకా అంతస్తులేమిటి ? ఆఁ!... అన్నగారు ఇంట్లో లేరా ?" ఇల్లంతా కలియ చూస్తూ అంది.

"ఇదో !... ఎవరో వస్తే మాట్లాడు తున్నారు ! మీరు కాఫీ తాగేసరికి వచ్చేస్తారు !" అంది తన పారపళ్ళు బయటికి కనిపించేలా నవ్వి. హిడింబిలా వున్న ఆవిణ్ణి చూస్తుంటే కాస్త కంగారుగా ఉంది మాధవికి.

ఆవిడ అందించిన కాఫీ తాగుతూ కూర్చుంది. ఇద్దరూ కాస్సేపు లోకాభి రామాయణం మాట్లాడుకున్నారు. తను ఎంత ఆస్తితో వచ్చిందో, తన డబ్బుతోనే వీళ్ళెంత అంతస్తు పెంచుకున్నారో, తన మరిదికి ఎంత కట్నం ఇస్తామని ఎందరు వచ్చారో వర్ణించి చెప్తుంటే ప్రతాప్ ఇబ్బందిగా, అసహనంగా కదులుతున్నాడు.

అది గ్రహించిన మాధవి "ఫరవాలేదు !... కొందరికి అదోరకమైన తృప్తి !" ఊరడించి నట్టు అతనికేసి చూసింది.

"నమస్కారం మాధవిగారూ !" అన్న గంభీర స్వరం విన్న మాధవి తృళ్ళిపడి చటుక్కున లేచి నిల్చుని చేతులు జోడించింది.

"మా అన్నగారు !..." పరిచయం చేశాడు ప్రతాప్.

మాధవి జోడించిన చేతులలాగే ఉండి పోయాయి. ఓ క్షణం సర్పద్రష్టలా అలా నిల్చుండిపోయింది.

"కూర్చోండి మాధవిగారూ !... మా ప్రతాప్‌కి మీ వాసంతి నివ్వడం నిజంగా మా అదృష్టం !" ఆమె కెదురుగా కూర్చుంటూ అన్నాడు. మాధవి మాట్లాడలేదు. అలా చూస్తూండిపోయింది.

"మాధవిగారూ !" ఆమె ప్రవర్తన అర్థం కాని ప్రతాప్ కంగారుగా అన్నాడు.

కాస్త తేరుకున్న మాధవి. "అయాం సారీ !" మెల్లగా లేచినచోటే చతికిలబడింది. ఆమెలోని ఉత్సాహమంతా ఆవిరైపోయింది. "ఇతను !...ఇక్కడ ఇలా...ప్రతాప్ అన్నగారిలా? ఛీ ! ఛీ !" మాధవి కళ్ళల్లో అంతులేని అసహనం !

కాని అతను అదేం పట్టించుకోలేదు. "మీ వాసంతి, మా ప్రతాప్ ప్రేమించుకున్నారు !" నవ్వుతూ అన్నాడు.

"నిజమే ! కానీ ప్రేమించుకుంటే చాలదు ! అందంగా ఉండే తాచుపాములో విషం ఉండచ్చు. అది ఊహించని పసివారు దాని చెంతకి చేరితే అది తన స్వభావసిద్ధమైన కాటువేసి ఆ విషంతో ప్రాణాలు తీస్తుంది.

అలాంటి పసివారే ఈ ప్రేమికులు ! పైకి కనిపించేదంతా మంచికాదనీ, వాటిలో కాలకూట విషంకన్నా ప్రమాదకరమైన విషం అంతర్లీనమై ఉంటుందని గ్రహించని అమాయకులు!...అందుకే వారి మంచి చెడ్డలు చూడవలసిన బాధ్యత పెద్దలం మనమీద చాలా ఉంది ! మనం అంగీక రించకపోతే ఈ పెళ్ళి జరగదు ! జరిగినా వారు సుఖపడరు !" పదునుగా ఉన్నాయి మాధవి మాటలు.

"అవును !... అందుకేగా మనమిప్పుడు కలుసుకుంది !" నవ్వాడతను ! అతను చూసే చూపులకి కంపరం పుట్టింది మాధవికి.

"కానీ... చాలా శ్రమ తీసుకున్నారు ! ఇంక నేను వస్తాను !" అంటూ లేచిన ఆమెను చూసి బిత్తరపోయాడు ప్రతాప్.

"అదేమిటి... పెళ్ళి మాటలు మాట్లాడ కుండానే..."

"సారీ మిస్టర్ ప్రతాప్ ! ఇంక మాట్లాడ టానికేంలేదు !"

"మాధవిగారూ !"

"అవును ! ప్రతాప్ !... ఇంక వసుని మీరు మర్చిపొండి !" మాధవి మాటలకి శ్రోతలంతా తెల్లబోయారు.

"అదేమిటి వారితో మాట్లాడకుండానే ?" అంది ప్రతాప్ వదిన.

"మాధవిగారూ ! మీకేదో కోపం వచ్చి నట్టుంది. అన్నయ్య స్వభావం..." అతని మాటలు పూర్తికాకుండానే పెద్దగా నవ్వింది మాధవి.

"మీ అన్నయ్య స్వభావం నాకు తెలియదా ? తెలుసు ! బాగా తెలుసు ప్రతాప్ !... కానీ... అదంతా అనవసరం ! అతని స్వభావంతో నాకు నిమిత్తంలేదు ! ఒక్కటి మాత్రం బాగా గుర్తుంచుకోండి. వసు ఈ ఇంటి కోడలుగా రాదు ! వెరీసారీ !" నాలుగడుగులు వేసిన మాధవిని చూసిన ప్రతాప్ అన్నగారి ముఖం పూర్తిగా పాలిపోయింది.

"సారీ మాధవీ !... నా మీది కోపంతో ఓ ప్రేమికుల జంటని విడదియ్యటం న్యాయం కాదు !" దీనంగా అన్నాడు.

"న్యాయం!... న్యాయం గురించి ప్రేమికుల గురించి నువ్వు నాకు బోధిస్తున్నావ్ ! వాటె వండర్ !...

మిస్టర్ రాజారావ్ !... న్యాయదేవత మీద మీకెంత గురి ?... ప్రేమికుల మీద ఎంత జాలి ?... ఓహ్ !" వ్యంగ్యంగా, వాడిగా ఉన్న మాధవి మాటలకి రాజారావు తల్లక్రిందులై నట్టు చూశాడు.

శ్రోతలు ప్రతిమల్లా బిగుసుకుపోయారు. చరచరా నడిచిపోతున్న ఆమెనాగమనడానికి ఎవ్వరికీ ధయిర్యం చాల్లేదు.

"ఎవరు ? ఎవరది ?... ఆపిల్ల మీరు

## స్వాతి జల్లు



ప్రేమించిన పిల్ల గదూ? ప్రేమించి ఏ కడుపో కాలో వస్తే వదిలించుకున్నారా ? లేక అదే తన్ని తగిలేసిందా ?... ముందు తేల్చండి.

హన్నా! హన్నా! ఎన్ని మాటలంది !... చెట్టంత మగాళ్ళున్నారు ఓ ఆడది అలా దులిపేస్తుంటే నోరెళ్ళపెట్టి నిల్చున్నారే.సిగ్గులేదూ?''

కారు ఎక్కుతున్న మాధవికి రాక్షసిలా, అసభ్య పదజాలాన్ని ఈటెల్లా భర్తపై విసురుతున్న రాజారావు భార్య మాటలు స్పష్టంగా వినిపించాయి.

ఇప్పుడామెకి కోపం రాలేదు !... వెర్రి ఆనందంగా ఉంది. ''రాజారావుకి భలే భార్య వచ్చింది !'' హాయిగా నిట్టూర్చింది.

* * *

''అత్తా !... మాట్లాడావా ? ప్రతాప్ అన్నగారేమన్నారు ? ప్రతాప్ సరిగ్గా మాట్లాడాడా? వాళ్ళ వదినెలా వుంది ?'' వీధిలో అత్త కారును చూస్తూనే పరుగున వచ్చి ప్రశ్నమీద ప్రశ్న వేస్తున్న వాసంతికేం సమాధానం చెప్పకుండానే,

''డ్రైవర్ ! కారు లోపల పెట్టేయ్ !'' అని ఓ హుకుం జారీచేసి చరచర తన గదిలో కెళ్ళి అతి ప్రయాసతో అలంకరించుకున్న అలంకరణంతా తీసిపారేసి పట్టుచీర మార్చి ఓ మూల పారేసి, మంచం మీద వాలి నిర్విణ్ణగా కళ్ళు మూసుకుంది మాధవి. ఆమె మనసంతా అల్లకల్లోలంగా ఉంది.

మాధవి చర్యకి బిత్తరపోయిన వాసంతి మెల్లగా వచ్చి ఆమె పక్కలో కూర్చుంది.

అది గమనించినా మాధవి కళ్ళు తెరవలేదు.

''ఇప్పుడీ పిల్లకేం చెప్పాలి ? అతన్ని మర్చిపొమ్మని ఒక్కమాటలో చెప్పేస్తే ప్రాయం తెలిసిన పిల్ల కారణం అడక్కుండా ఊరుకుంటుందా ?''

''అత్తా !'' మెల్లగా పిల్చింది వాసంతి.

''ఊఁ !''

''ఏం జరిగింది ? ప్రతాప్ అన్నగారు ఒప్పుకోలేదా ?''

... ... ... ...''

''చెప్పత్తా ! అక్కడెలాంటి అవాంఛనీయ సంఘటన జరిగినా వినడానికి నేను సిద్ధంగానే ఉన్నాను !''

''సారీ ! వసూ !... ఇప్పుడు నన్నేం అడగద్దు !'' మెల్లగా అంది మాధవి.

''ప్లీజ్ ! చెప్పత్తా !''

''అయితే విను ! నువ్వు ప్రతాప్ సంగతి పూర్తిగా మర్చిపోవాలి !'' ఓసారి కళ్ళు తెరిచి తీక్షణంగా అనేసి తిరిగి కళ్ళు మూసుకుంది మాధవి.

తృప్తిపడింది వాసంతి. ఆమె ఆశాసౌధాలన్నీ కుప్పకూలి పోయాయి. ''అత్తవైపు నుంచి అంగీకారం లభించినా ప్రతాప్ అన్నగార్నించే

# స్వాతి జల్లు

రాలేదన్నమాట !'' ఆమెకి దుఃఖం ఆగలేదు. చటుక్కున లేచి తన గదిలోకెళ్ళి మంచానికడ్డంగా పడిపోయింది.

అలా ఎంతసేపుందో ఫోన్ మోగడంతో పరిగెత్తింది. ఎందుకో ఆ ఫోన్ ప్రతాప్ చేశాడేమో అనిపించిందామెకి.

అది ప్రతాప్ చేసిందే !

ఫోన్‌లో అతను చెప్పిన విషయాలు విని తెల్లబోయింది వాసంతి. ''అత్త ఇలా చేసిందా? ఆవిడ ప్రవర్తనకి అర్ధం ఏమిటి ? నిజంగా ప్రతాప్ వదిన అన్నట్టు వీరిద్దరూ ప్రేమికులా? అయితే ఎందుకు విడిపోయారు ?

అత్తలాంటి అందాలరాశిని, లక్ష్మీపుత్రికని చూస్తూ చూస్తూ ఎవరొదులుకుంటారు ? ఒకవేళ అత్తే...? ఛ ! ఛ !... అత్త అలాంటిది కాదు :... మరి...?''

ఎంత బుర్ర పగలకొట్టుకున్నా అత్త ఎందుకలా ప్రవర్తించిందో మాత్రం ఆ పిల్లకి అర్థం కాలేదు !

''ఏదైనా ఆవిణ్ణడిగే తెలుసుకోవాలి !'' వెనుదిరిగి మెల్లగా మాధవి గదికేసి నడిచింది వాసంతి.

మాధవి ఇందాకటిలాగే కళ్ళమీద చేతులుంచుకుని పడుకుని వుంది.

''అత్తా ! భోజనం చేద్దాం రా !...'' తట్టి లేపింది వాసంతి. మాధవి తృప్తిపడి ''ఓ !... చాలా టైమయిందే ! పద !...'' చూసుకుంటూ లేచింది.

ఇద్దరూ కలిసి డైనింగ్ హాల్లోకి వచ్చారు. వాతావరణం గ్రహించిన మంగమ్మగారు ఇద్దరికీ ప్లేట్లు పెట్టి మౌనంగా వడ్డించసాగింది.

ఇద్దరూ భోజనం అయిందనిపించి హాల్లో కొచ్చారు.

''మంగమ్మగారు ! మీరు భోంచేసి పడుకోండి!'' అని అక్కణ్ణించే ఓ కేక పెట్టి, ''కూర్చో వసూ!'' అంది మాధవి. తను సోఫాలో చేరగిల పడుతూ. కాస్త తేరుకుందామె.

''అత్తా! ...''

''ఏమిటి?'' అన్నట్టు చూసింది మాధవి.

''వాళ్ళు...నిన్నేమైనా అవమానించారా?''

''ఎవరు?''

''అదే...ప్రతాప్ వాళ్ళు!''

''లేదే! ...''

''నిజంగా...?''

''నిజం వసూ! ... వాళ్ళేం అవమానించలేదు. చాలా మర్యాదగా చూశారు!'' ఆమె మాటలో వ్యంగ్యంలేదు.

''మ...రి...మరి...!''

''పెళ్ళి విషయం ఎందుక్కుదరలేదంటావ్? అంతేనా?'' సూటిగా వాసంతికేసి చూసింది మాధవి.

వాసంతి మాట్లాడలేదు.

''వాళ్ళు...వట్టి డబ్బు మనుష్యులు వసూ!

''ఏం? ...కట్నం అడిగారా?'' చివ్వుతలెత్తి అంది వాసంతి.

''లేదు!''

''మరి...?''

''నాకు తెలుసు!'' కఠినంగా అంది మాధవి.

''అదే...ఎలా తెలుసూ అని?'' గట్టిగా అంది వాసంతి.

మాధవి చిరాగ్గా చూసిందా పిల్లకేసి

''వసూ! అట్టే వాదించకు! .. నాకు తెలుసు! అన్నాను అంతే!''

''ఓ! అంత బాగా తెలుసన్నమాట!'' అదోలా వ్యంగ్యంగా వుందా స్వరం !..

వాసంతి మాటల్లోని వ్యంగ్యాన్ని పట్టించుకోలేదు మాధవి. ''ఆ! ... బాగా తెలుసు!'' అంది.

''నీకు వాళ్ళను గురించి తెలుసేమో! గానీ ప్రతాప్ చాలా మంచివాడు! డబ్బును తృణప్రాయంగా చూసే వ్యక్తి! కట్నం తీసుకునే వాళ్ళని అసహ్యించుకునే ఆదర్శ యువకుడు! ... ఒకవేళ నువ్వు కట్నం ఇచ్చినా అతను తీసుకోడు!'' గర్వంగా అంది వాసంతి.

ఓసారి ఆ పిల్ల ముఖంలోకి నిశితంగా చూసి ''నిజం...?'' అంది మాధవి.

''ఆహా ! నూటికి నూరుపాళ్ళా నిజం !''

''ఓ ! కే ! నీకా నమ్మక ముంటే ఇంకేం? అతను బుద్ధిమంతుడైతే నాకూ అభ్యంతరం లేదు !'' స్థిరంగా ఉన్నాయి మాధవి మాటలు.

వాసంతి కళ్ళు ఆనందంగా మెరిశాయి.

''థాంక్స్ ! అత్తా ! క్షణంలో కంగారుపడిపోయాను. నిజంగా అతనికి ఎవరో లక్ష కట్నం ఇస్తామన్నా నాకోసం అంగీకరించలేదు.'' ఆమె కళ్లల్లోని వెలుగుకు ఆశ్చర్యపోయంది మాధవి.

''మనలో కూడా లక్షల కట్నాలు ! ''వరకట్న నిషేధం'' పేపర్ల మీద, మీటింగుల్లోనూ మాత్రమే వుంచేసి వర విక్రయంలో పురోగతని సాధించాం మన భారతీయులం ! '' బాధగా నిట్టూర్చింది.

''నిజం అత్తా! తనకేం? చదువు సంస్కారం ఉన్నాయి, ఆస్తి, అంతస్తు, ఉన్నాయి. మనిషి అందంగానే ఉంటాడు. అతనికివ్వడానికేం ?'' పెద్ద ఆరిందాలా అంటున్న వాసంతి మాటలకి చిన్నగా నవ్వింది మాధవి.

''అయితే అంత ఖరీదు చేస్తాడంటావ్ !''

అత్త మాటల్లోని కొంటెదనానికి సిగ్గుపడిపోయింది వాసంతి. ''నా ఉద్దేశం...''

''ఆఁ! నీ వుద్దేశం నాకు బాగా అర్థమయింది గానీ ... నా ఉద్దేశమే నీకు అర్థం కాలేదు ! '' గంభీరంగా మారిపోయింది మాధవి గొంతు.

''అత్తా ! ...''

''నిజం వసూ ! నా మనసులో ఓ ఆలోచన

# సంసారవిరక్తుని సంతృప్తి

—బులుసు వెంకటరమణయ్య




ఎన్నో కష్టాలకూ, దుఃఖాలకు, నిరాశలకు నిలయమై, దుర్భరంగా తోచిన సంసారం పట్ల తాత్కాలికంగాకాక, స్థిరంగా విరక్తి చెందినవారికి—ఆ సంసారబంధంనుండి విడుదల పొందినప్పుడు గలిగిన ఆనందం నిరవధికమైనది. అట్టి సంతృప్తి కలవారిని ఆకలి, దప్పిక బాధించలేవు. ఘోరారణ్యాలలో తిరిగినా భయం ఉండదు. ఎండ వానలను, శీతాతపాలనూ సహించగలరు. సంతృప్తి అనేది ఉంటే కష్టాలూ, శ్రమలు కానరావు.

బుద్ధభగవానుడు, అర్ధరాత్రి సమయంలో, భార్యాపుత్రులను విడిచి, సంసార పరిత్యాగంచేసి వెళ్ళిపోయేటప్పుడు, అతని వెంట కొంత దూరం, అతని ప్రియ సేవకుడైన ఛన్నుడు(ఛందీకుడనికూడా అతనిని అంటారు) వెళ్ళాడు. అప్పుడు రాజకుమారుడైన సిద్ధార్థుడు తనకు కలిగిన సంతృప్తిని చక్కని పోలికలతో విశదపరిచినట్లు ఒక కమ్మని పద్యంలో చెప్పబడింది. అది బుద్ధుని గురించి వ్రాయబడిన ఒక నాటకంలో ఉన్నది. అది వ్రాత ప్రతి. నా చిన్నప్పుడు చదివిన ఆ పద్యం యిప్పటికీ బాగా స్ఫురణలో ఉన్నది.

''పెక్కేండ్లు చెరలోన చిక్కి
　　　　　　క్రుక్కినవాడు
పేరాసతో ఇల్లు చేరినట్లు
ఘోర దీర్ఘవ్యాధి కుంది లేచినవాడు
కడగి వీధులవెంట నడచినట్లు.
కామినీ గ్రహముచే కడు నీడ్వబడి శుద్ధ
　　కాయుడై జనములో కలిసినట్లు
సంద్రాన బడి యీది చావు తప్పించుక
　　చక్కని రేవునకెక్కినట్లు
క్షామ పీడితమైన దేశమును విడుచు
వాడు రతనాల దీవికి వచ్చినట్లు
వికృత సంసారబాధను విడిచి నేను
సుకృతమయమగు మార్గము
　　　　　　చొచ్చినాడ.''

సంసార బంధంనుంచి విడుదల పొందితే, చాలాకాలం చెరసాలలోవుండి విడుదల పొంది గంపెడాశతో ఇంటికివచ్చినట్లును, పెద్ద జబ్బుతో చాలాకాలం బాధపడి, తర్వాత తేరుకొని స్వేచ్ఛగా వీధులలో తిరిగినట్లు, కామినీ భూతం ఆవేశింపగా, చాలా బాధపడి చిక్కిపోయి, ఆ భూతాన్ని వదిలించుకుని తిరిగీ నలుగురిలోను పడినట్లు, సముద్రంలో పడి ఎలాగో చావు తప్పించుకొని మంచి రేవును చేరినట్లు, కరువుతో తీవ్ర బాధను పొందే దేశాన్ని విడిచినవాడు సంపదలతో నిండిన రత్న ద్వీపానికి వచ్చినట్లు ఎంతో మనస్సంతృప్తి కలిగింది'' అని దీని అభిప్రాయం ★

---

దూరి కలవర పెట్టేస్తోంది. నీతో చెప్పకోవాలని ఎన్నాళ్ల నుంచో అనుకుంటున్నాను . కానీ ... నాకన్న చిన్నపిల్లవి. .నీతో విప్పి చెప్పకోవడానికి . ఎందుకో బిడియంగా ఉంది !'' చేతిగోళ్లను మూసుకుంటూ మెల్లగా అంది మాధవి.

మాధవి మాటలకి ఆశ్చర్యపోయింది వాసంతి.

''ఏమిటత్తా ? '' కుతూహలంగా అంది

''మరి. .నువ్వు నవ్వకూడదు ! ''

''ఛ ! ఛ ! నేను నవ్వను ! చెప్పు ! ''

''నేను...నేను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను ! '' ఎలాగో అవస్థపడి చెప్పేసింది మాధవి.

''వ్వాట్ ? నువ్వు పెళ్లి చేసుకుంటావా ?'' అనుమానంగా అడిగింది వాసంతి.

''అవును !'' మెల్లగా అంది మాధవి. తల ఎత్తకుండానే.

''నిజం ?. . ఎంత మంచి వార్త చెప్పావత్తా ?... ఈ సంగతి చెప్పడానికింత బెరుకా ? ఈ న్యూస్ తాతయ్యకి తెలిస్తే ఎంత సంతోషిస్తారో ! ఇప్పుడే చెప్పొస్తా!'' ఫోన్ దగ్గరికి పరిగెత్తబోయిన వాసంతిని చెయ్యిపట్టి ఆపింది మాధవి.

''వద్దు వసూ ! తొందరపడద్దు !... మెల్లగా చెబ్దాం !'' అంది.

''అత్తా !... ఈ బంగారు బొమ్మకి కాబోయే వరుడెవరో చెప్పవూ ? .. మా మామయ్యగారి పేరు.. '' ఆనందంతో మాధవిని కుదిపేస్తూ అడిగింది వాసంతి.

''అరె ! ఉండు చెప్తాను !'' వాసంతి చేతుల్ని తప్పించుకుంటూ సిగ్గుగా అంది మాధవి

''చెప్పుమరి !''

''చెప్తాగా !... కొంచెం ఓపిక పట్టు !''

నిరాశగా చూసింది వాసంతి

ఆ పిల్ల ముఖం చూసి నవ్వేసింది మాధవి ''అదిగో ఎవరో వచ్చినట్టున్నారు చూడు'' అంది సరిగా కూర్చుంటూ.

వాసంతి వీధిలోకెళ్ళి మరు నిమిషంలో ప్రతాప్‌ని, అతని అన్నగార్నీ వెంటబెట్టుకొచ్చింది

క్షణం తెల్లబోయిన మాధవి కంగారుగా లేచి వారిని ఆహ్వానించి కూర్చోబెట్టింది.

''మాధవిగారూ ! మేం ఇలా వచ్చినందుకు మీరు మరోలా భావించద్దు ! ప్రతాప్ వాసంతిని తప్ప వేరెవర్నీ చేసుకోనని భీష్మించుక్కూర్చున్నాడు. అందుకే... మీరు కాదన్నా అభిమానం చంపుకుని వచ్చాను !'' బట్టీబట్టినట్టు వప్పజెప్పాడు రాజారావు.

''అవును !... మా వసు కూడా అదే పాట పాడుతోంది. అందుకే వారిద్దరికీ పెళ్లి జరిపించి మన పెద్దరికం నిలబెట్టుకోవాలనుకుని మీకు ఫోన్ చేద్దామనుకుంటుండగానే మీరే వచ్చేశారు !'' గంభీరంగా అంది మాధవి.

''ఓ! చాలా సంతోషం !'' అన్నదమ్ముల ముఖాలు వెలిగిపోయాయి.

''కాఫీ తీసుకోండి!'' అంది మాధవి. కాఫీ తాగారు.

''ఇంక మనం కట్నకానుకల గురించి మాట్లాడుకుందాం !'' సూటిగా విషయంలోకొచ్చింది మాధవి

''కట్నమా ?'' దెబ్బతిన్నట్టు చూశారు అన్నదమ్ములిద్దరూ. రాజారావు ముఖం ఎరుపు రంగుకి తిరిగింది.

''ఏం, కట్నం అనగానే తెల్లబోతున్నారు! కట్నం తీసుకోరా ?'' కుతూహలంగా అంది.

''మీరింకా నన్ను క్షమించినట్టులేరు ! నేను మునుపటి రాజారావును కాదు మాధవి గారూ! .. ఇప్పుడు చాలా మారిపోయాను. దానికి నిదర్శనంగా నా తమ్ముడికి పైసా కట్నం తీసుకోకూడదని నిర్ణయించుకున్నాను '' స్థిరంగా ఉందతని గొంతు.

''బావుంది ! .. చాలా మంచి నిర్ణయం !'' చిన్నగా నవ్వింది మాధవి.

''ఇంక మేం వెళ్ళొస్తాం !'' లేవకుండానే అన్నాడు రాజారావు.

''అయితే. . మా వసు మీ అందరికీ నచ్చినట్టేగా ? అహఁ !. . ఎందుకలా అడుగుతున్నానంటే. ఎంగేజ్‌మెంట్ ఏర్పాటుచేసి మా అన్నయ్యని.. అదే వాసంతి తండ్రిని పిలిపిస్తాను ! ఆయన పెద్దవాడు... కన్యాదాత ! ముందు రావాలిగదా !'' వివరించింది.

''ఎంత మాటన్నారు !. . ఇంక తిరుగు లేదు !'' అని మరోసారి ఆ అన్నదమ్ములచేత అనిపించుకుని వార్ని సాగనంపి తన గదిలో కొచ్చిన మాధవి తనలో తను ఏదో గుర్తొచ్చినట్టు ముసిముసిగా నవ్వుకుంది

**(ఇంకా వుంది)**



# సినిమ



'ఉద్దండుడు'లో ఊర్వశి

## శ్రీ వాణీ సినీ ఆర్ట్స్ "య మ దూ త లు" షూటింగ్ ప్రారంభం

"మా 'చండీరాణి, జేమ్స్‌బాండ్ 999' చిత్రాలను కైలాస కోనలో ప్రారంభించాం. ఆ సెంటిమెంట్‌తోటే 'యమదూతలు' చిత్రాన్ని కూడా అక్కడే ప్రారంభించాం," అన్నారు ఎస్. వి. సుబ్బరాజు. ఈయన కథ, సమర్పణలో పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బాధ్యతలు వహించే శ్రీ వాణీ సినీ ఆర్ట్స్‌వారి పై చిత్రంలో నరేష్, భానుచందర్ హీరోలు. సాయినాథ్ సంభాషణల కర్త. రాజ—కోటి సంగీతం, ఎస్. ఎస్. రాజు ఛాయ, గౌతంరాజ్ కూర్పు, వెంకటేశ్ సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు. "జూన్, జూలై నెలల్లో షూటింగ్ చాలా వరకు పూర్తయిపోతుంది. ఆగస్ట్‌లో పాచ్‌వర్క్..." అన్నారు నిర్మాత వి. ఎస్. రంగనాథవర్మ.

## దాసరి నారాయణరావు చిత్రావళి

★ ఎ. ఎన్. ఆర్. ద్విపాత్రాభినయంతో తారకప్రభు తయారు చేసే "జస్టిస్ చక్రవర్తి" చిత్రం ఎ. ఎన్. ఆర్. షష్టిపూర్తి కానుకగా సెప్టెంబర్ 20న విడుదలవుతుంది.

★ కృష్ణంరాజు, మోహన్‌బాబు ప్రధాన భూమికలు నిర్వహించే విజయ మాధవీవారి "తిరుగుబాటు" ఆగస్ట్ 10న విడుదలవుతుంది.

★ శోభన్‌బాబుతో కె. నరసింహం నాయుడు సమర్పణలో కె. మురారి నిర్మించే యువ చిత్రవారి "అభిమన్యుడు" ఆగస్ట్ నెలాఖరులోగా విడుదలవుతుంది.

★ దాసరి ప్రధాన పాత్ర నిర్వహించే కుమార్జీ చిత్రం "మూడిళ్ళ పూజారి" సెప్టెంబర్‌లో మొదలవుతుంది.

★ ఉషఃశ్రీ సంస్థ నిర్మించే చిత్రంలో కమల్‌హాసన్ హీరో.

★ తారక ప్రభు పరిప్స్ బానర్ లో శోభన్‌బాబుతో "బ్రహ్మముడి", కృష్ణంరాజుతో "పద్మశ్రీ రంజిత్ కుమార్", కృష్ణతో "సాహసమే నా ఊపిరి" చిత్రాలు తయారవుతాయి.

★ "బోళాశంకరుడు" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది.



"బంగారు కాపురం"లో జయప్రద, కృష్ణ, జయసుధ







'మార్పండీ మన చట్టాలు'లో

## వేజెళ్ళ దర్శకత్వంలో "ఓటుకి శలవివ్వండి !"

"విశాఖపట్నంలో, మద్రాస్‌లో సెప్టెంబర్ 15 నుండి అక్టోబర్ 15 వరకు ఏకబిగిన

# ... విశేషాలు

-జి. వి. జి.



చంద్రమోహన్, కళారంజని

షూటింగ్ పూర్తయిపోతుంది,'' అన్నారు సమాజ సమస్యాత్మక చిత్రాల్ని ... సత్యనారాయణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ... వాస్తవ్యులు కె. ప్రభాకరరావు నిర్మించే త్రిజయా సంస్థవారి ''ఓటుకి కలిపివ్వండి'' చిత్రానికి సి.వి. నరసరాజు సంభాషణలకర్త. ఆర్. కె. రాజు ఛాయాగ్రాహకుడు.

## చిరంజీవితో ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో వెంకన్నబాబు చిత్రం "దుస్తుం"

''జూలై, ఆగస్టు నెలల్లో 21-30 తేదీల మధ్య జరిగే మిగతా షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన మహేశ్వరి మూవీస్ పతాకంలో నిర్మించే ''దుస్తుం'' చిత్రం తొలి షెడ్యూల్ జూన్ 23 నుండి 30 వరకు జరిగింది. చిరంజీవి, ఊర్వశి, రాజ్యలక్ష్మి, సంగీత, అన్నపూర్ణ, నిర్మల, కె. విజయ, సిల్క్ స్మిత, గుమ్మడి, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, మోహన్‌ప్రసాద్, వేలు, వీరభద్రరావు, రాజేంద్రప్రసాద్, కాకరాల, సత్యేంద్రకుమార్, వల్లభనేని పాల్గొంటున్నారు. గిరిజా శ్రీ భగవాన్ కథకు సత్యానంద్ సంభాషణలకర్త. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. లోక్‌సింగ్ ఛాయ, సాయికుమార్ శిల్పం, శరత్ సహాదర్శకత్వం, తార నృత్యాలు, డి. వెంకటరత్నం కూర్పు, ఎస్. జయరామారావు నిర్వహణలో ఎ. కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. ''గ్రామీణ వాతావరణానికి చెందిన చక్కని చిత్రకథ,'' అని నిర్మాత వెంకన్నబాబు తెలిపారు.

## నరేష్‌తో జంధ్యాల దర్శకత్వంలో రవికళామందిర్ వారి "శ్రీవారి శోభనం"

''హాస్యరస ప్రధాన చిత్రం,'' అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో హరికృష్ణ సమర్పించే ''శ్రీవారి శోభనం'' చిత్రంలో నరేష్, పూర్ణిమ, వేలు, వీరభద్రరావు, మరో నవనటి పాల్గొంటారు. రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు. ఎం. వి. రఘు ఛాయాగ్రాహకుడు. షూటింగ్ ఆగస్టు నుంచి ఉంటుందని నిర్మాతలు ఎం. ఎస్. ప్రసాద్, ఆదుర్తి సాయి భాస్కర్ తెలియజేశారు.



'ఎదురులేని మొగాళ్ళు'లో భానుప్రియ

## శుభ, సత్యనారాయణ, శోభన్‌బాబు, సుహాసిని "ఇల్లాలు-ప్రియురాలు"



కృష్ణంరాజు "రారాజు"



## సుమన్‌తో పి.సి. రెడ్డి దర్శకత్వంలో "ఉక్కు సంకెళ్ళు"

"గోవా, కార్వాన్, బొంబాయి ప్రాంతాల్లో షూటింగ్ జరుపుతాం. హెలికాప్టర్ ఫైటింగ్ సన్నివేశాలు విశేషాకర్షణ," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో షేక్ ఫజాలుల్లాహక్, లీలా చంద్రశేఖరరావు నిర్మించే ధర్మ విజయ పిక్చర్స్ "ఉక్కు సంకెళ్ళు" చిత్రంలో సుమన్ సరసన ఒక ప్రముఖ తార నటిస్తుందని నిర్వహణ బాధ్యతలు వహించే కె. ధ్రువకుమార్ తెలియజేశారు.

## "ధన్యజీవులు"

"నేత్రదానానికి సంబంధించిన ప్రబోధాత్మక చిత్రం. లక్షకు పైగా కంటి ఆపరేషన్‌లు చేసిన రాష్ట్రపతి నేత్ర వైద్యులు పద్మభూషణ్ డాక్టర్ పి శివారెడ్డిగారు అతిథి నటులుగా పాల్గొనడం గొప్ప విశేషం ఈ చిత్రం ద్వారా వచ్చే డబ్బు అంధ సంక్షేమ నిధికి అందజేయబడుతుంది," అన్నారు శ్రీమతి పద్మా వెంకటరెడ్డి ఈమె నిర్మించే "ధన్యజీవులు" చిత్రానికి ఆర్. సి. వి. రెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహించారు. బి. జనార్దనరావు ఛాయాగ్రాహకుడు. బి హరినారాయణ సంకలనకర్త, సహదర్శకుడు.

## పినిశెట్టి రవిరాజ్ దర్శకత్వంలో చిరంజీవి నటించే పి.ఎస్.ఆర్. పిక్చర్స్ చిత్రం

"అడ్వెంచరస్ చిత్రం. అక్టోబర్‌లో సాంగ్స్ రికార్డ్ చేస్తాం. నవంబర్ 1న షూటింగ్ మొదలెట్టి, జనవరికి పూర్తి చేస్తాం. ఫిబ్రవరి రిలీజ్," అన్నారు పింజల నాగేశ్వరరావు. ఆయన కొత్త చిత్రానికి పినిశెట్టి రవిరాజ్ డైరెక్టరు.

## జంధ్యాల దర్శకత్వంలో ఎస్. వెంకటరత్నం చిత్రం "పుత్తడిబొమ్మ"

"రాజమండ్రిలో జూన్ 28 నుంచి నాన్‌స్టాప్‌గా షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వంలో ఎస్. వెంకటరత్నం నిర్మించే శ్రీ పల్లవి ఫిలిమ్స్ "పుత్తడిబొమ్మ" చిత్రానికి ఇటీవల చక్రవర్తి స్వరకల్పనలో డాక్టర్ నెల్లుట్ల, శ్రీకాంత్ శర్మలు రాసిన గీతాలు రికార్డ్ చేయబడ్డాయి. తారాగణంలో నరేష్, పూర్ణిమ, అరుణ, జె. వి. సోమయాజులు, వేలు, వీరభద్రరావు, జానకి ఆదిగాగలవారున్నారు. ప్రభాకర్ ఛాయాగ్రాహకుడు. గౌతంరాజా సంకలనకర్త.

తప్పక చూడండి!

వడ్డే కిషోర్ సమర్పించు

విజయమాధవీ పిక్చర్స్

# రారాజు





నిర్వహణ: వడ్డే రమేష్

నిర్మాత: వడ్డే శోభనాద్రి




స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: జి.రామ్మోహనరావు

• గోపీకృష్ణా • వియంసి • పశ్చిమగోదావరి శ్రీలక్ష్మీ పిక్చర్స్ ఏలూరు

L.A PUBS



'ఆడపులి' అనూరాధ

## "మున్సబుగారి అల్లుడు"

''మున్సబుగా త్యాగరాజు, అల్లుడుగా గిరిబాబు నటించారు. పూర్తిగా ఔట్‌డోర్‌లో తీశాం,'' అన్నారు ఎస్. డి విజయబాబు. ఈయన కథ, స్క్రీన్ ప్లే, మాటలు, దర్శకత్వంతోపాటు ఒక సాత్వికమైన పాత్రను నిర్వహించిన విజయప్రభ మూవీస్ వారి పై చిత్రంలో ఇంకా రావి కొండలరావు, నాగరాజారావు, రాణీచంద్ర, శ్రీగీత, శ్రీకళ, రాధాకుమారి, చందనచౌదరి, సురేంద్రనాథ్, సురేష్, గురునాథ్, కిశోర్ నెల్లూరు సుబ్బారావు, విజయకుమార్, బి. సత్యనారాయణ, శివరామయ్య ప్రభృత పాత కొత్త నటీనటుల సమ్మేళనం. బి. గోపాలం సంగీతం, బి. అర్జున రావు ఛాయ, రంగారావు శిల్పం, బి. కందస్వామి కూర్పుతో శ్రీమతి లక్ష్మి విజయబాబు నిర్మాత.

## "ఆడపులిలో" ఆవేదన

ఝూన్సీ (జయసుధ) వద్దకు విజయ్ (మోహన్‌బాబు) పరుగున వచ్చాడు. ''ఝాన్సీ! ఏమిటిది? నీ మీద ప్రేమతో మా అమ్మ నీకు బొట్టు పెడుతూంటే — మతిపోయినదానిలా పరుగెత్తుకుంటూ వచ్చేశావ్? నువ్ చేసిన పని ఏమైనా బాగుందా?''

''విజయ్! ఆవిడ మనసు బాధ పడుతుందని నాకు తెలుసు కాని, ఆ మంచి మనసుని మోసం చెయ్యలేక, పవిత్రమైన ఆమె ముందు నిలబడ లేక ఇలా వచ్చేశాను,'' అంది ఝాన్సీ హీన స్వరంతో.

''ఝాన్సీ! ఏమిటి నువ్వనేది?''

''నా జీవితం ఇప్పుడు ఎవ్వరూ విడదియలేని చిక్కులాంటిది. అందుకే ఈ జన్మకు నీ దాన్నయ్యే అదృష్టం నాకు లేదు.''

''ఝాన్సీ! మనిద్దరి మధ్య అడ్డుగోడలా— అగాధంలా ఉన్న విషయమేమిటో చెప్పు. నువ్వు నిజం చెప్పకపోతే, నన్నెప్పుడూ ప్రేమించలేదను కుంటాను.''

''అలా అనకు, విజయ్! ఈ ప్రపంచంలో అన్నిటికంటే, ఆఖరికి నా ప్రాణంకంటే నిన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నాను...నిన్ను మోసం చేసి నేను పెళ్ళి చేసుకోలేను. పెళ్ళి చేసుకొని నీకు నేను అన్యాయం చెయ్యలేను!'' ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది ఝాన్సీకి.

స్థాణువులా నిలుచుండిపోయాడు విజయ్.

కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. రామచంద్రరావు నిర్మించే ఎస్. ఆర్. ఫిలిమ్స్ ''ఆడపులి'' చిత్రం జూలై విడుదల.

## "ముక్కోపి"లో బందీ

రాజా (నరేష్)ను తండ్రి ఒక గదిలో బంధించి, తాళం వేశాడు. ఆంజనేయులు (సత్యనారాయణ) పళ్ళెంతో కిటికీవద్దకు వచ్చి, ''రాజా బాబూ ! ఈ పూటైనా ఒక్క ముద్ద తినండి, బాబూ !'' అన్నాడు.

''చెప్పాను కదా, ఆంజనేయులూ ! నా ఆలోచన, ఆశ, మనసు అన్నీకూడా సరస్వతిమీదే ఉన్నాయి తప్ప — తిండి నిద్రలమీద కాదు. ఆమెకు ఆ నీచుడితో పెళ్ళి అయిపోతే నేను బ్రతకలేను... ఆంజనేయులూ, నన్నెలాగైనా విడిపించు, ఆంజనేయులూ !'' అన్నాడు రాజా.

''తాళంచెవి పెద్ద బాబుగారు పట్టుకు పోయారు. బాబూ! నన్నేం చేయమంటారు?''

''నువ్వు తలుచుకుంటే, తాళంచెవి లేక పోయినా తప్పించలేవా, ఆంజనేయులూ ? నీకు సరిగ్గా ఒక్క నిమిషం టైమ్ ఇస్తున్నాను. ఈలోగా తలుపు తీయకపోయావంటే నా శవాన్నే చూస్తావ్ !''






నళిని 'ఇంటిగుట్టు'

ఆంజనేయులు ఇరకాటంలో పడ్డాడు. ''బాబూ! నాకింత పరీక్ష పెట్టకండి, బాబూ!''

రాజా సూటిగా చూశాడు. ''ఇంకా యాభై సెకెండ్లు మాత్రమే టైముంది.''

''శ్రీరామచంద్ర ప్రభో! ఇప్పుడు నేనేం చెయ్యాలి ? ఈ సమస్యనుంచి ఎలా బయట పడగలను !'' అన్న ఆంజనేయులి ముఖం క్రమ క్రమంగా విప్పారింది. ఏదో ఒక నిర్ణయాని కొచ్చినట్లు చిటికె వేశాడు.

రాజా ఆతురతో కళ్ళప్పగించి చూస్తుండి పోయాడు.

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కృష్ణ సమర్పించే శ్రీ విజయకృష్ణ మూవీస్ ''ముక్కోపి'' చిత్రానికి ఎస్. రమానంద్ నిర్మాత.

## జయరామారావు చిత్రంలో "అమ్మ"గా జయసుధ

''రుక్మ — అనే మలయాళ హిట్ ఫిలిమ్‌ను తెలుగులో తీస్తున్నాం. రాజమండ్రి ప్రాంతాలలో సెప్టెంబర్ 1 నుంచి 30 వరకు నిర్విరామంగా షూటింగ్ ఫినిష్ చేస్తాం,'' అన్నారు జయ రామారావు. ఈయన మహేశ్వరి ప్రొడక్షన్స్ బానర్‌లో నిర్మించే ''అమ్మ'' చిత్రంలో జయసుధ, నరేష్, శరత్‌బాబు, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, వేలు, భానుప్రియ, రమాప్రభ వగైరా తారాగణం సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, రఘు ఛాయతో ఎస్. పి. వెంకన్నబాబు సమర్పించే ఈ చిత్రానికి అనిల్‌కుమార్ డైరెక్టర్.

# అవి - ఇవి

★ కృష్ణంరాజు ప్రధాన పాత్ర నిర్వహిస్తూ, సమర్పించే గోపీకృష్ణా మూవీస్ ''విశాల నేత్రాలు'' చిత్రానికి బాపు దర్శకుడు.

★ మురళీమోహన్ సమర్పణలో వచ్చే సంవత్సరం జయభేరీ ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రంలో కృష్ణ హీరో.

★ కె. విశ్వనాథ్ దర్శకత్వం నెఱపే విజయమాధవీవారి ''శంకరాభరణం'' హిందీ చిత్రంలో గిరీష్ కర్నాడ్, జయప్రద ప్రధాన పాత్రధారులు.

★ శాయికృష్ణ కేశవరావు హిందీలో నిర్మించే ''శ్రీవారికి ప్రేమలేఖ'' చిత్రానికి జంధ్యాల దర్శకుడు.

★ రాధాకృష్ణా మూవీస్ అధినేత జి. సత్తిరాజు సెప్టెంబర్‌లో ప్రారంభించే చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ నాయకా నాయికలు.

★ కె ఎస్. ఆర్. దాస్ సొంత చిత్రంలో మోహన్‌బాబు హీరో.

★ ''సాహసమే జీవితం'' అనంతరం భారతీవాసు దర్శకత్వం నెఱపే గజలక్ష్మీ కంబైన్స్‌వారి తదుపరి చిత్రంలో కూడా బాలకృష్ణ హీరో.

★ ''నైట్ ఓవర్ చిలీ'', టర్కీవారితో యుద్ధానికి సంబంధించిన ''స్టార్ ఆఫ్ హోప్'' సోవియెట్ చిత్రాలకు మన సెన్సార్‌వారి హస్తముద్ర పడకపోవడం కొందరికి విస్మయాన్ని కలిగించింది

★ ''నెంజత్తైకిల్లాదే'' తమిళ చిత్రం హిందీలో మహేంద్రన్ దర్శకత్వంలో తయారవుతోంది. అందులో శరత్‌బాబు కూడా నటిస్తున్నాడు. మారుతీకారు ఉన్న ఏకైక సినిమా నటుడు శరత్ (నెంబర్ టి. ఎం. 3377).

★ బాబూ ఆర్ట్స్ ''ఇల్లాలు – ప్రియురాలు'' చిత్రంలో శోభన్‌బాబు ఇల్లాలుగా సుహాసిని నటించగా, ప్రియురాలు పాత్రకు ప్రీతి అనే నవ నటి పరిచయం గావింపబడుతోంది. ప్రీతి నివాసం బొంబాయి. మాతృభాష పంజాబీ. ఎలెక్ట్రానిక్ స్టూడెంట్.

'పల్నాటి పులి'లో బాలకృష్ణ, భానుప్రియ



# సినిమా



'శభాష్ మోతీ'లో లక్ష్మి

## శాయి ఆర్ట్స్ "శభాష్ మోతీ"

లక్ష్మి, శంకరనాగ్, జ్యోతిలక్ష్మి ముఖ్య తారాగణంగా, అత్యద్భుతమైన ఫైటింగ్స్, సెంటిమెంట్స్ మేళవించి శాయి ఆర్ట్స్ వారు సమర్పిస్తున్న నూతన చిత్రం "శభాష్ మోతీ".

ఈ చిత్ర కథలో ఒక కొత్తదనం ఉంది. వెరైటీ ఆశించే ప్రేక్షకులకు యిది చక్కని చిత్రం. ఈ చిత్రంలో విశ్వాసపాత్రమైన "మోతీ" (కుక్క) తన యజమానిని చంపిన వారిపై పగపట్టి ప్రతీకారం తీర్చుకోడానికి, అది చేసే ప్రయత్నాలూ, అద్భుత చర్యలూ, ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. చివరి వరకూ ఆ హంతకులను తరిమి, చివరకు మోతీ ముగ్గురు హంతకులను చంపి, తన విశ్వాసాన్ని చూపించడం ఈ చిత్రంలో ప్రత్యేకత. వెరైటీ పాత్రలో లక్ష్మి నటనలో తనకు తానే సాటి అని మరోసారి నిరూపించుకుంటుంది. మోతీని ప్రేమగా పెంచే యజమానిగా శంకరనాగ్ నటిస్తున్నాడు.

ఈ చిత్రానికి కథ: అబ్బాయినాయుడు, మాటలు, పాటలు, గోపి సమకూరుస్తున్నారు. సంగీతం : సత్యం. ఎడిటింగ్ : కృష్ణస్వామి, స్క్రీన్ ప్లే–దర్శకత్వం : విజయారెడ్డి, కెమెరా: చిట్టిబాబు, గాయనీ, గాయకులు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, వాణీజయరాం, నిర్మాత : ఎ. శాయిప్రసాద్.

## రేలంగి నరసింహారావు దర్శకత్వంలో నవత ఆర్ట్స్ చిత్రం

"మా పదవ చిత్రానికి ఆగస్టులో పాటలు రికార్డు చేసి, సెప్టెంబర్‌లో షూటింగ్ ప్రారంభిస్తాం," అన్నారు నిర్మాత ఎస్. కృష్ణంరాజు. ఈయన కొత్త చిత్రంలో చంద్రమోహన్, విజయశాంతి, శరత్‌బాబు ఆదిగాగల వారుంటారు. సత్యానంద్ సంభాషణలు, పుహళేంది సంగీతం, ఆర్. కె. రాజు ఛాయ, ఎన్. అచ్యుతరామరాజు నిర్వహణతో రేలంగి నరసింహారావు దర్శకుడు.



జయప్రద 'సంపూర్ణ ప్రేమాయణం'

## మొదటి షెడ్యూల్ పూర్తయిన "సంపూర్ణ ప్రేమాయణం"

"జూలై 23 నుంచి నెలాఖరు వరకు మొదటి షెడ్యూల్‌ను పూర్తిచేశాం. డైరెక్టర్‌గా ఇచ్చిన తొలి అవకాశాన్ని ఎస్. బి. చక్రవర్తి చక్కగా వినియోగించుకున్నారు. ఆయనతో శోభన్‌బాబు, జయప్రద, సత్యనారాయణ, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, రాజేంద్రప్రసాద్ వగైరా ఆర్టిస్టులందరూ ఎంతగానో సహకరించారు. అక్టోబర్ 2న విడుదల చేయాలనుకుంటున్నాను," అన్నారు మిద్దె రామారావు. ఈయన శ్రీ రాజలక్ష్మి సినీ ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో నిర్మించే పై చిత్రానికి యండమూరి వీరేంద్రనాథ్ కథకుడు. సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, కన్నప్ప ఛాయ, శాయికుమార్ శిల్పం, డి. వెంకటరత్నం కూర్పు, గోపాల్ సహకార దర్శకత్వం, ఎన్. సత్యనారాయణ – ఎన్. వెంకటేశ్వరరావు ప్రొడక్షన్‌తో, కె. ఎల్. ఎన్. శాస్త్రి నిర్మాణ సారథి.

## భారతీరాజా దర్శకత్వంలో కృష్ణ, జయప్రద

"వచ్చే సంవత్సరారంభంలో ప్రారంభించడానికి సన్నాహాలు చేస్తున్నాం," అని తెలిపారు పవన్ ప్రొడక్షన్స్ అధినేతలు చుక్కపల్లి వేణుబాబు, నీలకంఠ. "సీతాకోక చిలుక" అనంతరం భారతీరాజా తెలుగులో దర్శకత్వం వహించే ఈ చిత్రంలో కృష్ణ, జయప్రద నాయకానాయికలు. ఇళయరాజా సంగీత దర్శకుడు. కణ్ణన్ ఛాయాగ్రాహకుడు.

## విదేశీ చిత్ర వార్తలు

★ సోఫియాలోరెన్ వయసు 49. "అరోరా" అనే చిత్రంలో ఈమెతో పాటు ఈమె 11 ఏళ్ల కొడుకు ఎడోర్డో నటిస్తున్నాడు. ఈమె భర్త కార్లోపోంటి ఈ చిత్ర నిర్మాత.

★ 1982–83 లో కెనెడాలో 53 చిత్రాలకు అక్కడి సెన్సార్ వారు సర్టిఫికేట్లు ఇవ్వడానికి నిరాకరించారు.

★ చైనాలో ఇదివరకు వెండితెర మీద చుంబన దృశ్యాలకు అనారోగ్య కారణాల దృష్ట్యా నిషేధం ఉండేది. ఇటీవలే అది తొలగించబడింది. టి. వి. లో కూడా అనుమతింపబడింది.

★ పాకిస్థాన్‌లో మనదేశపు చిత్రాల వీడియో కేసెట్ అద్దె రోజుకి పదిరూపాయలైతే "కూలి" చిత్రం కేసెట్ అద్దె మాత్రం నలభై రూపాయల పైచిలుకు పలుకుతోందట.

★ అమెరికాలో సూపర్ హిట్ అయిన "ఫైర్ ఫాక్స్" అనే చిత్రం రష్యాను న్యూనతపరిచే విధంగా ఉన్నందున మన దేశంలో నిషేధించబడింది.

★ ఆల్‌ఫ్రెడ్ హిచ్ కాక్ చిత్రం "సైకో"లో ఘోరహంతకుడుగా నటించిన ఆన్‌థోనీ పెర్కిన్స్ (51) అక్రమంగా గంజాయిని చేరవేసిన అభియోగంపై లండన్ విమానాశ్రయంలో అరెస్టయి, ఆ తర్వాత విడుదల కాబడ్డాడు.

## "సైకిల్ షాప్ చుక్కమ్మ"గా సిల్క్ స్మిత

స్మిత సరసన హీరోగా శివాజీగణేశన్ కొడుకు ప్రభు తొలిసారిగా ఈ చిత్రం ద్వారా తెలుగు తెరపై కనిపిస్తాడు,'' అన్నారు స్వర్ణాంబిక. ఈమె నిర్మించే ''సైకిల్ షాప్ చుక్కమ్మ'' చిత్రంలో ప్రమీల, బిందుఘోష్, జెమినీగణేశ్ ఇతర పాత్రధారులు. మాటలు, పాటలు గోపి రాశారు. ఇళయరాజా సంగీతం, గౌతమ్ కూర్పుతో రామనారాయణ దర్శకుడు.

## బెంగళూరులో "తంచు కాగడా" రెండవ షెడ్యూల్

బెంగళూరు పాలెస్‌లో జూలై 1 నుంచి 10 వరకు ఎన్నో కీలకమైన సన్నివేశాలను 'నభూతో నభవిష్యతి' అన్న రీతిలో మా డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి పిక్చరైజ్ చేశారు. 'అల్లూరి సీతారామరాజు' తర్వాత మా హీరో కృష్ణ అంతటి ఉత్తేజాన్ని, ఉద్రేకాన్ని కలిగించే ఒక విప్లవకారుని పాత్రను మా సినిమాస్కోప్ చిత్రంలో పోషిస్తున్నారు. హీరోయిన్ శ్రీదేవి నిర్భయంగా తొలిసారిగా గుర్రాన్ని స్వారీ చేయడం మా చిత్రంలోనే,'' అన్నారు రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఎస్. రామలింగేశ్వరరావు. దసరా కానుకగా విడుదలయ్యే ఈ చిత్రంలో ఇంకా జగ్గయ్య, రావు గోపాలరావు, గుమ్మడి, నాగేష్, నూతన్ ప్రసాద్, శ్రీధర్, గిరిబాబు, ప్రసాద్ బాబు, వేలు, వీరభద్రరావు, రాళ్ళపల్లి, రాజ్‌వర్మ, చిట్టిబాబు, కె. కె. శర్మ, సిలోన్ మనోహర్, రామదాసు, రాజ్‌కుమార్, చిడతల అప్పారావు, నిర్మల, అనూరాధ, శ్రీలక్ష్మి, పద్మ, డాక్టర్ మదన్ మోహన్, సత్తిబాబు నటిస్తున్నారు. సత్యమూర్తి కథకు మహారథి, సత్యానంద్ మాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, జి. వి. కృష్ణారావు నిర్వహణతో వందిగం దేవీప్రసాద్ సమర్పిస్తారీ భారీ చిత్రాన్ని.





## ఎస్. ఎస్. లాల్ అస్తమయం

''ఆంధ్ర సచిత్ర వారపత్రిక'' కథానికల పోటీల్లో విజేతగా పాఠకలోకానికి, సుప్రసిద్ధ ఛాయాగ్రాహకుడు – దర్శకుడుగా ప్రేక్షక లోకానికి సుపరిచితులైన శ్రీ ఎస్. ఎస్. లాల్ తన 49వ ఏట ఆకస్మికంగా విధిసులయ్యారు. ఈయనకు భార్య, నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. పెద్ద కొడుకు కబీర్‌లాల్ కూడా ఛాయాగ్రాహకుడే.

విజయవాడ శాంతి థియేటర్‌లో ''హీరో'' (హిందీ) చిత్రం శతదినోత్సవం చేసుకున్న సందర్భంగా వేదికపై శ్రీ తుర్లపాటి, శ్రీ మల్లికార్జునరావు, శ్రీ కాట్రగడ్డ నరసయ్యగార్లని చిత్రంలో చూడవచ్చు.





ఉదయాస్తమానం పని వుంటూనేవుంటే ఉత్తేజాన్నిచ్చే టీ వుండాలంతే...




(గత సంచిక తరువాయి)

## కృష్ణా !

నేనెవర్ [illegible] ఉంటుందనే అనుకుంటాను అదే! ఆ రోజు మనం రైల్వేస్టేషన్లో కలుసుకున్నాం చూడు! నా అందం అద్భుతమనీ, నిన్ను బంధించివేసిందనీ చెప్పావ్ నువ్వు అప్పుడు! ఆ సావిత్రినే నేను!

కృష్ణా!

కృష్ణా!

నాలాంటి ఆడపిల్లలు చాలా మంది నీ వలలో పడ్డారనీ — అలాంటి మాటలతో అందరినీ లోబరుచుకోవడం నీకు అలవాటనీ నాకా రోజు తెలీదు.

నువ్వు నన్ను నిజంగా ప్రేమించి, కొన్ని కారణాలవల్ల పెళ్ళి చేసుకోలేకపోతే నేనింతగా బాధపడే దాన్నికాదు.

కానీ కపటప్రేమ చూపి, నన్ను లోబరచుకుని, ఆ తరువాత నన్ను వదిలించుకోడానికి ఆడిన నాటకం చూసి నేను తట్టుకోలేక పోతున్నాను.

ఇవాళ నీ గదికి అకస్మాత్తుగా వచ్చి ఆ దృశ్యం చూడకపోయినట్లయితే — బహుశా ఎలాగోలా బ్రతికే ఉండాలని అనుకునేదాన్నేమో!

కానీ ఇంక నాకు విరక్తి కలిగింది.

అన్నీ తెలిసికూడా మోసపోయాను ఇలాంటివెన్నో సంఘటనలు చూసికూడా నన్ను నేను రక్షించుకోలేకపోయాను.

కృష్ణా! నా ఆత్మహత్యతోనయినా నువ్వు నాలాంటి అమాయకురాళ్ళను మోసం చేయడం మానివేస్తే కొంతవరకూ నా చావుకి ప్రయోజనం ఉంటుంది.

నా చావుకి కారణం నువ్వేనని ఓ ఉత్తరం రాసిపెట్టి చచ్చిపోతే నీమీద ప్రతీకారం తీర్చుకొన్నట్లవుతుంది.

కానీ అది నాకిష్టంలేదు

నా చావుకి నువ్వే కారణం అన్న విషయం నీకొక్కడికే తెలియాలి. అది ఎవరికీ చెప్పలేక నీలో నువ్వే జీవితాంతం చిత్రవధ అనుభవించాలి.

అందుకే నీఒక్కడికే తెలిసేట్లు ఈ ఉత్తరం రాసి నీకు పోస్ట్ చేస్తున్నాను. ఈ ఉత్తరం నీకు చేరుతుంది. అంటే అప్పటికే నీకు నా ఆత్మహత్య విషయం తెలుస్తుందనుకుంటాను. ఒకవేళ తెలీకపోతే ఈ ఉత్తరం అందాక ఓసారి మా ఇంటివేపు వెళ్తే చాలు — తెలుస్తుంది.

నాకు ఈ నిర్ణయం తీసుకున్నాక ఎంతో ఆనందంగా ఉంది కృష్ణా! ఎందుకో తెలుసా?

నేను బ్రతికుంటే నన్ను చూసినప్పుడల్లా "ఈ అమ్మాయి శరీరం అనుభవించాను" అని అనుకొని ఆనందించేవాడివి.

అలాంటి ఆనందం నీకు కలుగకుండా ఆ శరీరమేలేకుండా చేస్తున్నాను.

— సావిత్రి

కృష్ణ కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయ్.

సోఫాలో నిస్సత్తువగా కూలిపోయాడు.

అతనికి ఇప్పుడు పూర్తిగా అర్థమయింది

తను చేసిన మోసం బయట పడేసరికి ఆ నిజం భరించలేక తన జీవితం అంతం చేసుకుంది సావిత్రి.

'తను అనుభవించేఅనేకమంది అమ్మాయిల్లో తనూ ఒక్కర్తె' అని తెలుసుకున్న ఆమె ఆ చేదు నిజం భరించలేకపోయింది.

'తను అంతకాలం ఎంతో గాఢంగా ప్రేమించి శీలాన్ని అర్పించింది తనలాంటి మోసగాడికి' అన్న విషయం తెలుసుకుని తట్టుకోలేక జీవితం అంతం చేసుకుంది.

తను చాలామంది ఆడపిల్లల జీవితాలతో చెలగాటలాడాడు. కానీ ఎవ్వరూ ఇలా దారుణంగా జీవితం అంతం చేసుకోలేదు

లేచి వెళ్ళి మ్యూజిక్ ఆన్ చేశాడతను.

పెద్ద శబ్దంతో—హోరున—మోగుతోందది.

అయినా సావిత్రిని గురించిన ఆలోచనలు వదలటం లేదు. తేనెటీగల్లా ముసిరిపోయి మనసుని ఆక్రమించుకుంటున్నాయ్.

మొదటిసారి ఆమెను స్టేషన్లో చూడడం—

తను ఆమె స్నేహితురాలి అన్నగా పరిచయం చేసుకోవడం— ఆమెను నమ్మించడం—

ఉద్యోగం సాకుతో ఆమె పరిచయం పెంచుకోవడం, ఆ తరువాత ఆమెను బీచికీ, హోటళ్ళకూ, సినిమాలకూ బలవంతంగా తిప్పడం— మాయ మాటలు చెప్పి ఆమెను లొంగదీసుకోవడం—

ఆ తరువాత ఆమె తనను వివాహం చేసుకోమని బ్రతిమాలడం, సిగ్గువిడిచి తన ముందే ఏడ్చేయడం—

ఈ దృశ్యాలన్నీ కళ్ళముందు వరుసగా కనబడుతోంటే పిచ్చెక్కినట్లవుతోంది

తను ఇంతవరకూ జీవితంలో ఆనందాన్నే అనుభవించాడుగానీ దుఃఖాన్ని ఎప్పుడూ చవి చూడలేదు.

**జరిగిన కథ—7 :** కృష్ణ, ప్రసాదు స్నేహితులు. కృష్ణ తనో డాక్టరుగా ఆ హాస్పిటల్ సిస్టర్‌కు చెప్పి తన పేషంటు ఒకామెకు ఇంజక్షన్ చేయడానికి ఆమెను రమ్మని వేడుకుంటాడు. కృష్ణ అన్న సీతారామయ్య వస్తున్నట్లు టెలిగ్రాం ఇస్తాడు. సిస్టర్ కృష్ణ ఇంటికి వస్తుంది. కృష్ణ విచ్చలవిడి ప్రవర్తనకు ప్రసాద్ చికాకు చెందుతాడు. తమ్ముడు అనుభవిస్తున్న ఆడంబరమైన జీవితాన్ని చూసి సీతారామయ్య ఆనందిస్తారు. ఎలాగయితేనేం తను వేస్తున్న వెధవ వేషాలేమీ తన అన్న కంటబడకుండా మేనేజ్‌చేసి అతన్ని బస్ ఎక్కించేస్తాడు కృష్ణ. తనకు పెళ్ళి కుదిరిందని, ఆ తర్వాత నీ దగ్గరకు రానని ఖచ్చితంగా చెప్పేస్తుంది, చంద్రకళ కృష్ణతో. నిదానంగా మార్గరేట్‌ను తన సహజ వాక్చాతుర్యంతో తన దారిలోకి తెచ్చుకుంటాడు ఆ తర్వాత తన పాత స్నేహితురాలు రాజేశ్వరి వచ్చి తన దాహం తీర్చుకొంటుంది. ఆమె వెళ్ళిన తర్వాత సావిత్రి దర్శనం. సావిత్రికి తన స్నేహితుడి ఇండస్ట్రీలో అతనిద్వారా తనే జీతం ఇచ్చే మాట మీద ఉద్యోగం ఇప్పిస్తాడు కృష్ణ కృష్ణ సావిత్రిని ప్రేమిస్తున్నానని చెపుతాడు. అతని తత్వం తెలీని సావిత్రి తనూ అతనిని ప్రేమిస్తున్నట్లు చెపుతుంది ప్రసాద్ ఉద్యోగంలో చేరను హైదరాబాదు వెళ్ళిపోతాడు. కృష్ణ తన మాయమాటలతో సావిత్రిని లొంగతీసుకొని మొహం చాటువేస్తాడు. సావిత్రి తనకు పెళ్ళి కుదిరిందని చెప్పినా కృష్ణ ఆ విషయాని కంత ప్రాముఖ్యత నీయకపోవడం ఆమెకు కలవరపాటును కలిగిస్తుంది. సావిత్రిని ఏ విధంగా వదిలించుకుందామా! అని ప్లాన్స్ వేస్తుంటాడు కృష్ణ కృష్ణ ఆంతర్యం తెలుసుకొన్న సావిత్రి తల్లడిల్లిపోతుంది చెల్లెలు రుక్మిణి మరణంతో కృష్ణకు కనువిప్పు కలుగుతుంది. సావిత్రిని పెళ్ళి చేసుకోడానికి నిర్ణయించుకొని వచ్చేటప్పటికి సావిత్రి ఆత్మహత్య వార్త వింటాడు ఆమె చనిపోకముందు తనకు రాసిన ఉత్తరం చదవసాగాడు.

మ్యూజిక్ ఆపేశాడతను.

గదంతా పచార్లు చేయసాగాడు

కొద్దిసేపు మంచంమీద పడుకుండిపోయాడు. ఆ గదిలోనుంచి బయటకు పారిపోవాలనుంది. బయటికెళ్తే సావిత్రి ఆలోచనల్నుంచి తప్పించుకోవచ్చు. కానీ వెళ్ళేందుకు శక్తి ఏదీ?

కదల బుద్ధి కావడం లేదు.

అసలు తన శరీరం తన ఆధీనంలోనే లేదు.

గదంతా చీకటి వ్యాపించిపోయింది మరి కాసేపటికి.

బయట రోడ్డుమీద వెలుగుతోన్న లైట్లు కనబడుతున్నాయ్ కిటికీలోనుంచి.

గుండెల్లో ఏదో బాధ.

దుఃఖం పొంగుకొస్తోంది కానీ ఏదో శక్తి గొంతు పెగలనీయడం లేదు

దూరంగా డప్పుల చప్పుడు — రుక్మిణిని తీసుకెళ్ళేప్పుడూ ఇదే శబ్దం—భయం కలిగిస్తోందది.

క్రమక్రమంగా దగ్గరవుతోందది—

బరువుగా, గట్టిగా—గుండెల్ని పిండిచేసేలా—దగ్గరవుతోంది. చావు డప్పు అది.

ఎవరో పోయుంటారు.

కానీ అది తనకోసమే కొడుతున్నట్లుంది

త్వరగాలేచి తలుపులు, కిటికీలు అన్నీ మూసివేశాడు కృష్ణ ఆ శబ్దాలు వినబడకుండా ఉండాలని చెవులకు తువాలు చుట్టుకున్నాడు అయినా ఆ డప్పు శబ్దాలు మరింత ఎక్కువవుతున్నాయ్‌గానీ తగ్గటంలేదు

బాగా దగ్గరయి పోతున్నాయ్.

అవి తన మీదకి వస్తోన్నట్లనిపిస్తోంది.

భయం—బాధ —

వచ్చేసినయ్—

సమీపంగా—

గుండెలు పగిలేట్లు మోగుతున్నాయ్

వణికిపోతున్నాడతను

బయటకు పారిపోవాలనిపిస్తోంది

గదిలో ఇంకేవేవో శబ్దాలు తోడయినట్లనిపిస్తోంది.

ఎవరిదో వికటాట్టహాసం—

ఒక్క ఉదుటున లేచి తలుపు తెరచుకుని రోడ్డు మీదకు పరుగెత్తి ఒగరుస్తూ ఆగాడతను.

అప్పుడే ఇంటి ముందు నుంచీ వెళ్తోంది. శవం.

"ఎవడో మోసం చేశాడంట . ." ఎవరో అనుకుంటున్నారు.



అతనికి కొద్ది సెకన్లపాటు ఊపిరి స్తంభించి పోయినట్లయింది.

ఎవరి శవం అది ?

సావిత్రా ?

శవం వేపు చూశాడతను.

ఒళ్లు ఝల్లుమంది.

శరీరమంతా వణికిపోయింది.

అవును ! సావిత్రి !

సావిత్రే !

మొఖం వాడిపోయి, చిరునవ్వు చెరిగిపోయి, కళ్లు మూతలు పడి...

పెదాలు పగిలిపోయి—

సావిత్రే ! సావిత్రే !

"సావిత్రీ ! ఇంత అందమయిన కళ్ళూ, ఇంత అందమయిన పెదాలూ, ఇంత అందమయిన చిరునవ్వూ — ఇవన్నీ ఈ మొఖంలోనే అమర్చడం నిజంగా దేవుడిచ్చిన వరం కదూ ?''

ఆ రోజు ఆమెను కౌగలించుకుని అన్నాడు తను.

సావిత్రి నవ్వింది అందంగా.

"మరీ అంతగా పొగడకండి ! నేను అంత గొప్ప అందగత్తెను కాదని నాకు తెలుసు.''

ఆమె పెదాలమీద గాఢంగా చుంబించాడు తను.

ఆ తరువాత ఆమెను నుదుటిమీదా, కళ్ళమీదా, చెక్కిళ్ళమీదా, ముద్దులతో నింపేశాడు.

ఆ సావిత్రే !

ఆ సావిత్రి అందమయిన కళ్ళే అవి !

ఆ సావిత్రి చెక్కిళ్ళే అవి !

ఆ సావిత్రి పెదాలే అవి !

"సావిత్రీ ! నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నానన్న నమ్మకం నీకుందా ?''

## జీవితం — సెంటిమెంట్

"లేకపోతే మీకింత దగ్గరవుతానా ?''

"సావిత్రీ ! మనం పెళ్ళి చేసుకుందాం ! అందరినీ ఎదిరించి అయినాసరే ఒకటవుదాం.''

"ప్రామిస్ ?''

"ప్రామిస్ !''

"నన్ను ఏ పరిస్థితుల్లోనూ దూరంచేయరు కదూ ?''

బేలగా, ఆశగా చూస్తోన్న కళ్ళు —

"సావిత్రీ ! నిన్ను దూరం చేసుకుని నేను బ్రతగ్గలనా ?''

కళ్ళల్లో మెరుపు — పెదాలమీద ఆనందం.

ఆ సావిత్రే !

శవం ముందు ఎవరో ఓ మధ్య వయస్కుడు నడుస్తున్నాడు.

హఠాత్తుగా తూలి పిట్టగోడ పట్టుకుని నిలబడ్డాడు తను.

తన శరీరం మీద స్వాధీనం పోయింది.

కొద్దిక్షణాలు అలానే నిలబడిపోయాడు

శవం దూరంగా వెళ్ళిపోయింది.

డప్పులు దూరమయిపోయాయ్.

అతికష్టం మీద కూడదీసుకుని ఇంట్లోకి నడిచాడతను.

లోపల చీకటి !

కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి !

లైట్ స్విచ్ ఎక్కడుంది ?

ఏ గోడకుంది ?

ఏ పక్కనుంది.

గోడంతా తడుముతూ నడుస్తున్నాడతను.

ఎవరో ఒక్కసారిగా తనకు ఢీకొన్నట్లనిపించి పిచ్చికేక వేశాడతను

మరుక్షణంలో పెద్ద శబ్దం —

ఏదో కింద పడింది పైనుంచి.

అప్పుడే చేతికి స్విచ్‌బోర్డు తగిలింది.

మరుక్షణంలో గదంతా వెలుగు —

ఎదురుగ్గా టేప్‌రికార్డర్ కింద పడివుంది.

అద్దం ముక్కలు —

గోడలకున్నా సెక్సీ బొమ్మల కాలెండర్లు గాలికి ఎగిరెగిరి పడుతున్నాయ్.

శరీరంలోని వంపుసొంపులన్నీ నగ్నంగా చూపుతున్నయ్.

అక్కడే కుర్చీలో కూర్చుండిపోయాడతను.

తను అబద్ధాలు చెప్పి, మోసం చేసి, అనుభవించిన సావిత్రి శరీరం కాసేపట్లో మంటల్లో కాలబోతోంది

'నాది' అనుకుని కసితీరా అనుభవించిన ఆమె అందం మరికాసేపట్లో బూడిదవుతుంది.

"సావిత్రీ ! సావిత్రీ ! సావిత్రీ !''

చిన్న పిల్లాడిలా విలపించసాగాడతను.

"నిన్ను నేనే చంపాను సావిత్రీ! నేనే చంపాను! కసాయివాడిలా గొంతుకోసి చంపాను"

గంటలు నిముషాల్లా గడిచిపోతున్నాయ్.

చిత్రవధ అనుభవిస్తూనే ఉన్నాడు కృష్ణ.

రాత్రి గడిచిపోవడం అతనికి తెలీదు.

"ఏమిట్రా! ఏం జరిగింది?" సూట్ కేస్ తీసుకుని లోపలికి అడుగుపెట్టి అతని అవతారం చూస్తూనే ఆశ్చర్యంగా అడిగాడు ప్రసాద్.

ప్రసాద్‌ని చూసేసరికి కృష్ణకు ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది.

"నీ మాటలు వినకుండా సావిత్రికి అన్యాయం చేశ్రా! ఇప్పుడేం జరిగిందో చూశావా! సావిత్రి ఆత్మహత్య చేసుకుంది. నా మూలానే చచ్చిపోయిందిరా!" కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయ్యతనికి.

ప్రసాద్ నివ్వెరపోయాడు.

"ఎప్పుడు జరిగిందది?"

"మొన్న రాత్రి!"

"ఆ అమ్మాయి సంగతి నేనప్పుడే గ్రహించారా! టూ ఇన్నోసెంట్! అందుకే హెచ్చరించాను నిన్ను..."

దిగాలుపడి అన్నాడు ప్రసాద్.

చాలాసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"అసలా అమ్మాయి సూసైడ్ చేసుకున్నట్టు నీకెలా తెలిసింది?" అడిగాడు ప్రసాద్.

"నిన్న పొద్దున పోలీసులు వచ్చి నన్ను స్టేషన్‌కి తీసుకెళ్ళారు!"

ప్రసాద్ అదిరిపడ్డాడు.

"ఎందుకు?"

"ఏవో రెండు మూడు ప్రశ్నలడిగారు. ఆ తరువాత ఇంటికొచ్చేసరికి సావిత్రి రాసిన ఉత్తరం ఉంది..." అంటూ సావిత్రి రాసిన ఉత్తరం అతనికిచ్చాడతను. అది త్వరత్వరగా చదివాడతను.

"ఒరేయ్ మీ అన్నయ్యను పిలిపించడం మంచిది!" అన్నాడు కొద్దిసేపటి తర్వాత.

"ఎందుకు?"

"ఇలాంటి కేసులు పోలీసుల చేతికెళ్ళాక తప్పించుకోవడం చాలా కష్టం. నీకూ, సావిత్రి ఆత్మహత్యకూ సంబంధం ఉందన్న ఋజువులు లేకపోయినా ఏదోఒక విధంగా ఇరికించడానికి చూడవచ్చు. అంతవరకూ దాచి ఉంచడంకంటే ముందే అన్నయ్యకు అంతా చెప్పి వేయడం మంచిది..."

కృష్ణకేం మాట్లాడాలో తోచలేదు.

అన్నయ్యకి విషయమంతా తెలిస్తే లేనిపోని ఇబ్బంది సృష్టించుకున్నట్లవుతుంది.

తనమీద అంతవరకూ ఉన్న సదభిప్రాయం తుడిచిపెట్టుకుపోతుంది. అయినా సరే–తప్పని సరి!

"సరే – నువ్వే చూడరా ఆ పని!" అన్నాడతను.

ప్రసాద్ ఫోన్ గ్రామ్ ఇచ్చాడు శీతారామయ్యకు.

"సావిత్రి రాసిన ఉత్తరం తగలబెట్టెయ్యటం మంచిది–" అంటూ జేబులోనుంచి లైటర్ తీసి ఉత్తరం తగలబెట్టేశాడతను.

కృష్ణ నిస్సహాయంగా చూస్తూండిపోయాడు.

కంగారుగా ఆ సాయంత్రానికల్లా అక్కడికి చేరుకున్నాడు శీతారామయ్య. లోపల దిగాలుపడి కూర్చున్న కృష్ణనీ, ప్రసాద్‌నీ చూసేసరికి ఆయనకు ఆత్రుత ఎక్కువయిపోయింది.

"ఏమిటి? ఏం జరిగింది?" అనడిగాడాయన ఆదుర్దాగా.

కృష్ణ ఏమీ మాట్లాడలేకపోయాడు.

"మాట్లాడవేరా?" కృష్ణను రెట్టిస్తూ అడిగాడు.

"నేను చెప్తాను – ముందు మీరు స్నానం అదీ కానీండి!" అన్నాడు ప్రసాద్.

ఆ మాటతో ఆయనకు భయం వేసింది.

కృష్ణ చెప్పలేని విషయం జరిగిందా? ఏమయి ఉంటుందది? ఈ వయసులో ఇంకేముంటుంది? ఎవర్నయినా ప్రేమించడం, పెళ్ళి చేసుకోవడం –

ఆ! అదే అయి ఉంటుంది.

ఎవరో అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసేసుకుని ఉంటాడు.

ఆ విషయం ఇప్పుడు తనతో చెప్తే తను కోప్పడతాడని భయపడుతూండవచ్చు.

ఇంక మాట్లాడకుండా స్నానం అదీ ముగించి బట్టలు మార్చుకున్నాడతను.

"పదండి! మనం అలా వెళ్ళి భోజనం చేస్తూ మాట్లాడుకుందాం" అన్నాడు ప్రసాద్.

"మరి వాడికి భోజనం?" అడిగాడు శీతారామయ్య.

"ఎక్కడో చోట చేస్తాడులెండి."

ఇద్దరూ ఆటోలో హోటల్‌కి చేరుకున్నారు.

భోజనం ఆర్డర్ చేశాక జరిగిందంతా చెప్పడం ప్రారంభించాడు ప్రసాద్.

అతని మాటలు వింటూంటే విపరీతమయిన ఆశ్చర్యంగా ఉంది శీతారామయ్యకి.

కృష్ణ అలాంటి పనులు చేస్తాడంటే నమ్మబుద్ధి కావడంలేదు.

"అయితే వాడిని మందలించడంపోయి నువ్వూ వాడికి వంత పాడావన్నమాట ఇక్కడున్నన్నాళ్ళూ..." అన్నాడతను కోపంగా.

ప్రసాద్ తడబడ్డాడు.

"భలేవారే మీరు! నేను వంతపాడడమా? ఎప్పటికప్పుడూ ఎలా గొడవచేసేవాడినో మీకు తెలీదు. నేను ఉన్నంతవరకూ కనిపెట్టే ఉన్నాను వాడిని," అన్నాడు నిష్ఠూరంగా.

"ఇంతకూ ఇప్పుడు మనం ఏం చేయాలంటావ్?" అడిగాడతను.

"మరేంలేదు. మీరు మీ ఇన్‌ఫ్లుయెన్స్ ఉపయోగించి ముందు వాడిని ఆ పోలీసుల కాగితాల్లోనుంచి తొలగించండి – నిజానికి వాడిని వాళ్ళు చేయగలిగిందికూడా ఏమీ లేదు. అయినా గాని ముందు వాడినీ ఊరినుంచి తీసుకెళ్ళిపోవాలి. వాడి మానసిక పరిస్థితి ఏం బావుండలేదు –"

"బాగోపోతేపోనీ! నేనేం కల్పించుకోదల్చుకోలేదు. ఎవడు చేసిన తప్పుకి శిక్ష వాడే అనుభవించాలి..." కోపంగా అన్నాడు శీతారామయ్య.

ఆయనకు రుక్మిణి గుర్తొచ్చింది. ఆమెను మోసం చేసిన వాడూ గుర్తొచ్చాడు.

"నిజమేననుకోండి... అయినా వాడినీ స్థితిలో వదిలేస్తే..."

"ఊ! వదిలేస్తే! ఏమవుతుంది?"



'సహృదయ సాహితి' ఆధ్వర్యంలో ఇటీవల విశాఖపట్నంలో జరిగిన 'జాతి బొమ్మ' నవల ఆవిష్కరణ సభలో రచయిత 'పైడిపాల' ఫిలిం సెన్సార్ బోర్డ్ సభ్యులు శ్రీ టి. సుబ్బరామిరెడ్డికి నవలని అంకితమిస్తున్న దృశ్యం. ప్రసంగిస్తున్న ముఖ్య అతిథి డా. సి. నారాయణరెడ్డిగారిని కూడా చిత్రంలో చూడవచ్చు.

## జీవితం — సెంటిమెంట్

''ఏం జరిగినా జరగవచ్చు — పిచ్చెక్కినా మనం ఆశ్చర్యపోనక్కరలేదు.''

''ఎక్కనీ ! పిచ్చాసుపత్రిలో కూడా చేర్పించను...''

ప్రసాద్‌కింకేం చేయాలో తోచలేదు.

''సరేనండీ ! మీ ఇష్టం ! మీకేం అంత అభిమానం లేకపోయాక ఇంక నాకు మాత్రం ఎందుకు ? నా దారిన నేనూ ఇప్పుడే వెళ్ళిపోతాను...''

ఆ మాటతో కొంచెం కోపం తగ్గింది శీతారామయ్యకు.

కొద్దిసేపు ఇద్దరూ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయారు.

భోజనం ముగిసింది.

బిల్ తనే చెల్లించాడు ప్రసాద్.

ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు.

ఇంట్లో కృష్ణను చూడగానే మళ్ళీ కోపం ముంచుకొచ్చిందతనికి. స్వేచ్ఛగా వదిలినందుకు, అడిగినంత డబ్బు ఇచ్చినందుకు తగిన శాస్తి చేశాడు. రుక్మిణి లాగానే ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకునేటంతగా జీవితం మీద విరక్తి చెందిందంటే వీడెంత దుర్మార్గుడయి ఉండాలి ?

అదే తనకు ఆందోళన కలిగిస్తున్న విషయం.

ఇప్పుడిక చేయగలిగిందేముంది ?

వెంటనే వాడి మకాం అనకాపల్లికి మార్చేయాలి. చదువూ, గిదువూ అన్నీ ఆపేసి వ్యాపారంలో తనకు సహాయం చేయమనాలి.

''భోజనం చేశావుటా ?'' ప్రసాద్ అడిగాడు కృష్ణని.

''ఊహూ ! తినబుద్ధి కావడంలేదు.''

ప్రసాద్ ఇంకేమీ మాట్లాడలేదు.

''రేపు ఉదయం సామానంతా లారీలో బుక్‌చేసి, నువ్వు ఇంటికి వెళ్ళిపో !'' కృష్ణతో అన్నాడు శీతారామయ్య.

కృష్ణ మాట్లాడలేదు.

ఆ రాత్రంతా అతనికి నిద్ర పట్టలేదు.

ఇంటి దగ్గర వదినకు తన మొఖం ఎలా చూపాలో తెలీడంలేదు. తన గురించి తెలుసుకుంటే ఆమెకు తన మీదున్న అభిమానమంతా దూరమయి పోతుంది.

ఆ పరిస్థితిలో ఇరవైనాలుగ్గంటలూ ఆమెకెదురుగ్గా కూర్చుని గడపాలంటే మనస్కరించడంలేదు.

అన్నయ్య కూడా తనతో అదివరలా మాట్లాడడు. ఇంచుమించుగా జైల్లో ఉన్నట్లే.

ఆలోచనల్లోనే తెల్లారిపోయింది.

కుర్రాడు న్యూస్‌పేపర్ తెచ్చి కిటికీలోనుంచి లోపలకు విసిరి వెళ్ళిపోయాడు.

శీతారామయ్య లేచి పేపరు అందుకున్నాడు.

మొదటి పేజీలోనే ఓ మూల పెద్ద అక్షరాలతో ఉన్న వార్త చూసి అతనికి షాక్ తగిలినట్లయింది.

సావిత్రి ఆత్మహత్య కేసు కొత్త మలుపు— అని ఉంది హెడ్డింగ్. ప్రక్కనే సావిత్రి ఫోటో!

వేగంగా దానికింద రాసిన విషయమంతా చదివాడతను.

సావిత్రి గదిలో లభించిన వెండి ఫ్లవర్‌వాజ్ కృష్ణ అనే ఎం. ఏ విద్యార్థి బహూకరించినట్లు దాని మీద వ్రాయబడి ఉండడంతో కేసు కొత్త మలుపు తిరిగినట్లు పోలీసులు భావిస్తున్నారు. సావిత్రి డయిరీలో రెండు మూడు సందర్భాలలో కృష్ణ పేరు కనిపించిన విషయం ఇదివరకే పోలీసుల దృష్టినాకర్షించింది, ఆ సందర్భంలో అతనిని ప్రశ్నించడం కూడా జరిగింది...

ఆ పేపర్ తీసుకొచ్చి కృష్ణ మొఖం మీదకు విసిరాడాయన.

''ఇదిగో! నీ ప్రతాపం పేపర్లో వచ్చింది చదివి ఆనందించు...''

కృష్ణ పేపరు తన చేతుల్లోకి తీసుకున్నాడు

సావిత్రి ఫోటో కనిపించేసరికి గుండెల పగిలిపోయినట్లు బాధ. కళ్ళనిండుగా నీరు—

అతి కష్టంమీద ఆ వార్త అంతా చదివాడతను.

సావిత్రి బ్రతికి ఉన్నప్పుడే కాదు! చచ్చిపోయాక కూడా అబద్ధాలు చెప్తున్నాడు తను

ఇప్పుడు పోలీసులు తనకోసం వస్తే అబద్ధాలు చెప్పాలి.

తను ఆమెకు బహూమతిగా ఇచ్చిన వెండి ఫ్లవర్‌వాజ్ కేవలం ఆమెకూ తనకూ ఉన్న స్నేహాన్ని పురస్కరించుకు ఇచ్చినట్లూ—అంతకు మించి తనకూ ఆమెకూ ఏ విధమయిన సంబంధమూ లేనట్లూ — ఇంకా ఇలాంటివె మరికొన్ని అబద్ధాలు —

సావిత్రి ఫోటో నవ్వుతోంది.

ఇప్పుడేం అబద్ధాలు చెప్పినా నాకేం ఫరవాలేదు అన్నట్లుంది ఆ నవ్వు.

అసలు తనెందుకింకా అబద్ధాలు చెప్పాలి

ఉన్నదున్నట్లు చెప్పేస్తే ఏం జరుగుతుంది

మహా అయితే తనకి జైలుశిక్ష పడుతుందేమో ! పడితే మాత్రమేం ? దానివల్ల తనకెంత మనశ్శాంతిగా ఉంటుంది ?

అవును ! నిజం చెప్పాల్సిందే.

కాపోతే ఈ దారుణమయిన మానసిక పరిస్థితి తను భరించలేడు. పోలీసులతో అంతా చెప్పేసేస్తే తనను చిత్రవధ చేస్తున్న ఆలోచనలన్నీ తొలగిపోతాయ్. మనసు తేలిక పడుతుంది తను మళ్ళీ మామూలు మనిషి కాగలుగుతాడు

ఆ నిర్ణయం తీసుకోవడంతో అతనికి మనసు కొంత కుదుటపడింది. సావిత్రికి తను చేసిన అన్యాయానికి తనకు శిక్ష పడాల్సిందే.

''అన్నయ్యా !'' లేచి నిలబడి పిలిచాడతను

శీతారామయ్య అతనివేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

ప్రసాద్ అప్పుడే స్నానంచేసి బాత్‌రూమ్‌లోనుంచి బయటికొచ్చాడు.

''నేను పోలీస్ స్టేషన్‌కెళ్ళి ఉన్నదున్నట్లు అంతా చెప్పేస్తానన్నాయ్యా! సావిత్రి ఆత్మహత్య చేసుకోడానికి కారణం నేనేనని చెప్పేస్తాను. నేను ఆమెను నమ్మించి, మోసం చేశాననీ, అందువల్లే ఆమె ఆత్మహత్య చేసుకుందనీ — జరిగిందంతా చెప్తాను. నాకు జైలుశిక్ష పడినా ఫరవాలేదు

తప్పు చేశాను కాబట్టి శిక్ష అనుభవించడం న్యాయమే ! నువ్వు నా కోసం ఏమీ శ్రమ పడవద్దన్నయ్యా ! నేనే నా విషయం చూసు

కుంటాను '' అతను నెమ్మదిగా మాట్లాడుతోంటే ప్రసాద్, శీతారామయ్య ఇద్దరూ ఆశ్చర్యపోయి వినసాగారు

''ఒరేయ్ ! నీకేం పిచ్చెక్కలేదుకదా ?'' అన్నాడు ప్రసాద్ తేరుకుని

''ఎక్కకపోతే ఇలా ఎందుకు మాట్లాడతాడు ? చేసింది చాలక ఇప్పుడు మరో తద్దినం పెడతానంటాడు మనకి '' అన్నాడు శీతారామయ్య కోపంగా

''పిచ్చి కాదురా ప్రసాద్ ! నేను తప్పు చేశానన్న బాధ భరించలేకుండా ఉన్నాను నాకు కొంతయినా మనశ్శాంతి చిక్కాలంటే నన్ను నేను శిక్షించుకోవలసిందే !''

''దానిమూలాన నీ మనశ్శాంతి సంగతేమో గానీ మా అందరికి లేనిపోని ఇబ్బందులు చుట్టుకుంటాయ్. .'' చిరాగ్గా అన్నాడు ప్రసాద్

''అవున్నా— అలా నువ్వు ఎగబడి— నేను ఫలానపని చేశానహో అని పబ్లిగ్గా చాటితేగాని ఈ విషయం మన బంధుమిత్రులందరికీ తెలీదు అందరికీ తెలిశాక మేము మొఖం చాటేసుకుని ఇంట్లో కూచుంటేగాని నీకు మనశ్శాంతి దొరకదు ! కదూ ?''

తనూ ఆవేశంగా అన్నాడు శీతారామయ్య

దాంతో ఇక కృష్ణ ఏమీ మాట్లాడలేకపోయాడు

ఈ పరిస్థితిలో తనేం చెప్పినా వాళ్ళు వినిపించుకోరు తనేం మాట్లాడినా పిచ్చి మాటలుగానే ఉంటాయి తనేంచేసినా తప్పుగానే కనబడుతుంది.

''మీ ఇద్దరూ సాయంత్రంలోపు ఇల్లు ఖాళీ చేసి అనకాపల్లి వెళ్ళిపొండి! నేను తర్వాత వస్తాను '' అన్నాడు శీతారామయ్య

ప్రసాద్ తలూపాడు.

మరి కాసేపట్లో తను రడీ అయి బయటికెళ్ళిపోయాడతను

''పదరా! ఈ సామానంతా ముందు పాక్ చేసేద్దాం ..'' అన్నాడు ప్రసాద్.

''ఏమోరా! నాకు అనకాపల్లి వెళ్ళబుద్ధి కావడం లేదు...'' దీనంగా అన్నాడు కృష్ణ

''ఎందుకని?''

''ఇంత రాద్ధాంతమయ్యాక ఇంక ఇంట్లోనే అన్నయ్యా, వదినెల ఎదురుగ్గా గడపాలంటే ఏమిటోగా ఉంది ''

''మరేం ఫరవాలేదు! వాళ్ళేమీ పరాయి వాళ్ళు కాదుగా!''

''నీకు తెలీదురా! దగ్గర వాళ్ళు కాబట్టే మరీ డెలికేట్‌గా ఉంటుంది ''

''ఇప్పుడు నువ్వు అక్కడ ఉండకపోతే ఇంకెక్కడ ఉండగలవ్? ఇంత గొడవ జరిగాక అన్నయ్య మళ్ళీ నిన్ను ఇంకెక్కడయినా ఉంచి డబ్బు పంపుతాడనుకుంటున్నావా?''

''అదికాదురా! దూరంగా ఎక్కడికయినా వెళ్ళి ఏదోక ఉద్యోగం చేయాలని ఉంది ''

''ఉద్యోగాలు నీ కోసమని 'వెల్‌కమ్' బోర్డు కట్టుకొని ఉండవ్! అందుకు చాలా టైమ్ పడుతుంది. ''

''పోనీ నీతోపాటు హైద్రాబాద్ వస్తే ఎలా వుంటుంది?''

ప్రసాద్ కొద్ది క్షణాలు ఆలోచించాడు

''నాకేం అభ్యంతరం లేదుగానీ, ప్రస్తుతం అన్నయ్య అందుకు ఒప్పుకోడు. కనుక కొన్నాళ్ళు అనకాపల్లిలోనే గడుపు. ఆ తరువాత ఆలోచిద్దాం ఆ విషయం—''

కృష్ణ ఇంకేమీ మాట్లాడలేకపోయాడు

ఇద్దరూ మధ్యాహ్నంకల్లా ఇల్లు ఖాళీచేసి బస్‌లో అనకాపల్లి బయల్దేరారు

ఇంటికి చేరుకునేసరికి సాయంత్రం నాలుగయిపోయింది

''నేనింక హైద్రాబాద్ వెళ్ళిపోతాన్నా'' అన్నాడు ప్రసాద్

''బాబ్బాబు ! ఇంకొక్క రోజుండు ! ప్లీజ్ !'' బ్రతిమాలాడు కృష్ణ కాదనలేక ఆగిపోయాడతను

ఆ రాత్రికి తిరిగివచ్చాడు శీతారామయ్య

అతను వచ్చాకగానీ జరిగిందేమిటో అనూరాధకు అర్థంకాలేదు ప్రసాద్, కృష్ణ హఠాత్తుగా వైజాక్‌లో ఇల్లు ఖాళీచేసి రావడం, శీతారామయ్య అక్కడే ఉండిపోవడం — ఇవన్నీ ఏదో గొడవ జరిగినట్లు ఆమెకు సూచిస్తున్నాయ్! అయినా విషయమేమిటో వాళ్ళిద్దరినీ అడగనే లేదామె

వాళ్ళంతటవాళ్ళే చెప్తారేమోనని కొద్దిసేపు ఏవేవో మాట్లాడుతూ వాళ్ళతో గడిపింది గానీ కృష్ణ ముక్తసరిగా మాట్లాడడం, ప్రసాద్ ఇంకేవేవో విషయాలు మాట్లాడడం గమనించి ఆ ప్రస్తావనే మానుకుంది

ఆ రాత్రి శీతారామయ్య సంగతంతా చెప్పేసరికి ఆమెలో మొదటిసారిగా కృష్ణ అంటే అయిష్టం చోటు చేసుకుంది

అతని దుర్మార్గత్వం మూలాన ఓ ఆడపిల్ల జీవితం అంతం చేసుకుందంటే ఆమెకు భయంకూడా కలిగింది రుక్మిణీ అందరి మనసుల్లోనూ మెదలసాగింది

అతను తన మరిదిలాకాక ఓ సంబంధం లేని పరాయి వ్యక్తిలా అనిపించసాగాడు.

మర్నాడు ప్రసాద్ హైద్రాబాద్ వెళ్ళిపోయాడు

ఆ రోజు నుంచీ అతని అజ్ఞాతవాసం ప్రారంభమయి పోయింది మేడ మీద తన గది వదలి బయటకు రాకుండా గడపసాగాడు.

రాన్రాను సావిత్రి ఆలోచనలు అతనిని పిచ్చివాడిని చేసేస్తున్నాయ్ మరో ధ్యాసే ఉండడం లేదు

''బాబాయ్ ! అమ్మ భోజనానికి పిలుస్తోంది'' అంటూ అన్నయ్య కూతురు పిలుస్తే కిందకు దిగి డైనింగ్ హాల్లో నాలుగు ముద్దలు తినడం మళ్ళీ తన గదిలోకి వెళ్ళి పడుకోవడం.

కొద్దిరోజుల్లో చిక్కి శల్యమయిపోయాడతను.

అతని ఆకారం చూస్తుంటే అనూరాధకు గుండెలు తరుక్కుపోతున్నాయ్ కానీ అతని మీదున్న అయిష్టం జాలి కలుగనీయడంలేదు. అయితే అతనినలా చూస్తూ ఊరుకోడానికి కూడా మనసొప్పడం లేదు. ఆ విషయం భర్తతో మాట్లాడాలని నిశ్చయించుకుందామె

ఆ రాత్రి భోజనాలయ్యాక తనే ఆ ప్రస్తావన తీసుకొచ్చింది

''మీరు ఎంతసేపూ మీ వ్యాపారం గొడవే గాని అవతల కృష్ణ విషయం ఏమయినా పట్టించుకుంటున్నారా ?'' అంది నిష్ఠూరంగా.

''వాడికేమయిందిప్పుడు ?''

''ఏమవడమేమిటి? రోజు రోజుకీ





1984–85 సంవత్సరానికి హిందుస్తాన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ (మద్రాసు) అధ్యక్షులుగా ఎన్నికైన ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ వి మోహనరావు

అవతారం ఎలా అవుతూందో చూడండోసారి! పుల్లలాగా తయారయ్యాడు"

"దానికి మనమేంచేస్తాం? మనమేం అలా అవమని చెప్పామా?" విసుగ్గా అన్నాడతను.

"అలా అన్జెప్పి చూస్తూ ఊరుకుంటే రేపు ఏదొకజబ్బు ప్రాణంమీదకు ముంచుకొస్తే అప్పుడు మనకే కదూ బాధ?"

శీతారామయ్య మాట్లాడలేదు

ఆమె మాటల్లో నిజం ఉందని అతనికి తెలుసు తనకూ కృష్ణ ఆకారం ఆందోళన కలిగిస్తూనే ఉంది. కానీ తనేం చేయగలడు?

అయినా వాడలా తిండి తినకపోవడం ఎందుకు? చేయివలసిందతా చేసి ఇప్పుడు ఈ వైరాగ్యం ఏమిటో తనకు అర్థం కావడంలేదు

'పోనీ ఓ పని చేద్దామంటారా?" అడిగిందామె

## జీవితం - సెంటిమెంట్

"ఏమిటి?"

"పెళ్ళిచేసి పడేస్తే?"

శీతారామయ్య ఆశ్చర్యపోయాడు

"పెళ్ళా?"

"అవునండీ! ఇంకా చిన్నపిల్లాడను కుంటున్నారా ఏమిటి?"

"అదికాదు నేనాలోచించేది – వాడికి ఉద్యోగం లేదు – ఏమీలేదు – ఇప్పుడు పెళ్ళి వేయడం మంచి పనేనా అని."

"ఏమో అదంతా నాకు తెలీదుగానీ నేను మాత్రం అతని విషయాలు పట్టించుకోవడం కుదరదు ప్రతి విషయంలోనూ చిన్నపిల్లాడిలా చూచుకోవాలంటే నాకెలా కుదురుతుంది?"

అతను మాట్లాడలేదు ఆలోచనలో పడ్డాడు

"పెళ్ళిచేస్తే నాకీ బాదరబందీ ఉండదు కదా! తనూ మళ్ళీ మామూలు మనిషివుతాడు అటు అతని విషయాలన్నీ ఆ వచ్చేపిల్ల చూచుకుంటుంది."

"సరే – ఆలోచిద్దాం" అన్నాడతను

అక్కడితో ఆమెకు మనసు కుదుటపడింది

పైకి పెళ్ళిచేద్దామని అన్నా లోలోపల శీతారామయ్యకి అయిష్టంగానే ఉంది

కృష్ణ అలా కృంగి కృశించిపోవడం అతనికి ఎంతో మనస్తాపం కలిగిస్తోంది ఆమె మరణం అతన్నెందుకలా మార్చివేసిందో, ఒకవేళ ఆమె కోసమే అతనలా మారిపోయినట్లయితే, మరి ఆమె మరణానికి ఎలా కారకుడయాడో ఏ మాత్రం అర్థం కావడంలేదు సీతారామయ్యకి

ఏదేమయినా అతను మళ్ళీ మామూలు మనిషి కావాలనీ, గతాన్ని మర్చిపోయి కొత్త జీవితం ప్రారంభిస్తే బావుండుననీ తనకుంది

కానీ ఆ విషయం కృష్ణతో మాట్లాడ్డానికి ఏదో అడ్డు–

ఆ సంఘటన జరిగిన రోజునుంచీ ఇద్దరి మధ్యా సన్నిహితత్వం లోపించి పెద్ద అగాధం ఏర్పడిపోయింది

మరి కొద్ది రోజులు గడిచిపోయినయ్

రాన్రాను కృష్ణ విషయం ఓ తలనెప్పిగా తయారయిపోయిందామెకి అతని భోజనం దగ్గర్నుంచీ, బట్టలవరకూ అన్నీ తనే పట్టించుకోవాలంటే చికాగ్గా ఉంది

అంతేకాదు

తను పుట్టింటికెళ్ళాలన్నా, పెళ్ళీ పేరంటాల కెళ్ళాలన్నా అతనో ప్రతిబంధకంగా తయారయిపోయాడు

ఓరోజు అక్కడికి దగ్గర ఊళ్ళోనే బంధువుల పెళ్ళికి వెళ్ళి ఆ మర్నాడు వచ్చేసరికి ఆరోజంతా భోజనం లేకుండానే గడిపేశాడతను

తను టేబుల్‌మీద అతని కోసం వండి ఉంచిన అన్నం, కూరలు, ప్లాస్కులో కాఫీ, ఫలహారాలు అన్నీ అట్లానే ఉన్నాయ్

తనకెంతో బాధ కలిగింది అతనలా ఏమీ తినకుండా గడపడం–

"అదేమిటి? నిన్నంతా భోజనం చేయకుండానే కూర్చున్నావా?" ఆందోళనగా అడిగిందామె

"ఆకలిలేదు వదినా!" అనేసి మేడమీదకెళ్ళిపోయాడతను

అతనిని చూస్తే జాలిగానూ, కోపంగానూ కూడా ఉంది

అనుక్షణం అతన్ని గురించి ఆలోచిస్తూ కనిపెట్టి ఉంటూ, ద్వేషిస్తూ ఎలా గడపటమో అర్థం కావటం లేదు

(ఇంకా ఉంది)

# వారఫలం

**3-8-1984 శుక్రవారం మొదలు 9-8-1984 గురువారం వరకు**

★ **మేషం** సాటి వారి పోటీని ఎదుర్కొనవలసిన వారం ఎంత చేతికి అందినా అంతకు అంత ఖర్చు గృహ కార్య భారం అదికం కావటం కూడాగ్రహిస్తారు విద్యార్జనకు సదవకాశాలుంటాయి వ్యాపారం లాభదాయకమే స్త్రీలకు అదికారమందు పెంపు

★ **వృషభం** నాలుగు విధాలా లాభదాయకం కళా సాహితీ రంగాలలో బాగా పెంపు కనిపిస్తుంది పది మందిలో పేరు ప్రతిష్ఠలు లభ్యం కాగలవు మాటకు ఎదురు లేకుండా జరుగుతుంది చాల మందికి దూర ప్రయాణాలు చెప్పదగిన అంశం స్త్రీలకు సాహితీ రంగాన దనసిద్ధి, ప్రసిద్ధి ఏర్పడనున్న వారం

★ **మిధునం** ప్రయాణాల్లో యిబ్బందులు కలుగవచ్చు డబ్బో, రికార్డో పోగొట్టుకోవచ్చు ఆరోగ్యంలో కూడా లోపం రావచ్చు కాబట్టి, ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది స్త్రీలకు ఉద్యోగంలో నూతనావకాశాలకు ఆస్కారమున్నది ప్రత్యర్థులతో కీచులాటలు రాకుండా చూచు కోవాలి స్త్రీలకు అధికారమందు పెంపు, నూతనాంశాలు గ్రహింపు

★ **కర్కాటకం** గత వారం కన్నా అన్ని విధాలా మిన్నగానుండగల సమయం ఇబ్బందులను క్రమంగా అతిక్రమింపనున్నారు మీ మూలాన మేలు పొందగోరి బంధువులో మిత్రులో దాపునకు రానున్నారు వ్యాపార రీత్యా సర్వానుకూలత చేకూరగలదు స్త్రీలకు ఆశించిన రీతిగనే 'ప్రమోషన్' లభ్యం కాగలదు నూతనాంశాలు గ్రహిస్తారు ఆరోగ్య లోపం రాకుండా చూచుకోవాలి

★ **సింహం** నూతన విదాన మీకు ఆరోగ్య భాగ్యం ఆర్థిక సౌఖ్యం చేకూరుతుంది సంఘ గౌరవం అదికం కావటం కూడా గమనింప దగిన అంశం పరాయి వారి బాధ నెత్తిపై పెట్టుకొని బాధ పడతారు శక్తికి మించిన పనులు తల పెట్టరాదు గదా! స్త్రీలకు ఆర్థికంగా అభివృద్ధి ఆశించిన వ్యవహారాలు నెర వేరటం చెప్పదగిన అంశాలు

★ **కన్య** శని గ్రహం మీకు మంచి ఆర్థిక స్తోమతు కలుగ చేయనున్నాడు వృత్తియందు వికాసం సమకూర్చనున్నాడు ఇల్లు కట్టించే ప్రయత్నాలు చేయగలరు ఉద్యోగమందు కించిత్తు మేలు కనిపిస్తుంది వ్యాపారం సాఫీగా సాగిపోవుట యందు ఎలాంటి ఆక్షేపణ లేదు స్త్రీలకు సంఘ పరంగా అభివృద్ధి పది మందిలో ప్రతిష్ఠ నూత నాంశాలు గ్రహించుట మున్నగు సత్ఫలితాలుంటాయి

★ **తుల** మీలో నూతనోత్సాహం వెల్లి విరుస్తుంది ఆదాయంలో అభివృద్ధి కనిపిస్తుంది హితుల వలన మేలు చేకూరుతుంది రాజ్యాంగ విషయాలందు అవలోడన గల వారికి చిరాకు ఏర్పడుతుంది అతిగా ఏదీ పట్టించుకోరాదు స్త్రీలకు సభా గౌరవం, ఆదాయం, కుటుంబానందానికి అవకాశం గల వారం

★ **వృశ్చికం** ప్రతి వారం యిలాగే ఉంటుందనుకోరాదు నూతనాంశాలు గ్రహించుటకు నూతన రీత్యా వ్యాపారం ప్రారంభించుటకు, నలుగురిలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుటకు అనువైన వారం గతంలో చేసిన పొరపాట్లు దిద్దికోవలసిన ఆగత్యం ఏర్పడుతుంది స్త్రీలకు ఆశించిన విధంగా ఆదాయం అందుతుంది, అవసరాలకు యిబ్బంది రాకుండా జరిగిపోతుంది

★ **ధనుస్సు** ఎవరి మూలాన ఏ విషయం నిరభ్యంతరంగా జరుగుతుందనుకొంటారో అదే తికమక పెడుతుంది అంతే కాక వ్యాపార రీత్యా నష్టం కూడా రావచ్చు అప్పుగా యిచ్చిన డబ్బు అలాగే నిలబడిపోతుంది స్త్రీలకు 'ప్రమోషన్ విషయంలో నిరుత్సాహత ఏర్పడుతుంది శక్తికి మించిన పనులందు జాగ్రత్త పడి ఎలాగో నెరవేర్చి మాట నిలబెట్టుకోండి

★ **మకరం** ఆదాయం ఉన్నది వ్యాపారం సుకరంగా నెరవేరుతుంది కళా రంగ ఖ్యాతి అతిశయిస్తుంది ఉత్తరాల మూలాన అనేక ముఖ్య విషయాలు తెలిసికోగలరు కొందరకు ప్రయాణా లందు ప్రమాదం సంభవమయ్యే గ్రహస్థితి ఉన్నది. జాగ్రత్త! స్త్రీలకు ఉత్తర ప్రత్యుత్తరాల మూలంగా కొన్ని ముఖ్య విషయాలు తెలిసి కొంటారు ఇల్లు మారటం కొందర విషయంలో చెప్పదగిన ముఖ్యాంశం

★ **కుంభం** గౌరవాధిక్యత, వృత్తియందు పెంపు, వ్యాపార మూలకంగా లాభం, సభా గౌరవం సంప్రాప్తమయ్యే వారం మామూలుగా జరిగే పనులు సునాయాసంగా జరిగిపోతాయి నూతన వస్తువులు బంగారు, వెండికి సంబంధించినవి కొనుగోలు చేయగలుగుతారు స్త్రీలకు శుభ కార్యానుకూలత, అదిక వ్యయానికి ఆస్కారం

★ **మీనం** ఇరుగు పొరుగులతో తగాదా తంటాలుండగలవు గౌరవాధిక్యతకు అవకాశాలు గల పరిస్థితులు ఏర్పడగలవు కొందరకు నూతన వ్యాపారం సాగిపోయే మార్గమున్నది స్త్రీలకు గృహానుకూలత వ్యాపారానుకూలత, వ్యవ హారానుకూలతకు అవకాశం గల వారం గ్రహించండి

విద్వాన్‌కోట సత్య రంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



కుమారి ఉషా మెహ్రా భారత దేశంలో హైకోర్టు రిజిస్ట్రారుగా నియమింపబడిన తొలిమహిళ. ఈమె ఢిల్లీ హైకోర్టు రిజిస్ట్రారుగా ఇటీవలే పదవిని స్వీకరించారు. లాహోర్‌కి చెందిన ఒక కుటుంబంలో పుట్టిన ఈమె ముత్తాత, తండ్రి సోదరులు ఇద్దరు అక్కడ న్యాయవాదులుగా ఉండేవారు. తండ్రి, మేనమామ కూడా అక్కడే గౌరవ న్యాయాధికారులుగా పని చేశారు. చండీఘర్‌లో న్యాయశాస్త్రాన్ని చదివిన ఈమె 1965లో స్వతంత్రంగా న్యాయవాద వృత్తిని చేపట్టారు. 1980లో ఢిల్లీ జిల్లా సెషన్స్ కోర్టులో అదనపు జిల్లా జడ్జిగా నియమింపబడ్డారు. హైకోర్టు రిజిస్ట్రారు పదవిని మగవారికి తీసిపోని విధంగా మహిళలు నిర్వహించగలరని నిరూపించాలన్న పట్టుదలకల ఈమె మహిళా న్యాయవాదులు ధైర్యంగా ముందుకు సాగడానికి ప్రభుత్వ పానెల్స్‌లో ఆడవారికి రిజర్వ్‌డ్ కోటా ఉండాలని అంటున్నారు...



మొలటోవ్ — రిబ్బన్‌ట్రోప్ ఒప్పందంతో ఒక ప్రసిద్ధుడయిన సోవియెట్ నాయకుడు శ్రీ మొలటోవ్‌కి ఇప్పుడు 94 ఏళ్ళు! ఆయన మరికొందరు సోవియెట్ నాయకులలాగే మరుగున పడిపోయారు కాని ఇటీవలే ఆయన పేరుని పునరుద్ధరించ వచ్చునని సోవియెట్ ప్రభుత్వం వారు నిర్ణయిం చారుట...



నార్వేలోని భారత రాయబార కార్యా లయంలో గౌరవ వ్యవహర్తగా పని చేసిన శ్రీ హరీందర్ సింగ్ పంజాబ్‌లోని పరిణామాల అనం తరం తమ పదవికి రాజీనామా చేసి నార్వే ప్రభుత్వాన్ని రాజకీయ ఆశ్రయం కోరినందుకు ఆయన్ని భారత ప్రభుత్వం బర్తరఫ్ చేసింది...

# మనసును కాటేసిన మమత



శ్రీమధుర్‌జీ

రంగ్...రంగ్...రంగ్.

నన్ను సాదరంగా ఆహ్వానిస్తూ మా ఆఫీసు గడియారం పదిగంటలు కొట్టింది 'హమ్మయ్య సకాలంలో రాగలిగాను' తృప్తిగా నిట్టూర్పు విడిచి- రిజిష్టరులో సంతకం గెలికి సీట్లో కొచ్చాను ఆఫీసరుగారి గదిలో అప్పుడే ఫోన్ రొదపెడుతోంది—వారి వునికిని ఆఫీసు వారందరికి తెలియచేస్తూ.

'' 'యముడు' అప్పుడే తగలడ్డాడన్న మాట''—యల్డీసి రమణారావు విసురు.

'తగలడక కొంప దగ్గర ఘస్తాడా పెళ్ళామా? పిల్లలా?'— ఆచారి జవాబు

వారి విసుర్లకు చిన్నగా నవ్వుకుంటూ, నాలుగురోజుల క్రిందట వదిలి వెళ్లిన ఫైలందు కున్నాను—ఈ రోజు కూడా పూర్తికాకపోతే 'యము'డివ్వబోయే వార్నింగ్స్ గుర్తుకు తెచ్చుకుంటూ

'ఎప్పుడొచ్చావోయ్ మధూ వూర్నుంచి—'

'ఊరికే చూట్టమేనా సెటిల్‌గట్టా అయిపోయిందా—'

'అయితే త్వరలోనే మాకు పప్పన్నం పెడతావన్నమాట—'

ఆచారి, రమణారావు, శేఖరం ప్రశ్నలవర్షం కురిపించారు

'నేను వూరికి వెళ్లింది పెళ్ళిచూపులకని మీరెందుకనుకున్నారు —'' తెలివిగా క్రాస్ ఎక్జామిన్ చేశాను చిరునవ్వుతో

''మరి — పెళ్లికాని నీలాటి యోగ్యుడయిన కుర్రవాడు — పెళ్లి చూపులకు కాక శోభనానికి వెడతాడటోయ్ ఏకంగా —''

ఆచారివిట్టుకు ఆఫీసు జనమంతా పగలబడి నవ్వారు — టైపిస్టు నీరజతోసహా నేనూ వాళ్ల నవ్వులతో శృతి కలపక తప్పిందికాదు

''సార్! మిమ్మల్ని అయ్యగారు వెంటనే రమ్మన్నారు —'' ప్యూన్ రంగన్న ఆచారికి 'అరెస్టు వారంట్' తీసుకవచ్చాడు

పొంగుమీద నీళ్లు చల్లినట్లుగా నవ్వులు ఆగిపోయాయి.

ఆచారి పులిబోనులోకి అడుగు పెడుతున్న జింకపిల్లలా ఆఫీసరుగారి గదిలోకెళ్లాడు

ఆఫీసరుగారి కేకలు గదిదాటి హాల్లోక్కూడా వినబడుతున్నాయి

పది నిముషాల తర్వాత — ఆచారి వాడిన ముఖానికి చిరిగిన నవ్వును బలవంతంగా అతికించు కోటానికి వ్యర్థ ప్రయత్నంచేస్తూ బయటకు వచ్చాడు.

'ఏంగురూ! ఏమా కేకలు —' నారాయణ అడిగాడు

'కేకలా ?! కాదు గురూ జోకులు--' నవ్వుతూ ఆచారిచ్చిన జవాబు

'అమ్మో ఆచారీ! జీవితంలో త్వరగ

పైకొస్తావ్. ' ఆచారి గడుసుతనాన్ని మనసులోనే అభినందించాను.

రెండు గంటలపాటు ఆఫీసులో నిశ్శబ్దం రాజ్యం చేసింది.

'సార్'—

ప్యూన్ రంగన్న పిలుపుకు ఫైల్స్లోంచి తల పైకెత్తాను

'మీకోసం యెవరో పెద్దమనిషి వచ్చారు— బయట విజిటర్స్ రూములో వున్నారు—'

'నాకోసమా ?!'

'అవున్సార్ — మీవూరు, పేరు గూడ చెప్పారు—' రంగన్న వెళ్లిపొయ్యాడు

ఈ పట్నంలో నాకోసమొచ్చే పెద్ద మనిషి ఎవరబ్బా...? ఆఫీసు పనిమీద వచ్చేవారెవ్వరూ నా సీటు వర్క్ గురించి రారు — నాది పబ్లిక్కు సంబంధించిన వర్క్కాదు కాబట్టి. పోనీ — ఈ వూళ్ళోని చుట్టాలు, పక్కాలా అనుకుందామన్నా — వారెవరూ లేరు ఊరిదగ్గర్నుంచా అనుకున్నా నిన్ననేగా వూర్నుంచి వచ్చాను. మరా పెద్దమనిషి యెవరై వుంటారో—?

నిజం చెప్పొద్దూ—ఆ వచ్చిన పెద్దమనిషిని కలుసుకోవాలని మనసు కాస్తంత వేగిరపడింది. పది నిమిషాల్లో వ్రాస్తున్నది ముగించి — యింటర్వెల్లే కాబట్టి విజిటర్స్ రూముకేసి నడిచాను

నా మనసు వెంటనే ఆ వ్యక్తిని పసిగట్టింది

ఆ వ్యక్తికి దాదాపు అరవైఏళ్ల వయస్సుంటుంది తెల్లని పంచె, లాల్చీ, కండువా వేసుకున్నాడు. మనిషిలో తెలుగుదనం, ముఖంలో నిజాయితీ కొట్టవచ్చినట్లుగా కనబడుతున్నాయి. మనసులోని సౌమ్యత కళ్లజోడు వెనుకనుండి తొంగిచూస్తోంది ఒక్కసారి చూస్తేచాలు— మనసువిప్పి మాట్లాడాలనిపించేలా సౌజన్యమూర్తిలా వున్నారాయన

''నమస్కారం. నాపేరే మధు మీరు..''

''నమస్కారం బాబూ ... మీరేనా మధుగారు రండి రండి మీ గురించే వచ్చాను మీతో ఓ పదినిమిషాలు మాట్లాడాలి యిప్పుడు మీకు వీలవుతుందా. .'' ఆహా...ఏమి సౌజన్యం—

'పదండి . . అలా క్యాంటీన్దాకా వెళ్లి తీరిగ్గా మాట్లాడుకుందాం—ఈ అరగంటా మాకు యింటర్వెల్లే—'

'చాల సంతోషం ..పదండి వెడదాం-'

ఇద్దరం క్యాంటీన్ వైపు నడిచాము క్యాంటీన్లో ఓ మూలగా కూచున్నాము మాట్లాడుకోటానికి వీలుగా కాఫీలకు ఆర్డరిచ్చాను

'బాబూ! మీకన్నా బాగా పెద్దవాణ్ణి. అందుకే 'బాబూ!అని పిలుస్తాను—మీ కభ్యంతరం లేకుంటే—'

'అయ్యో దాన్దేముంది—మీరు పెద్దవారు అలానే పిలవండి మీయిష్టం—'

ఎందుకో చెప్పలేనుగాని—ఆ పెద్దమనిషి మొదటి చూపులోనే, మాటలోనే—నా మనసును చిత్రంగా ఆకట్టుకున్నాడు.

కాఫీలు వచ్చాయి.

'తీసుకోండి—' వారికందించాను

'బాబూ...ఇప్పుడు మీ దగ్గరకు ఆడపిల్ల తండ్రిగా వచ్చాను నా పేరు—కుటుంబరావు ముప్పై ఏళ్ళ టీచరుగా చేసి రిటైరయ్యాను. జనం మెచ్చే సంపద మిగల్చుకోలేక పోయినా— అంతకన్నా విలువైన—నా మనసుకు నచ్చిన శిష్య సంపద మిగుల్చుకున్నాను. ఓ కొడుకూ... ఓ కూతురు. కొడుకు బ్యాంక్లో ఆఫీసరు. అమ్మాయిని కూడా బియ్యేదాకా చదివించాను ఇక తండ్రిగా ఆ అమ్మాయి పెళ్లి భాధ్యత మిగిలింది. కట్న కానుకలు కళ్లు చెదిరేలా కాకున్నా—నాకు చేతనయినంతవరకు యిచ్చుకోగలను...మీ గురించి అన్ని వివరాలూ తెలుసుకున్నాను ... చూడు బాబూ...నేను యిలా రావటం నీకు ఆశ్చర్యంగా వుందా ? ఈ పెళ్లిళ్ల పేరయ్యలూ, వీరయ్యలూ నాకు నచ్చరు వారిలాగా ఉన్నది లేనిది చెప్పటం నాకసహ్యం. . అందుకే నేనే స్వయంగా వచ్చాను. చూశాను నీ ముఖం చూస్తేనే నాకు కడుపు నిండి పొయ్యింది—'

ఆశ్చర్యంగా వారు చెపుతున్నది వింటున్నాను.

'అదేంటి బాబూ . కాఫీ చల్లారిపోతోంది తాగెయ్యి '

కంగారుగా కాఫీ గ్లాసందుకున్నాను.

'బాబూ .. ఇదిగో అమ్మాయి ఫోటో . వీలు చేసుకుని ఆదివారం ఉదయం ఈ అడ్రసుకు రాగలవా ... ఒకసారి అమ్మాయిని చూసి—నచ్చితే మిగతా విషయాలు మాట్లాడుకుందాం పెద్దలను పిలిపించి . . ఏమంటావు ?'

కుటుంబరావుగారు ఫోటో అందించారు

అంతే !!

ఆ ఫోటో వైపు అలానే చూస్తుండి పొయ్యాను. అందాన్నంతా ఒకచోట కుప్పబోసినట్లుగా వుందా రూపు చిరునవ్వులు చిందించే ఆ చూపు . . తెలివెన్నెలలు కురిపించే ఆ రూపు.

కుటుంబరావుగారు నన్నే గమనిస్తున్నందు వలన కొంచెం సిగ్గుపడ్డాను

'బాబూ ! తండ్రిగా నే చెప్పకోకూడదుగాని మా శారద సాక్షాత్తూ మహాలక్ష్మి...ఏ యింట కాలుపెట్టినా ఆ యింట సిరులు కురియవలసిందే '

శారద . శారద

ఎందుకో పేరుకూడా నా మనసుకు నచ్చింది. ఫోటో చూడకుంటే — ఒకవేళ అమ్మాయిని చూడటం ఎగవేసేవాణ్నేమో—కానీ, ఫోటో చూసింతర్వాత యిక ఆదివారం కోసం ఎదురుచూడక తప్పిందికాదు

''ఏం బాబూ !... నువ్వు నా ప్రతిపాదనకు జవాబివ్వలేదు ?'

'వస్తానండి ఆదివారం వుదయమే తప్పకుండా వస్తాను '

'సంతోషం బాబూ .. చాల సంతోషం. ఆ దేవుడు చల్లగా చూస్తే నేను కోరుకున్నట్లే జరుగుతుంది '

కుటుంబరావుగారి కనుకొలుకుల్లో ఆనంద భాష్పాలు. ఎందుకో నా మనసు ఆ దృశ్యాన్ని చూసి ఆర్ద్రమయింది కన్నతండ్రి మనసులో కన్నకూతురు సుఖంకోసం ఎంతటి తపన !

'బాబూ ! యిదిగో అడ్రసు — '

అడ్రసు చీటి అందించి లేచాడు

'బాబూ ! తప్పక వస్తావు కదూ . నమస్తే ... యిప్పటికి శెలవు తీసుకుంటాను' చేతులు జోడించాడు.

'అయ్యో ... పెద్దలు మీకిది తగదు .. నమస్తే. . ' వారిస్తూ నాకు తెలియకుండానే చేతులు జోడించాను.

కుటుంబరావుగారు కనుమరుగయ్యేదాకా చూసి . జేబులోనుండి ఫోటో తీశాను — తనివితీరా చూడటానికి

శారద ... శారద .

ఎంత చక్కని రూపు ఎంత తియ్యని చూపు ...

సీట్లో కూర్చుని క్యాలండర్వంక చూశాను

అమ్మో — యింకా మూడు రోజులుంది ఆదివారం

ఇక ఆ రోజంతా పనిచేస్తే ఒట్టు —

ఎన్నిసార్లు గడియారంకేసి చూశానో — పాడుకాలం ఎంతకూ కదిలిచావదేం

నిజమే — క్షణాలు యుగాలంటే యిదే కాబోలు —

* * *

ఆదివారం —

ఎనిమిది గంటలు కూడా కాకముందే ట్రిమ్గా తయారయ్యాను క్రీం కలర్ షర్ట్ వైట్ ప్యాంట్మీద టకప్ చేసి — తళతళ మెరిసే షూ వేసుకున్నాను. కళ్లకు లైట్కూల్ గాగుల్స్ పెట్టుకుని — నిలువుటద్దంలో చూసుకుంటే — వండర్ — నా ప్రతిబింబం నాకే ముద్దొచ్చింది బహుశా . పెళ్లి కళ కాబోలు—!

తృప్తిగా నిట్టూర్చి — జేబులో భద్రంగా దాచుకున్న శారద ఫోటో తీశాను ఆ ఫోటో మళ్లీ మళ్లీ కళ్లతో చూడనవసరం లేనంతగా గుండెలో గాఢంగా ముద్రించేసుకున్నా —

వెన్నెలలు కురిపించే ఆ కళ్లు —

అద్దాల్లా మెరిసే చెక్కిళ్లు —

సంజరంగుల్ని సంతరించుకున్న ఆ ఒళ్లు —

నేను శారదను చూసి 'ఊఁ' అంటే — అంత అందం జీవితాంతం నాదే — అవును నాదే ఆ ఊహకే పరవశించిపోయాను. అమ్మో,

నాన్నలు నా కోరిక ఎప్పుడూ కాదనరు కట్న కానుకల ఆశలు నాకూ లేవు — వారికీ లేవు.

ఇక ఆ అందమైన ఊహ నిజం కావటానికి అడ్డం మిగిలిందల్లా కేవలం నేను సరేనని తలూపటమే.

మనసులోని ఆనందం పెదవులమీద పాటగా ప్రాకింది.

ఊహలలోని సంబరం ముఖం మీద చిరునగవుగా మారింది ఫోటో మళ్లీ జాగ్రత్తగా జేబులో దాచుకున్నా.

కుటుంబరావుగారు పొరపాటుగా మరిచిపొయ్యారో — కావాలనే వదిలివెళ్లారో — కాని శారద ఫోటో అప్పుడే అల్లిబిల్లిగా నా గుండెలో గూడుకట్టి అందులో కాపురంకూడా పెట్టేసింది

'నాట్ ఎ స్వీట్ హార్ట్ —'

నాకెందుకో హఠాత్తుగా కుటుంబరావుగారి సౌజన్యం, వారి కళ్లలో తొంగిచూసే మమకారం, మాట తీరులో, చిరునవ్వుతో వెల్లివిరిసే సంస్కారం గుర్తుకువచ్చాయి

ఒక్కసారి చూస్తే చాలు జీవితాంతం గుర్తుండే గొప్పతనం వుందా ముఖంలో. ఇక ఆ తండ్రి కని, పెంచి, పెద్దచేసి, విద్యా సంస్కారాలు నేర్పిన శారద మనసెలాంటిదో.

గులాబీ మొక్క గులాబీని పూయక ఉమ్మెత్తల్ని పూస్తుందా?!

రూముకు తాళంవేసి, అబిడ్స్ సెంటర్లో బస్సెక్కి చిక్కడపల్లిలో దిగాను—బస్సుకన్నా వేగంగా పరిగెడుతున్న చిలిపి మనసు నదుపులో పెట్టుకుంటూ జేబులో నుండి అడ్రసు చీటి తీసి చూసుకున్నాను చీటితో పాటు ఫోటో కూడా వచ్చింది—నా కోసమేగా మీరు వస్తున్నదని చిరునవ్వుతో ఆహ్వానిస్తూ

వెంకటేశ్వరస్వామి దేవాలయందాటి — ఓ అర ఫర్లాంగు ముందుకు నడిచి—ఎడమ వైపుకు తిరిగి యింటినెంబరు చూసుకున్నాను. అదే యిల్లు గేటుప్రక్కనే బోర్డు వ్రేలాడుతోంది 'శారదా మందిరం'

నాలుగు గదుల చక్కటి డాబా యిల్లు చక్కగా చూడముచ్చటగా వుంది ఇంటిముందు నందివర్ధనం, గులాబీలు, చేమంతులు నిండుగా, కనువిందుగా పూసి—ఆహూతులకు స్వాగతాలు పలుకుతున్నాయి గేటు మీదుగా ఆర్చిపైనపాకి విరగబూసిన కాగితంపూలు పిల్లగాలి చల్లని స్పర్శతో పులకరించి—తన క్రిందుగా వెళ్లిన వాళ్లకు పుష్పాభిషేకం చేస్తోంది.

మొత్తానికి ఇల్లు, ఇంటి వాతావరణం ప్రశాంతంగా వుంది

నేను కాలుపెట్టి కొన్ని క్షణాలయినా గడవకుండానే లోపల్నుండి కుటుంబరావు వచ్చారు తెల్లటి పాల నురుగులాటి జుబ్బా, పంచ, కండువాతో హుందాగా, నిండుగా వున్నారు. ముఖం నిండా వెల్లివిరిసే ప్రశాంతత.

# మనసు కాటేసిన మమత

'రా బాబూ . రా...నీ కోసమే ఎదురు చూస్తున్నా—' సాదరంగా ఆహ్వానించారు ఆ ఆహ్వానం పెళ్లి చూపులకు వచ్చిన వారిని ఆహ్వానించినట్లుగా లేదు—ఆత్మీయుల నాహ్వానించి నట్లుగా వుంది

'నమస్కారం—'

'రా బాబూ...రా యిలా కూర్చో సరస్వతీ సరస్వతీ ! .. వెంటనే ఓ సారిలా రా...' ఇంట్లోకి కేకేశారు

ఆమె వచ్చింది. యాభై ఏళ్ల ముత్తయిదువ నొసట కాసంత కుంకుమబొట్టు పచ్చని పసిమి ఛాయ. ఆదిలక్ష్మిలా వుంది

కానీ .కానీ ఆ కళ్లలో ఏదో దిగులు వ్యక్తీకరణకందని గుబులు

'ఇదిగో సరస్వతీ! మన శారదను చూడటానికి రమ్మని నేస్నేహంగా ఆహ్వానించానే .ఆ అబ్బాయ్ . మధు ..చూడు ఎంత బుద్ధిమంతుడిలా వున్నాడో .. మన శారద ఈ అబ్బాయికి. తప్పకుండా నచ్చుతుంది. ఆ౯ నచ్చక పోవటానికి అమ్మాయికేం తక్కువ చదువా సంస్కారమా అందమా ఏం సరస్వతీ పలకవేం నే చెప్పేది వినబడుతుందా .. బాబూ . అన్నట్లు నా ఆనందంలో మరిచాను— ఈవిడ నా భార్య సరస్వతి '

'నమస్కారం —'

'న . . నమస్కారం బాబూ' ఆవిడ గొంతులో దాచుకున్నా దాగని దుఃఖం తొంగి చూసింది కళ్లల్లోని తడికనబడకుండా కొంగుతో కళ్లద్దుకుంది

హఠాత్తుగా నా గుండెల్లో గుబులు ఇదేమిటి .. ఈవిడ పరిస్థితి యిలా వుంది . మనసు ఏదో కీడు శంకించింది కానీ—క్షణాల్లో సర్దుకున్నాను — ఆమే సర్దుకుంది




'చూడు సరస్వతీ ! అబ్బాయికి కాఫీ, టిఫిన్లు పంపి — అమ్మాయిని తయారుచెయ్యి— ఊఁ ... త్వరగా . అవతల వర్జ్యం వస్తుంది అవసరానికి అబ్బాయైనా యింట్లో లేడూ ఆదివారమూ ఆఫీసు గొడవలేనా ఏం బాబూ ! అలా ముభావంగా వున్నావు — నే మాటలతో విసిగిస్తున్నానా ?'

'అబ్బే . అదేం లేదండి !'

కుటుంబరావుగారు ఏవేవో మాట్లాడుతున్నారు తన వుద్యోగం సంగతులు, రాజకీయాలు, వరకట్నాలు, ఆడపిల్లల పెళ్లిళ్ల సమస్యలు — అనర్గళంగా మాట్లాడుతున్నారు అన్నీ యధాక్షర సత్యాలే. జీవితాన్ని, సాహిత్యాన్ని, సామాజిక పరిస్థితుల్ని బాగా మధించిన వ్యక్తిలాగా సాధికారంగా మాట్లాడుతున్నారు

నేను కేవలం శ్రోతనే చెవులు వింటున్నా మనసు మరోచోట వుంది

సరస్వతమ్మగారు కాఫీ, టిఫిన్లు యిచ్చి వెళ్లారు. మాట్లాడుతూనే పూర్తిచేశాము హాల్లోని గడియారం తొమ్మిది కొట్టింది

'సరస్వతీ ! వర్జ్యం వస్తుంది యిక అమ్మాయిని తీసుకురా !'

నా కళ్లు గుమ్మంమీదే అతుక్కున్నాయి గుమ్మానికి అడ్డంగా తెర తెర కదలిక కొరకు మనసు వురకలు వేస్తోంది

క్షణాలు గడుస్తున్నాయి భారంగా

'సరస్వతీ ! యింకేం ఆలశ్యం త్వరగా తీసుకురా శారదను '

మరికొన్ని క్షణాలు గడిచాయి — బరువుగా క్షణాలా ? నిజానికవి యుగాలు —

తెరకొద్దిగా ప్రక్కకు తొలగింది అంతే ! నాలో వుత్సాహం పెరిగి పెరిగి—పొంగుమీద నీళ్లు చల్లినట్లుగా చప్పున చల్లారింది

సరస్వతి !!

ఆమె ముఖంలో ఆందోళన

చెక్కిళ్లమీద జారటానికి సిద్ధంగా వున్న కన్నీళ్లు

నా గుండె వేగం పెరిగింది

'మీరోసారి యిలా లోపలికి రండి —' సరస్వతిగారి కంఠంలో అభ్యర్థన, దిగులు, దుఃఖం

'ఏమిటే ఏం జరిగింది క్షమించు బాబూ క్షణాల్లో వస్తా—'

కుటుంబరావుగారు, సరస్వతమ్మగారు ఆందోళనగా లోపలికెళ్లారు తెర మూసుకుంది.

నాకెందుకో అసహనంగా, భయం భయంగా కూడా వుంది

ఇదేమిటి శుభమా అని పెళ్లిచూపులకు వస్తే — ఆమెగారి కన్నీళ్లేమిటి — ఈ ఆందోళనలేమిటి .? మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది

నా ఆలోచనలను భగ్నంచేస్తూ - కుటుంబరావుగారు సుడిగాలిలా విసురుగా బయటకు వచ్చారు. చేతిలో కాగితం గాలికి రెపరెప

ఖాడుతోంది — ఆందోళనతో వేగిరపడుతున్న నా మనసులా —

'బాబూ...నా కొంప మునిగింది బాబూ...' గట్టిగా ఏడుపు మొదలెట్టాడు తలను చేత్తో బాదుకుంటూ. సరస్వతిగారు కన్నీళ్లు తుడుచుకుంటూ బిక్కమొగంతో దీనంగా నుంచున్నారు. విషయం నా కర్థంకాక వెర్రిచూపులు చూస్తూ కూర్చున్నాను.

'బాబూ... అది... ఆ పాపిష్టిముండ మా గుండెల్లో చిచ్చురగిల్చి వెళ్లిపొయ్యింది బాబూ... కులమూ, గోత్రమూ లేనివాణ్ణి ప్రేమించి — వాణ్ణే పెళ్లి చేసుకుంటానని వెళ్లిపోయింది బాబూ... కని, పెంచి, చదువు, సంస్కారం నేర్పించినందుకు — అది మాకీ తలవంపుల్ని, కడుపుకోతను మిగిల్చి వెళ్లిపోయింది బాబూ... ఇదిగో బాబూ... అది మాకు మిగిల్చిన జ్ఞాపకం —' ఏడుస్తూ కాగితం చూపించారు.

కుటుంబరావుగారు గుండెలు బాదుకుంటూ చెపుతున్నవి నాకు ఒక్కొక్కటే అర్థమయ్యాయి. అంటే శారద... శా...ర...ద తవకు నచ్చిన వానితో వెళ్లిపొయ్యిందన్న మాట —

'చూడు బాబూ... అది వ్రాసిన ఈ

# మనసు కాటేసిన మమత

కాగితంముక్క చూసు ఈ నాలుగక్షరాలతో అది యిన్నేళ్ల బంధం తెంచుకవెళ్లింది బాబూ '

అంత పెద్దమనిషి అలా చిన్నపిల్లాడిలా ఏడుస్తుంటే . నాకూ కన్నీళ్లు తిరిగాయి

'క్షమించు బాబూ.. నీకు కష్టం కలిగించాను. శారదను చూపుతానన్నాను యింకెక్కడి శారద . యిదిగో యిదిగో—'

పిచ్చిగా కాగితంవైపే చూస్తూ ఏడుస్తున్నారు.

'క్షమించండి . మీరోసారి బయటకు వస్తారా ..'

తలయెత్తి చూశాను ప్రక్కన పాతికేళ్ల యువకుడు అతనితోపాటు బయటకు వచ్చాను.

'క్షమించండి.. నా పేరు ప్రభాకర్. కుటుంబరావుగారి అబ్బాయిని. బ్యాంక్‌లో ఆఫీసరుగా చేస్తున్నాను '

తండ్రి కూతురుకోసం అలా గుండెలు బాదుకుంటుంటే శారద అన్నయ్యనంటూ యింత నిబ్బరంగా వున్నాడేం. . అసలేం జరగ నట్లు నాకు ఆశ్చర్యమేసింది.

'మీరు ఆశ్చర్యపోతున్నట్లు నేను శారద అన్నయ్యనే తల్లిదండ్రుల్ని ఎదిలి, పరువు మర్యాదల్ని విడిచి . ఎవరినో ప్రేమించానంటూ వెళ్లిన శారద అన్నయ్యనే—'

'మరి .?!'

'కానీ .. శారద లేచిపోయింది యిప్పుడు కాదు . ఐదేళ్ల క్రిందట —'

'ఆఁ !!!'— నాకు నోటమాట రాలేదు

'మా నాన్నగారు శారదను ప్రాణంలో ప్రాణంగా పెంచారు. దానికోసం బంగారంలాటి సంబంధం తెచ్చారు సరిగ్గా వారు పెళ్లి చూపులకు వచ్చినప్పుడే — అది ఓ వుత్తరం ముక్క వ్రాసి వెళ్లిపోయింది తనకు నచ్చినవానితో ఆ అవమానాన్ని, బాధను తట్టుకోలేక తీవ్రంగా 'షాక్' తిన్నారు దాంతో యిప్పటికీ తన కన్న కూతురుకు సంబంధాలు 'యిలా' వెతుకుతునే వున్నారు '

అంతటి సౌజన్యం మూర్తీభవించిన ఆ పెద్ద మనిషి మతిలేని మనిషా ?!

మమకారం పొంగిపొరలే ఆ చూపులు పిచ్చి చూపులా ?!

'ఇప్పుడావిడ ఎక్కడున్నారు —'

'లేదు వాని మోసానికి బలై ఆత్మహత్య చేసుకుంది —'

ప్రభాకర్ కళ్లు తుడుచుకున్నాడు. నా కన్నుల్లోనూ కన్నీళ్లు తిరిగాయి

'క్షమించండి మా నాన్నగారి తరఫున మిమ్మల్ని క్షమాపణ వేడుకుంటున్నాను మీ కనవసరంగా శ్రమ, మనస్తాపం కలిగించాము ' కన్నీళ్లతో చేతులు పుచ్చుకున్నాడు

నా గుండె బాధతో విలవిల్లాడింది

ప్చ్ మమకారం ఓ మంచి మనసును పిచ్చిదానిగా చేసింది

కుటుంబరావుగారి ఏడుపు యింకా సన్నగా వినబడుతునేవుంది బయటకు లోపలికి వెళ్లే ధైర్యంలేక — తల వంచుకుని గబగబా నడిచి, బస్సెక్కాను

టిక్కెట్టుకోసం డబ్బు తీస్తున్నపుడు — డబ్బుతోపాటు శారద ఫోటో చేతిలోకొచ్చింది వెంటనే షాక్ తిన్నాను

సరిగ్గా రెండు గంటల క్రిందటిదాకా ఎన్నెన్నో తీయని ఊహల్ని రేపిన ఆ రూపం ఆ చూపులు యిప్పుడు గుండెల్ని గుబగుబలాడించాయి

నాకు తెలియకుండానే — ఆ ఫోటోను కిటికీలోనుండి గాల్లోకి వదిలాను

కనుమరుగయ్యేదాకా నిశ్శబ్దంగా చూశాను— శూన్యం నిండిన చూపులతో. ★






### కె. ఆర్. యు. — హోసూరు

పత్రిక రాగానే మీ ప్రశ్నావళి చదువుతాను మీ జవాబులు ఘాటుగాను స్వీట్‌గాను వుంటాయి అందుకే నాకిష్టం మీరేమో చాలా ఫాషనబుల్‌గా వుంటారు. మీ పేరేమో పాత చింతకాయ పచ్చడి.

★ నేమా నా నేత చీరలూ పాతకాలపు నగలూ--ఎవరన్నారు నేను పేషనబుల్ అని? ఇక పేరంటారా? అది మా మేనత్త పేరు ఆవిడ బుద్ధులే వచ్చాయట నాకు !

### ఆర్. బి. కె. — కాకినాడ

జీవితం అంటే ఏమిటి ?

★ చావు పుట్టుకల మధ్య కాలం

### జె. వి. ఆర్. — విశ్వేశ్వరపురం

మీ డెత్ తరవాత ఏమోగాని మీరు బ్రతికున్నంత కాలం యీ ప్రశ్నావళి వుండితీరాలి .

★ మీ కోరిక బాగానే వుంది గాని మీరిలా అంటే—ఏది ముందు అని ఎదురు చూడాలి నేను !

### పి. ఎస్. ఆర్. — హైదరాబాదు

గాంధి ఆస్పత్రి సికింద్రాబాదులో నా స్నేహితునికి టాన్సిల్సు ఆపరేషనుకి డేటు యిచ్చిన ఓ వైద్య మహాశయుడు ఆరోజు రెండు వందలు తెచ్చావా అడిగాడట ఏం చేస్తే పాపం ప్రక్షాళన అవుతుంది?

★ మీ కేదో లోకాయుక్తులున్నట్టుంది కదా—యిలాంటివే కదా వారి పరిధిలోకి వచ్చేవి (మనలో మనమాట టాన్సిల్సు యింకా తీస్తున్నారా? పాత ఫాషననుకున్నాను )

### పి. ఆర్. ఎస్. — ఉరవకొండ

రాజకీయం గురించి మీ అభిప్రాయం ఏమిటి ?

★ ఏ రాజకీయం ?!

### కె. వి. ఎల్. — దరిశి

మనిషికి జీవితంలో అతి ముఖ్యమైనది ఏది ?

★ నిజాయితీ

### ఎస్. కె. ఎమ్ ఎస్. — సత్తెనపల్లి

నేనొక అమ్మాయిని ప్రేమించాను ఆమె ప్రేమించింది అకస్మాత్తుగా ఆమెకి పెళ్లి నిశ్చయం అయింది— మేం ఒకరి అభిప్రాయం ఒకరు తెలుసుకోకుండానే ఇప్పుడు నేను ప్రేమాభిషేకం చేయమంటారా ? దేవదాసుగా మారిపొమ్మంటారా ? నా కళ్లముందే ఆమె పెళ్లి జరిగిపోయింది

★ ఇంకా ఆమె ప్రేమించిందని ఎలా అనుకుంటున్నావయ్యా పిచ్చిసన్నాసీ! ప్రేమాభిషేకం చేసి కూడే కూడే ఆమె కాపురం కూల్చకు దేవదాసువైపోయి నీ జీవితం నాశనం చేసుకోకు హాయిగా మళ్లీ ప్రేమించడానికో అమ్మాయిని వెతుక్కోవడం ప్రారంభించు

### కె. ఎస్. ఎమ్. — కుంటిమద్ది

మీ యింటి పేరు కూచి అన్నారు కదా — ఆ కూచికి పూచి అయిన కులం ఏది ?

★ ఇలా అడగడం సభ్యత కాదు - అయినా బీ సీ ని కనుక చెప్తున్నాను

### పి. ఆర్. ఎమ్. — సిద్దిపేట

నేడు పెచ్చుపెరిగిపోతున్న అక్రమాలకు అన్యాయాలకు కారణం బలహీన ప్రభుత్వమా? లేక ప్రజలలోని స్వార్థమా ?

★ రెండూ కాదు— పూర్తిగా నైతిక విలువలని విడిచిపెట్టడం

### కె. ఎస్. ఆర్. — అనంతపురం

హృదయ స్పందన అంటే ఏమిటి ?

★ సాటి మనిషి— కష్టసుఖాలకి చలించడం.

### పి. పి. ఆర్. — బళ్లారి

ఈ జీవన తరంగాలలో, ఆ దేవుని చదరంగంలో ఎవరికి ఎవరు సొంతం ?

★ బాగా చెప్పారు ! స్థిరత్వంలేనిచోట సొంతం ఏదీ వుండదు

### జి ఎస్. ఎస్. ఆర్. — అర్ధవీడు

చదువుకున్న మగవాడు చదువుకోని ఆడదాన్ని పెళ్లిచేసుకుంటాడు కాని చదువుకున్న ఆడది చదువుకోని మగవాడిని చేసుకుందుకు యిష్టపడదు ఎందుచేత ?

★ ప్రతిక్షణం 'చదువుకున్నదానివి' అంటూ మగవాడు దెప్పి చంపుతాడని వెనక చేస్తుంది ఆడది

భారత స్త్రీ ఎలా వుండాలంటారు ?

★ తనని చూసి తానే సిగ్గుపడవలసిన స్థితిలో వుండకుండా — వుంటే చాలు

### కె. ఎ. ఆర్. — దోర్నకల్

మహిళా ప్రధానిగాకల దేశంలో మహిళలకు రక్షణ లేకపోవడంపై అభిప్రాయం ?

★ ఒక్క కోయిల కూస్తే వసంతం అయిపోదు !



మంథా వెంకట రమణారావు సీరియల్

# ఉదయసంధ్య

(గత సంచిక తరువాయి)

రామం కాలేజీలో చేరాడు కాలేజీలు తెరవగానే ఆర్ట్సులో స్కాలర్‌షిప్ దొరికింది హెడ్ మాష్టారి ప్రయత్నంవల్ల పుస్తకాలకీ, ఫీజ్‌కీ బాధలేదు వారాలు మానేసి స్టూడెంట్లకి తిండి పెట్టే ఒక హోటల్లో నెలకి నలభై రూపాయలకి భోజనం ఏర్పాటు చేసుకున్నాడు. రెండు ట్యూషన్లు కుదిర్చి పెట్టేరు హనుమంతరావు గారు దానివల్ల యాభై రూపాయలొస్తాయి తండ్రి నెలకి ఇరవై పంపుతానన్నాడు అది సాదర ఖర్చుకి సరిపోతుంది బస సీతారామయ్య ఇంటికి మార్పలేదు ప్రస్తుతానికి ఆ అవసరం అగపడలేదు

వెంకటేశ్వరులూ సీటు సంపాదించేడు లత కూడా చేరింది

ఆదినారాయణ మెయిల్ ఎక్కేసేడు ఖర్గపూర్‌కి

## 15

## రామం చెప్పిన కథ .... వాలుగేళ్లు

కాలేజీలో చేరేను తప్పనిసరయింది నేను మంచి మార్కులు తెచ్చుకున్నందుకు అది నా తల్లిదండ్రులకి పడ్డ శిక్షేమోననిపించింది నేను ఏదో ఉద్యోగంచేసి నాన్నకి సాయపడవలసిన అవసరం ఎంతయినా ఉంది స్కాలర్‌పిప్పు వెంటనే రాలేదు ఫీజుకీ పుస్తకాలకీ డబ్బయింది. నాన్నకి ఎవరిదగ్గరా డబ్బు తీసుకోవడం ఇష్టం లేకపోయింది హెడ్‌మాష్టారు, సీతారామయ్య గారూ డబ్బు కడతామన్నారు నాన్న ఇష్టపడ లేదు కొండయ్య దగ్గర మళ్లా అప్పచేసేరు నా బస ఎక్కడా, భోజనం ఎక్కడ అన్న ప్రశ్న వచ్చింది శాస్త్రిగారు వాళ్ల ఇంట్లోనే ఉంచ మన్నారు ఈ రెండేళ్లూ తరవాత 'లా' చదవ డానికి నిశ్చయించుకుంటే యూనివర్సిటీ హాస్టల్స్‌లో ఉండి చదవడమే ఉత్తమం అని పించింది ఇంక, భోజనం ప్రసక్తి వచ్చింది ఇంక వారాలు చేసుకోవటం మంచిది కాదన్నారు నాన్న చిన్ననాడు ఎవరేమన్నా బాధలేకపోయింది కానీ వయసూ, మనసూ పెరుగుతున్నప్పుడు అవమానకరమైన సన్నివేశాలు ఎదుర్కోవలసి వస్తే, వ్యక్తిత్వం కుంటుపడుతుంది

నాన్నకి తెలిసిన ఒక పంతులుగారు చిన్న హోటల్ పెట్టేరు అది భోజనాల హోటల్ మాత్రం మెయిన్ రోడ్డుకి తగిలే ఒక సందులో ! రథానికి దగ్గరగా ఉందది ఆయన పేరు పేరి పంతులు వయస్సు యాభై ఏళ్లు మా తాతగారు ఉన్నప్పుడు వాళ్లేవో లాభాలు పొంది ఉన్నారుట అందుకు నాన్న అతనితో నా సంగతి చెప్పగానే ఆయన సంతోషంగా అతని హోటల్లో రెండుపూటలా నాకు భోజనంపెట్టే ఏర్పాటుకి ఒప్పుకున్నాడు అందరి దగ్గరా నెలకి నలభై అయిదు పుచ్చుకుంటే నాకు నెలకి ఇరవై రూపాయలకి ఒప్పుకున్నారు అంటే అతనికి నావల్ల ఏమీ లాభించదు పైగా కాస్త నష్టంకూడానేమో. అతని హోటల్లో పదిహేను మందికన్న నెలవారీ భోజనం చేసే విద్యార్థులని తీసుకోడు హోటలంటే ఇల్లే క్రిందనే నలు చదరం లాటి రేకు చాపలువేసి కూర్చోపెడతారు. భోజన సమయాలు కూడా పగలు తొమ్మిదినించి పదివరకూ, రాత్రి ఏడునించి ఎనిమిదివరకూ. సినీమాకు వెళ్తే రాత్రి భోజనం పోయినట్టే సినీమాలకివెళ్లేవాళ్లంటే అతని కిష్టంలేదు అంటే విద్యార్థులతో, చదువన్నా చదువు లేదా సినీమాలన్నా చూడు రెండూ చెయ్యకు అంటాడు

నాన్న నా ఏర్పాటులన్నీ చేసి వెళ్లిపోయేరు రెండు పంట్లాలూ, బుష్‌షర్టులు కుట్టించేరు. మంచి పెన్నొకటి కొని ఇచ్చేరు నా దగ్గర అప్పటికే ప్రెజెంట్లగా వచ్చిన పెన్నులున్నా కొత్త ట్రంకుపెట్టె పడుకుందికి పరుపు ఇవన్నీ కూడా వచ్చేయి. నాన్న బస్సులో వెళ్లిపోతూ ఉంటే దుఃఖం ఆగిందికాదు మా తాత గారు దయాస్వరూపుడనేవారు ... తాతగారి సంగతి నాకు తెలీదు కాని నాన్నని చూస్తే అలానే అనిపిస్తుంది తన ప్రస్తుత ఆర్థికలాభం కోసం, నా భావిని పాడుచేయడం ఇష్టంలేక పోయిందతనికి అందుకు ఎన్ని ఇబ్బందులెదురైనా తనే భరిద్దామనుకున్నారు

వెంకటేశ్వరులూ నాతో ఆర్ట్సులోనే చేరేడు నన్ను సైన్సు తీసుకోమని హెడ్ మాష్టారు సలహా యిచ్చేరు మెడిసిన్ కన్నా, ఇంజనీరింగుకన్నా వెళ్లొచ్చన్నారు. కాని ఆ రెండు చదువులకీ పెట్టుబడిపెట్టే స్తోమతు నాన్నకి లేదు అందువల్ల అవి డబ్బున్నవాళ్లకే వదిలి పెడదాం బాబూ అన్నారు ఏం చెయ్యగలను ? మార్కులొచ్చేయి చదవగల తెలివితేట లున్నాయి అయినా ఆర్థికంగా అవకాశాలులేవు అందువల్లనే బీదవాడికీ ప్రపంచంలో వాడిస్థానం చెక్కుచెదరకుండా ఉంటుంది వాడిసంసారం వాడి పిల్లలూ అదే స్థితిలో ఉంటారు ఆర్థికంగా మెరుగుగా ఉన్న కుటుంబాలలోని పిల్లలు అందుకునేందుకు ఎన్నో అవకాశ లున్నాయి కాన్వెంటులో చదవగలరు, ఆత్మ గౌరవం చిన్నప్పట్నించీ అలవరుచుకోగలరు ఆత్మ విశ్వాసం ఎప్పుడూ ఉంటుంది వాళ్లకి, చదువులో వెనకపడితే ట్యూషను ఏర్పాటు చెయ్యగలరు ఒకపక్క కడుపులో ఆకలి కాలుస్తూ ఉంటే పుస్తకంమీదికి దృష్టి ఎక్కడవెళ్తుంది క్లాసులో ఏభై విద్యార్థులుంటే ఏమాష్టారు ప్రతి విద్యార్థి బాగోగులూ చూడగలడు ? వీధిబడులూ ఇటిక గుండచేసి బల్లచెక్కల మీద పాఠాలూ చెప్పే స్కూళ్లూ ఏ విద్యార్థిలోని మరుగుపడిన తెలివి తేటలని రగల్చగలవు చదువంటే భయం, లెక్కలంటే కంపరం, ఆ చిన్న వయస్సులో కలుగుతుంది మనస్సులో ఒకసారి ఆ భావాలు కలిగితే ఎలా పోగలవు ?

**జరిగిన కథ—13 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం. రామం సెలక్షన్సులో మొదటివాడుగా సెలక్టయ్యాడు రామం తను పుట్టి పెరిగిన అగ్రహారం వెళుతాడు రామం కుటుంబ సభ్యులు రామం రాకతో సంతోషిస్తారు. కామయ్యతో రామం చెల్లెలు శారద వివాహం నిశ్చయమవుతుంది పరీక్షలకు రామం విశాఖపట్నం వస్తాడు లత రామం దగ్గర లెక్కలు చెప్పించుకొంటుంది సుబ్బారావు లిల్లీతో స్నేహం చేస్తుంటాడు జబ్బుతో ఉన్న మేనత్తను చూసి రమ్మని తండ్రి రాసిన ఉత్తరం చూసుకొని రవణమ్మను చూడను వెళుతాడు రామం పాల్ సహాయంతో తన తల్లిని హాస్పిటల్లో చేరుస్తుంది సుగుణ సుగుణ తల్లి చనిపోయింది. పాల్‌కు సుగుణకు వివాహం జరిగిపోయింది శారద, కామయ్యల వివాహం జరిగిపోయింది. రామం ఎస్ ఎస్ ఎల్ సి ఫస్టుక్లాసులో పాస్ అవుతాడు రామం తండ్రి అతన్ని పై చదువులు చదివించడానికి నిర్ణయించుకొంటాడు

కాబట్టి ఆర్ట్సు ఒక్కటే నాకు గతయింది 'లా' చదువుతానో లేదో నాకు తెలీదు అప్పుడు గ్రాడ్యుయేట్ అన్నా అయితే టీచరు ట్రెయినింగ్ తీసుకుని మాష్టరయే అవకాశం ఉంటుంది.

సీతారామయ్యగారు నొచ్చుకున్నారు కాని అతను ఎదుటివాడి భావాలని అర్థం చేసుకొనే మనిషి "నువ్వు హోటల్లో తింటే తిన్నావుకాని, వారానికి ఒకరోజు మా ఇంటికి రాకతప్పదు ఆదివారం మా ఇంట్లో నువ్వుతిని వెళ్తూ ఉండాలి" అని అతనేకాదు, శాంతమ్మగారు కూడా అన్నారు

*           *           *

సుబ్బారావు, చంద్రం ఐ. ఏ. పాసయేరు· 'లా' కాలేజీలో చేరారు. కాబట్టి వాళ్లూ, నేనూ ఒక కాలేజీలో కలిసి చదవవలసిన అవకాశం లేక పోయింది. వాళ్లు యూనివర్శిటీకి పోయేవారు బస్సులో నేనూ, వెంకటేశ్వరులూ కాలినడకని మా కాలేజికి వెళ్లే వాళ్లం. మా కాలేజీ ఆవరణా, మెడికల్ కాలేజీ ఆవరణా తగిలి ఉండేవి. కాలేజి వరండా మీద నిల్చుంటే సముద్రం కనిపిస్తుంది. ఎండాకాలంలో చల్లటి గాలి తగుల్తుంది

ఐ ఏ రెండేళ్లూ, తరవాత 'లా' రెండేళ్లూ, నాలుగేళ్లు నేగడిపిన జీవితం గురించి చెప్పవలసిన సంగతులట్టే లేవు చదువురీత్యా ఆర్ట్సు సబ్జక్టులు .క్లాసులోని లెక్చర్లు వింటే చాలనిపించేది అవి నోట్సు కింద రాసుకుంటే బుర్రలో ఉండిపోతాయి కంఠస్థం చెయ్యవలసిన సంగతులేమీ లేవు పాయింట్లు గుర్తుంచుకొని వాటిని సరిగా రాయగలగడం ముఖ్యం రాసే విధానం బట్టి మార్కులొస్తాయి

లత కూడా కాలేజిలో చేరింది నేను లాజిక్కూ, సైకోలజీ తీసుకుంటే, లత హిస్టరీ, ఎకనమిక్సూ తీసుకుంది వెంకటేశ్వరులు తెలుగు, హిస్ట[illegible]సుకున్నాడు లాజిక్కూ, సైకాలజీ స్కోరింగ్ పేపర్లు పైగా 'లా' చదివే ఉద్దేశం ఉంటే తర్కశాస్త్రంలోనూ, మనస్తత్వ శాస్త్రంలోనూ కొద్ది



మా(త్రం అన్నా జ్ఞానం ఉండాలని సీతారామయ్య గారు సలహా ఇచ్చేరు

పొద్దున తొమ్మిదికల్లా పేరి శాస్త్రి హోటల్‌కి చేరుకుంటే పీటలు వేసి ఉంటాయి విస్తరలు వెయ్యడం, గ్లాసులు పెట్టడంలో అతనికి సాయపడేవాడిని అవసరం ఉంటే వడ్డన కూడా చేసేవాడిని అతను మొదటినించీ నేను వారి ఇంటిలోని మనిషిలా చూస్తూ వచ్చేరు అక్కడ భోజనానికీ ఇంట్లోని భోజనానికీ బేధం ఉండేదికాదు పోతే ఇంట్లో రోజూ రెండు కూరలూ పప్పూ, పులుసూ ఉండకపోవచ్చు అక్కడినించి కాలేజి దూరం కాదు కాలేజి అయ్యేక పుస్తకాలింట్లో పడేసి నేనూ, వెంకటేశ్వరులూ షికారు పోయేవాళ్లం వాడిడి మరొక శేయం అవా 'భారతి'లో వాడు ఇప్పుడు తక్కిన పత్రిక కి కూడా పంపడం ఆరంభించేడు స్వతంత్ర, ప్రజామత ఇత్యాది పత్రికలకి వాళ్ళు అచ్చుచేసేవారు కాని డబ్బు ఏమీ ఇచ్చేవారుకాదు కాంప్లిమెంటరీ కాపీ వచ్చేది రచయితలని ప్రోత్సహించే సాకు పెట్టుకొని రచన కివ్వవలసిన ప్రతిఫలం ఇవ్వకపోవడం అన్యాయం అనిపించేది

రాత్రి పుస్తకాలు తీసే వాళ్లం క్లాసులోని పిల్లల గురించీ, లెక్చరర్ల గురించీ వెంకటేశ్వరులు కబుర్లు చెప్పేవాడు కొంతసేపు మా ఇద్దరికీ ఉన్న కామన్ సబ్జక్టులు తిరగవేసే వాళ్లం కొంతసేపు రాత్రి పదయేసరికి పడుక్కునేవాడు మరో గంట నేను నా సబ్జక్టులు చదివేవాడిని

ఇది రొటీను, ఇదికాక సుగుణ ఇంటికీ, సీతారామయ్యగారి ఇంటికీ, ఆదినారాయణ ఇంటికీ వారానికొకసారన్నా వెళ్లడం అలవాటు కింద మారింది మీనాక్షి పెళ్లి ఇంకా తేదీ నిశ్చయం అవలేదు పదోక్లాసుకి వచ్చింది నేను వాళ్ల ఇంటికి వెళ్లకపోతే ఇక్కడికే పుస్తకాలు పట్టుక వచ్చేస్తుంది విశాలకి అది ఇష్టం లేదు ఇద్దరి మధ్యా ఒకరంటే ఒకరికి ఎందుకో అసూయ లందుకు నేను కారణం అని నాకనిపించేది కాదు నా ఆకర్షణ శక్తిమీద నాకు ఏ మాత్రం నమ్మకమూ ఉండేది కాదు నేను ఆకర్షించ గలనూ అన్న అహంభావం కలిగే వయస్సు కాదది

మొదటి ఆరునెలలూ కాలేజి పరిసరాలకి అలవాటుపడటంలో దొర్లిపోయింది

* * *

ఆదినారాయణ తిరిగి రాలేదు అంకమ్మ నాకు కబురుపెట్టి నా ముందు ఏడ్చింది సరలక్ష్మి ఆదినారాయణతోనే వెళ్లిపోయింది కొన్నాళ్ల తరవాత తెలిసింది, ఆదినారాయణ రెయిల్వేలో ఖలాసీగా ఉద్యోగం సంపాదించేడు వర్క్‌షాప్‌లో పేరు ఖలాసీయే కాని పని ఫుట్‌బాల్ ఆడడం రైల్వే టీమ్‌ని రిప్రెజెంట్ చెయ్యొచ్చు కొన్నాళ్లలో అని రాసేడు నాకు రాసిన ఉత్తరంలో శెలవల్లో నన్ను రమ్మన్నాడు కలకత్తా అంతా తిప్పి చూపిస్తానన్నాడు

## ఉదయ సంధ్య

ఒక్కొక్కరి జీవితంలో ఒక్కొక్క లక్ష్యం ఉంటుంది ఆ లక్ష్యాన్ని సాధించడానికి వెళ్లిపోతారు ధైర్యం ఉన్నవాళ్లు అందులో గెలిచినా ఓడిపోయినా వాళ్లకి ఆనందంగా ఉంటుంది వెంకటేశ్వరులుకి మెడ్రాస్ పోవాలని ఉంది సినిమాలకి పాటలు రాయాలని వాడికోరిక ఏ క్షణమన్నా వాడు వెళ్లిపోవచ్చు వాడి మనస్సుకొక స్థిరం లేదు వాడిప్పుడు లిల్లీని ప్రేమిస్తున్నాడు లిల్లీకి గర్వం లేదు మాకన్న ఒక ఏడు సీనియరు వయసులో వెంకటేశ్వరులు కన్నా కొన్ని రోజులు చిన్న లిల్లీ ఇంటికి రావడం పోవడం సాగించేడు వెంకట్ పద్యాలూ, పాటలూ రాసేడు

"ఒరే రామం ఈ సుబ్బిగాడు నాకు కాంపిటిషన్ తగుల్తున్నాడు నేను వాళ్ల ఇంటికి వెళ్లేసరికి వీడూ అక్కడ తయారే ఏం చెయ్యమంటావ్ ? తనకి ప్రెజెంట్లిస్తాడు క్రిస్‌మస్‌కీ, న్యూ ఇయర్‌కీ వాడికి డబ్బుంది నా దగ్గరేముంది బొంద ఆ భారతి వాళ్లు అచ్చువేసి, పదిరూపాయలు పంపుతే ఆ డబ్బులు కాస్తా నాన్న లాక్కుంటాడు "

"నీకు లిల్లీని పెళ్లి చేసుకొనే ఉద్దేశం ఉందా ?" అని అడిగేను

"ఒరే వెధవ పెళ్లి పెళ్లి సంగతెవడి క్కావాలిరా బాబూ ! నాకే రికానా లేదు పెళ్లి కూడానూ రొమేన్స్‌రా ! ఈ వయస్సు ఈ భావం ఈ మనసు పొంగు మళ్లా కావాలన్నా వస్తుందిరా ? నేను డబ్బులు ఆర్జించే వేళకి ఈ టినేజ్ దాటిపోతుందిరా ఈ స్వీట్ ఇన్నొసెన్స్ మరి ఉండదురా చదువుపూర్తయి ఉద్యోగం సంపాదిస్తేనే కాని ప్రేమించడానికీ, ఆడదానితో తిరగటానికీ అర్హత లేదురా ? ఏం సమాజం ఇది రాటెన్ సొసైటీ ఒరే అమెరికా ఇంగ్లాండ్‌లలో పదమూడో ఏటినించి రొమేన్స్ ఆరంభంరా డేటింగ్ అని ఉంటుంది పిల్లా, పిల్లవాడూ వాళ్ల ఇష్టమొచ్చినట్టు తిరుగుతారు మరి ఇక్కడో అందులోమా తెలుగుదేశంలో పెళ్లయితేనే కాని ఆడదాని మొహం ఎరగడు మగాడు మగాడి మొహం చూడదు ఆడది పెళ్లి చేసుకొనేసరికి మగాడికి ముప్ఫయిఏళ్లూ, ఆడదానికి పాతికేళ్లూ ఇంక అప్పుడేం రొమేన్సురా గురూ !" ఇలా ఉండేవి వాడి భావాలు

"లిల్లీ ఆ సుబ్బిగాడ్ని పెళ్లాడుతుంది చూస్తూ ఉండు లిల్లీ ఉత్త సరదాకి వాడితో తిరగడం లేదు చాలా నిఖార్సయిన పిల్ల లిల్లీ!" అన్నాను

"కొంపదీసి నువ్వు దానిని ప్రేమిస్తున్నా వేమిటిరా తండ్రీ" అని నా కళ్లలోకి చూసేడు

ఆ మాటలు వాడు సరదాకన్నాడు కాని నాలో ఏవో భావాలు పొగలలా లేచేయి వెంకటి అన్న మాటలు నిజమేనేమో అనిపిస్తూ



ఉంటాయి లిల్లీని చూస్తే నాకు ప్రపంచంలోని అందమైన వస్తువులన్నీ జ్ఞాపకం వచ్చేవి అమ్మ గుర్తుకొస్తుంది చెల్లి శారద గుర్తుకొస్తుంది మా పెరట్లో పూచే బంతిపూలూ, సంక్రాంతి పండుగా, చెరుకుగడలూ గుర్తుకొస్తాయి మామిడితోటలలో తిరుగుతున్నప్పుడు, మత్తుగా తగిలే మామిడిపూత వాసన గుర్తుకొస్తుంది నేను ఎవరినైతే, వేటినైతే ఇష్టపడతానో అవన్నీ గుర్తుకొస్తాయి లిల్లీ ఈ భావాలని ఇంతమందిలో ఎలా కలిగించ గలుగుతోంది అదే అర్థం కాలేదప్పుడు నేనూ వాళ్ల ఇంటికి వెళ్లేవాడిని, లిల్లీ చిరునవ్వుతో ఆహ్వానించి, కూర్చోపెట్టి మాట్లాడేది సుగుణ ఏవో కబుర్లు చెప్పేది కాని లిల్లీ నన్ను తన తమ్ముడిలా చూసేది నన్ను చూస్తే ఆమెలో ఏ భావాలు కలిగేవో నాకు తెలీదు నాకన్న ఏడాదో, రెండేళ్లో పెద్దది

జకరయ్య ఇంట్లో ప్రతీ ఆదివారం ఉదయం క్రీస్తుమీద భజన జరిగేది పాటలన్నీ సినిమా పాటల రాగాల్లో పెట్టి, మద్దెల, హార్మోణియమ్, తాళలూతోసహా అందరూ కలిసి పాడేవారు క్రిస్టియన్లు చాలామంది వచ్చేవారు వెంకటేశ్వరులు కూడా అప్పుడప్పుడు వెళ్లేవాడు, జకరయ్యని మంచి చేసుకుందుకి

పాల్ మెడిసిన్‌లో చేరేడు జకరయ్యకి పలుకుబడి బాగా ఉంది పాల్‌కి మార్కులు

కూడా బాగా వచ్చేయి సుగుణకి హార్బర్‌లో ఉద్యోగం దొరికింది, గవర్నమెంట్‌లో కాదు ఒక ప్రయివేట్ కంపెనీలో వాళ్ల షిప్ బిల్డింగ్ యార్డ్‌లో కంట్రాక్టర్లు దాని మేనేజరు ఒక క్రిష్టియను పొద్దున్న ఇంటి ముందు బస్సు పట్టుకొని వెళ్లిపోతుంది ఎనిమిదికి సాయంత్రం వచ్చేసరికి అయిదవుతుంది ఆఫీసులో పని అట్టేలేదు జీతం నెలకి రెండు వందలు అప్పుడది మంచి జీతమే మొదటి నెల జీతం వచ్చేక సుగుణ నాకు పాతిక రూపాయ లిచ్చింది ప్రతి నెలా తను ఆ డబ్బు నా కిస్తానంది

''ఒద్దు సుగుణా నీ తమ్ముళ్ల, చెల్లెలి సంగతి నువ్వు ముందు చూడు నా కవసర ముంటే నేను అడుగుతాను '' అన్నాను ఆమె చేస్తున్న పనికి ఆశ్చర్యపోతూ సుగుణ, నా భుజంమీద తట్టి అంది ''రామం నువ్వు చదువుకొని పైకొచ్చి, అసలు వడ్డీలతో చెల్లించేద్దువుగానిలే'' అంది ''ఇప్పుడు నాకు అవుసరంలేదు 'లా' కాలేజిలో చేరేక అవసరం పడొచ్చు అప్పుడు అడుగుతాను '' అని చెప్పేను ''నీ పేర ఒక ఎకౌంటు తెరిచి అందులో వేస్తాను '' అని అంది ''అది నీ పేరే ఉండనీ అవసరముంటే నేనే అడుగుతాను !'' అని ఆమెకి చెప్పేను సుగుణమీద కృతజ్ఞతతో మనస్సు నిండిపోయింది

* * *

ఐ ఎ రెండేళ్లూ సునాయాసంగా గడిచిపోయేయి పరీక్షలయిపోయేయి నేను ఇంటికి వెళ్లిపోయేను చదువు సంగతి అలా వదిలి నాకూ తక్కిన వ్యక్తులకీ మధ్యనున్న సంబంధం గురించి కొంత చెప్పాలి లత మనస్తత్వం చిత్రమైనది నేనంటే లతకొక తేలికభావం అనుకుంటాను ఒక్కొక్కప్పుడు—కాని కొన్ని సమయాలలో ఆమె ప్రవర్తన అలా ఉండదు పలకరించి మాట్లాడుతుంది ఆమెలో గర్వంకన్న, ఆత్మవిశ్వాసం, ధైర్యం నాకు కనిపించేవి మన దేశంలో ఆడదానికి కావల్సింది ధైర్యం లత చాలా అందమైన ఆడది ఆకర్షణ ఉండేది కాని ఆమెని చూస్తే ఒక విధమైన బెదురుకూడా ఉండేది సావిత్రి గురించి చెప్పాలంటే ఆమె తటస్థంగానే ఉండిపోయిందని చెప్పాలి ఆమె యొక్క వ్యక్తిత్వం ఇంకా విచ్చుకోలేదు కొందరు పదేళ్లకే అందరినీ ఆకర్షించే వ్యక్తిత్వం కలిగి ఉంటారు కొందరు యవ్వనం ప్రవేశించేక వెలుగుతారు మరికొందరూ ఎప్పుడూ మరుగు పడే ఉంటారు సావిత్రి మరి రెండేళ్ల తరవాత కాని వ్యక్తిగా నిలబడలేదు ఇంక ముగ్గురు మిగిలిపోయేరు నిర్మల, విశాల, మీనాక్షీ వీళ్లు ముగ్గురూ నేనంటే ఇష్టమున్నవాళ్లు నాలో శ్రద్ధ కనిపించినవాళ్లు ముగ్గురిలోనూ మీనాక్షికి ఒకటి రెండేళ్లలో పెళ్లి అవుతుంది ఇంక విశాల, నిర్మల చిన్నపిల్లలు నేను వాళ్లకి పెద్దన్నలా కనిపిస్తున్నాను వాళ్ల అన్నలతో తీసుకోలేని చనువు నాతో తీసుకుంటున్నారు వాళ్లకి నేను హీరోలా కనిపిస్తున్నాను కాని అదంతా క్షణికం నేను దూరమవగానే నన్ను మరిచిపోతారు

రత్నానికి నేను కోచింగ్ ఇచ్చేను చదువు మీద దృష్టి నిలపలేని రత్నం, నేను చెప్పగా పాఠాలు శ్రద్ధగా వినేది అన్నా వదినా వెళ్లిపోయేక ఆమెకేమీ తోచేదికాదు నేను సాయంత్రం ఒక గంట వచ్చి చెప్పేవాడిని స్కూలు మానిపించేరు ఒక ఏడు అందుకు ఇంటి దగ్గర ఏమీ తోచక, పుస్తకాలు తెరిచి, నేను చెప్పినవి వల్లెవేసేది ఒక ఏడాది గడిచేక రత్నాన్ని తొమ్మిదో క్లాసులో ఎడ్మిట్ చేయించేను ఆమెకి పెట్టిన టెస్టులన్నింటిలోనూ బాగారాసింది రత్నానికి ట్యూషన్ చెప్పినందుకు నెలకి పాతిక రూపాయలిచ్చేది అంకమ్మ ఆదికాక ఇంటికి వెళ్తే రోజూ టిఫినూ, కాఫీ దొరికేవి సాయంత్రం కాలేజినించి రాగానే ఆకలి వేసేది హోటలుకి వెళ్లడానికి డబ్బులు ఉండేవికావు అందుకు ఆదినారాయణ ఇల్లే శరణ్యమయింది కాలేజినించి తిన్నగా అక్కడికి వెళ్లేవాడిని రత్నం తొమ్మిదిలో చేరగానే నాకు వందరూపాయలు గురుదక్షిణగా ఇప్పించింది అంకమ్మ వద్దన్నా వినలేదు ఆదికాక నాకు పేంటుకి, షర్టుకి బట్టలు పెట్టింది నన్ను చూస్తే తనకొడుకుని చూసినట్టుంటుందిట ఆ వందా నాన్నకి పంపేను అది పండుగకి అల్లుడికి బట్టల కింద అయిపోయింది రత్నానికి ట్యూషన్ మాత్రం పోలేదు ఆమె స్కూల్లో చేరినా అందుకు నా నెలజీతం పాతికా పోలేదు ఇదికాక మరొక ట్యూషన్ కుదిరింది అది హేమంత రావు మాష్టారు కుదిర్చేరు

అది డాక్టర్ కామేశ్వరావుగారి అబ్బాయికి లెక్కలు చెప్పడం జోగారావు పదోక్లాసు కొచ్చేడు గ్రూపు లెక్కలు తీసుకున్నాడు వాడ ఇంజనీర్ కాని, డాక్టర్‌కాని అవాలని డాక్టర్‌గారి అభిలాష కాని జోగారావుకి లెక్కలమీద దృష్టి నిలవడంలేదు లెక్కల మాష్టరు వచ్చి చెప్పినా తలకెక్కేవికావు లెక్కలు హెడ్‌మాష్టారి సలహా మీద నన్ను నియమించారు నెలకి పాతిక రూపాయలు ఈ ట్యూషన్ కుదిరేక నాన్నని డబ్బు పంపొద్దన్నాను డాక్టర్‌గారిది మంచి ప్రాక్టీసు తెల్లటి నిండైన విగ్రహం, సమ్మోహనమైన చిరునవ్వు, నిదానమైన మాట తీరు అందుకు రోగి డాక్టర్‌ని చూడగానే అతనితో ప్రేమలో పడతాడు పూర్తి నమ్మకం ఏర్పరచుకుంటాడు డాక్టర్ కామేశ్వరావుగారి దగ్గరికి ఒక్కసారి వెళ్లేక, మరొక డాక్టర్ దగ్గరికి కెవరూ వెళ్లరు అందుకు అతను ఎన్నో ఇళ్లకి ఫామిలీ డాక్టరు దగ్గు, జలుబు, జ్వరం ఏ మొచ్చినా అతని హాస్పిటల్‌కి వెళ్లేవారు అతను ఎం బి బి ఎస్ మాత్రం అయినా నెలకి ఆ రోజులలో రెండువేలకి తక్కువలేకుండా ప్రాక్టీసు ఉండేది

* * *

నా చెల్లెలు శారదని చూస్తే జాలివేస్తుంది పదిహేనేళ్లు నిండేయి దానికి అప్పుడే సంసారంలో పడింది — దానికిప్పుడు నెలతప్పింది ఇప్పటినించీ పిల్లలంటే, దానికి ఇరవై ఏళ్లు వచ్చేసరికి పిల్లలూ, వాళ్ల పెంపకం, ఇంట్లో పనులు, వీటన్నింటితోనూ ప్రాణం పోతుంది ఇందులో నా తప్పూ వుంది ఇప్పటినించీ దానికి పెళ్లేమిటని అడ్డు పెట్టవలసింది కాని అందరు సుముఖంగా ఉన్నప్పుడు నేను చెయ్యగలిగే దేముంది ? ఇంటి దగ్గర అందరూ ఆనందంగా



# ఉదయ సంధ్య

వున్నారు సంసారంలో ఒక జీవి పడడం ఎవ్వరికీ విచారం కలిగించడంలేదు ఆడదానికి ఎల్లల్ని కనడమే సార్ధకత కామోసు

రిజల్ట్సు వచ్చేవరకూ మా వూళ్లోనే వున్నాను రిజల్ట్సు వచ్చేయి అనుకున్నట్టే ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసయేను రేంక్ కూడా వచ్చింది తరవాత ఏంచెయ్యడం అన్న సమస్య వచ్చింది 'లా' చదవాలంటే డబ్బు కావాలి పుస్తకాలకీ, ఫీజులకీ బి ఎ చదివినా అదే ఖర్చవుతుంది ఇంచుమించు ఎలాగా మధ్యలో ఆపడం సబబు కాదు 'లా' పుస్తకాలు లైబ్రరీలోంచి తెచ్చుక చదవవచ్చు స్కాలర్‌షిప్ సంపాదించవచ్చు అదికాక నాలుగయిదు ట్యూషన్లు చెప్తే నాన్న మీద ఆధారపడకుండా గడపొచ్చు అదే చెప్పేను నాన్నకి నాకు ఏది మంచిదని తోస్తే అదే చెయ్యమన్నారు నాన్న

నాన్న నాతో వచ్చేరు, సీతారామయ్యగారితో మాట్లాడడానికి సీతారామయ్యగారు ఒకటే చెప్పేరు ''నా సలహా ఒకటే 'లా' చదవడం వాడి 'లా' పూర్తికాగానే నా దగ్గర జూనియర్‌గా తీసుకుంటాను ఇంక ఎలా చదువుతాడు అన్న సంగతి పుస్తకాలు కొనక్కర్లేదు చంద్రం మా వాడూ మొదటి ఏడు చదివిన పుస్తకాలన్నీ రామానికిస్తారు ఇంక వాడు ఈ ఇంటికి బస మార్చడం ఉత్తమం వాడి భోజనమూ ఇక్కడే నాకేం ఇబ్బంది లేదు ఏనాడో చెప్పేను వాడు ఈ ఇంట్లో ఒక మెంబరు ''

సీటుకోసం దరఖాస్తు పెట్టటం సీటు రావడం జరిగేయి వెంకటేశ్వర్లు బి ఎ చదవ నిశ్చయించేడు నేను 'లా' కాలేజీలో చేరేను

## అంకితం

నా ఇరవైయవ ఏట, బెర్నార్డ్ షా, మెకాలే వంటి వారి రచనలు చదివి, వినిపించి, వారి గొప్పదనాన్ని తెలియ చెప్ప సాహిత్యంలో అభిరుచి కలిగించిన నా గురుతుల్యుడూ, ప్రియ మిత్రుడూ, [దురదృష్టవశాత్తూ గొంతు కాన్సర్ వచ్చి మృతి చెందిన] కీ॥శే॥ శ్రీరంగం రాధాకృష్ణ, [జయపురం, కోరాపుట్టి జిల్లా] దివ్యస్మృతికి !

— రచయిత

## 16

ముందుకేముందో జీవితం నాకు తెలీదు ! అనుకున్నవి జరుగవు— అనుకోనివి జరుగుతాయి— ప్రయత్నించడం, నిరాశా నిస్పృహలకి తావివ్వక పోవడం మానవ ధర్మం—

బాల్యం గడిచింది — ఎడోలాసెన్స్ దాటి పోయేను — యౌవనం తన ప్రాంగణంలోకి ఆహ్వానిస్తోంది — అక్కడ పూల కన్న ముళ్లే ఎక్కువ కనిపిస్తున్నాయి ! మరి ముళ్ల మధ్య పూలు పుట్టి, వికసించి రాలిపోతున్నట్టే మనిషి బతుకూ అనుకుంటాను !

ధైర్యంగా ముందుకు అడుగు వేసేను—

*[అయిపోయింది]* ●

# హైదరాబాదు నోట్‌బుక్



## ఆచార్య రాయప్రోలు కాలధర్మం :

ఏ దేశమేగినా, ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని — అనే అమర గీతంతో నవయువకులను ఉత్తేజపరచి స్వాతంత్ర్య సమరాభిముఖులను చేసి, ఆంధ్రప్రశస్తితో ఆంధ్రులను ఆత్మగౌరవ సంపన్నులుగా తీర్చిన ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు జూన్ 30వ తేదీ ఉదయం స్వగృహంలో కన్నుమూశారు. ఆయన వయస్సు 92 ఏళ్ళు. ఆయన చాలవాటికి మేలుబండి. ఆధునికాంధ్ర కవితకు ఆద్యుడు. జాతీయతకు ఆద్యుడు. మోహనదాస కరమచంద్ర కరుణాసాంద్ర అనే ఆయన వ్యాసం 1914లో కాబోలు ఉగాది సంచికలో ప్రచురితమైంది. అందువల్ల తెలుగులో గాంధీ సాహిత్యానికి ఆద్యుడు. సాహిత్యంలో అమలిన శృంగారానికి ఆద్యుడు ప్రొఫెసరు, ప్రిన్సిపాలు అయిన డిగ్రీలు లేని తొలి తెలుగు పండితుడు. రాయప్రోలువారు బాపట్ల తాలుకా గార్లపాడులో 1902 మార్చి నెలలో జన్మించారు. గుంటూరు, కాకినాడ, రాజమండ్రి హైదరాబాదులలో విద్యాభ్యాసం చేశారు. పిదప శాంతినికేతనంలో రవీంద్ర కవీంద్రునివద్ద చదువుకొన్నారు. శాంతినికేతనం నుంచి తిరిగివచ్చాక ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో చేరారు. క్రమంగా ఆచార్య పీఠం అధిష్ఠించి, వరంగల్ కళాశాల ప్రిన్సిపాలు అయ్యారు. పిదప కొంత కాలం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేశారు. లలిత, తృణకంకణం, కష్టకమల, స్నేహలత, తెలుగు తేట, స్వప్నకుమారం, జడకుచ్చులు, వనమాల, ఆంధ్రావళి, మిశ్రమంజరి ఎన్నటికీ వాడని అపూర్వ కావ్యాలు. ఉమర్‌ఖయ్యాం రుబాయతులను మధుకలశం అనే పేర తెలుగువారికి అందించారు. ఆయన రూపనవనీతం, రమ్యాలోకం యావద్భారతానికి ఆధునిక సాహిత్య లక్షణ గ్రంథాలు. ఆయన ఉత్తర వయస్సులో మేఘసందేశాన్ని (ఉరిమే కురిసే మేఘాలు మదించిన ఏనుగుల వంటివని కాబోలు) మత్తేభ వృత్తంలో తెలుగు సాంప్రదాయ యతిప్రాసలు మాని అనువదించారు. శాకుంతల, ఉత్తర రామచరిత్రలను అనువదించారు. చివరి దశలో రచించిన రామాయణ సుందరకాండ అనువాదం చాల రమ్యంగా సాగింది. స్త్రీని భోగ్యవస్తువుగా కాక మాతగా, సహధర్మచారిణిగా, సోదరిగా సాహిత్యంతో సంభావించడంలోను ఆయన ఆద్యుడు. మిశ్రమంజరికి కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం లభించింది. తృణకంకణానికి అభిమానులు స్వర్ణోత్సవం జరిపారు. ఆయన కన్ను మూతతో ఆంధ్రప్రదేశ్ మాత్రమే కాక, యావద్భారతం ఆధునిక కవితా ప్రస్థానాచార్యుని కోల్పోయింది.

## తిరుమల రామచంద్రకు సన్మానం :

సుప్రసిద్ధ భాషా లిపి శాస్త్రజ్ఞులు, రచయిత, పత్రికా రచయిత, పరిశోధకులు శ్రీ తిరుమల రామచంద్రను అభిమానులు, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం వారు జూన్ 18న 71వ జన్మదినోత్సవం సందర్భంగా సన్మానించారు. సన్మాన సభకు సుప్రసిద్ధ రచయిత, కళాకారుడు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి అధ్యక్షత వహించడం 40 ఏళ్ల నాటి మీజాన్ పత్రికలో తమకు శ్రీరామచంద్రతో గలిగిన సన్నిహిత సంబంధాన్ని వివరించారు. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ ఆచార్యులు డాక్టర్ లాళ్వే, రీడర్ డాక్టరు కె. కమల, ధర్మజ్యోతి సంపాదకులు శ్రీ మాచిరాజు శేషగిరిరావు, తెలుగు విజ్ఞాన సర్వస్వం ప్రధాన సంగ్రాహకులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం డైరెక్టరు డాక్టర్ వి.వి.ఎల్. నరసింహరావు శ్రీ రామచంద్ర భాషా సాహిత్య సేవను ప్రశంసించారు. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం అధ్యక్షులు, ప్రముఖ న్యాయవాది శ్రీ అవ్వా సత్యనారాయణరావు భాషా నిలయం పక్షాన నూతన వస్త్రాలతో సత్కరించి, 216 రూపాయలు బహూకరించారు. శ్రీరామచంద్ర కృతజ్ఞత తెలిపారు.

## ఉపశ్రుతి :

నాన్నా నాకు భోజనం అక్కరలేదు మధ్యాహ్నం—అన్నాడు బడికిపోతున్న కుమారుడు. ఎందుకని? — అడిగింది తల్లి. సాయంత్రం వరకు రిలే నిరాహార దీక్ష— అన్నాడు కుమారుడు. రాత్రి చేస్తావుగా—అన్నది తల్లి. రాత్రి భోజనం చేసి, మళ్లీ మరుసటి రోజు ఉదయం వరకు నిరాహారం, అన్నాడు కుమారుడు. తల్లి మందహాసం చేసింది.

**— తిరుమల రామచంద్ర**

జూన్ 18న శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయంలో నిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు, శ్రీ తిరుమల రామచంద్రను సన్మానించినప్పటి దృశ్యం. శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, అధ్యక్షులు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ ఎం.ఎల్. నరసింహరావు, శ్రీ అవ్వా సత్యనారాయణరావుగార్లని చూడవచ్చు.



వారపత్రికలకు ఒరవడిదిద్దిన

# ఆంధ్రపత్రిక

సంస్థనుంచి త్వరలో వెలువడే మరో వనితా పక్షపత్రిక

## కలువబాల



పఠితలను ఆలోచింపచేసే రచనలు,
వినూతన శీర్షికలు, పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణ

$\frac{1}{4}$ డెమ్మీ సైజు.

## కార్టూన్లు పంపేవారికి మనవి

కార్టూన్లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ–3 అన్న చిరునామాకి టపాలో పంపాలి వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును ఈలోగా, నేరుగా కాని, టపాలో గాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు కార్టూన్లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు ప్రత్యేక సంచికలకు కార్టూన్లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి ఈ కార్టూన్లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి

సం

# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

## పాత రచనలు

ఆంధ్రసచిత్ర వారపత్రిక పాత రచనలతో కూడా తయారై సర్వాంగ సుందరంగా వెలువడుతున్నది సంతోషం కాని పాత రచనలతోపాటు చిత్రకళ, సినిమా, ఫొటోగ్రఫీ వంటి కళాత్మక విషయాలు కూడ పాతవి ప్రచురిస్తే ఇంకా బాగుంటుంది ఒకనాటి ప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారులు కీ శే తలిసెట్టి రామారావుగారు మీ పత్రికకు వ్యంగ్య చిత్రాలు వేశారని విన్నాను కాని వానిని చూసే అవకాశం కలుగలేదు అలాగే మాధవపెద్ది గోఖలేగారు అప్పటి సంవత్సరాది సంచికలలో వర్ణచిత్రాలు, మామూలు చిత్రాలు రచించారని విన్నాము మొన్న సంవత్సరాదికి మీ సంవత్సరాది సంచికలో అలాంటివి మచ్చుకకు కూడ కనిపించలేదు దయచేసి పాత సంచికలు వెతికి పైన పేర్కొన్న విశేషాలు కూడా ముందు ముందు వెలువడేలా చూడగలరు వజ్రోత్సవ సంవత్సరం పూర్తయినా వీలువెంబడి పాత రచనలు వేస్తూనే వుండవలసిందని నా కోరిక

ఎ ఎస్ బి ఆచార్య, సంగంజాగర్లమూడి

## పీపానిండా తీర్థం

6–7–84 [కృష్ణ ముఖచిత్రం] వార పత్రిక చూచాను అందులో ఒక విలేఖరి రాసిన పీపానిండా తీర్థం, పాద ప్రక్షాళనం అనే వ్యాసాన్ని చదివాను

ఎటువైపూ మొగ్గకుండా బ్యాలెన్స్ దెబ్బ తినకుండా ఒకరిని నొప్పించక ఏ ఒక్కరినీ పొగడక వ్యాసకర్త వ్యాసాన్ని నడిపినతీరు వన్నెంతగానో కదిలించింది

రాశి పోసిన అనుభవానికి విలేఖనంలో ఉన్న నిశిత పరిశీలనకు ప్రత్యక్ష సాక్షీ భూతంగా అగుపించే ఆ విలేఖరి ఎవ్వరో

ఎవరైతేనేం శభాష్! అని మనస్ఫూర్తిగా అనమంటోంది నా మనస్సాక్షి

ఇలాంటి వ్యాసాలు ప్రచురించి పత్రిక స్థాయిని పెంచుకొంటూ పోవాలని ఆశిస్తున్నాను

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు, (తిరుపతి)

## వేదాద్రి

15–6–84 తేదీన మన పత్రికలో 'వేదాద్రి – పంచనారసింహ క్షేత్రము' అన్న వ్యాసాన్ని చిత్రాలతో అందించిన 'మాధుర్య' గార్కి, మా కృతజ్ఞతలు

ఎ శ్యామల, మాధవి, జగ్గయ్యపేట

## సముచితం

6–7–84 సంచికలో ప్రవాసాంధ్రుల పెన్నిధి, తెలుగు భాషా పోషకులు స్వర్గీయ శ్రీ కె ఎస్ కోదండరామయ్య మృతి పట్ల సంతాపాన్ని ప్రకటించారు ప్రవాసాంధ్రులమైన మాకు చాలా ఆనందమైంది ఆయనటువంటి నిజాయితీపరుడు, నిరండాబరుడు మా తాలూకాలో లేడు ప్రవాసాంధ్రులమైన మాకు మా గురువుగారైనటువంటి వారికి మీ ప్రగాఢ సంతాపాన్ని తెలియజెయ్యడం సముచితంగా ఉంది

కిరణ్ కుమార్, హోసూర్ ★

# అద్భుత వ్యక్తులు

[21వ పేజీ తరువాయి]

సాధ్యాసాధ్యాలను కనుక్కోటానికి ఇప్పటికీ పరిశోధనలు జరుగుతున్నాయి కులేషోవాను కొందరు శాస్త్రజ్ఞులు 'మీరు రంగులను ఎలా చెప్పగలుగుతున్నారు'' అని అడిగినపుడు ఆమె ''తెల్లరంగు ఉన్న భాగం ఎంతో మృదువుగా ఉన్నట్లు నాకు అనిపిస్తుంది, అలాగే పసుపు కొంచెం గరుకుగానూ, నలుపు బాగా గరుకుగానూ ఎరుపురంగు వెచ్చగానూ, నీలంరంగు చల్లగాను ఉన్నట్లుగా అనిపిస్తుంది నిజం కూడా అదే మీరు ప్రయత్నిస్తే మీకూ వస్తుంది' అని తెలియజేసింది

రష్యాలో కులేషోవా విజయాన్ని పురస్కరించుకుని ఐదారుగురు ఔత్సాహికులు ఈవేళ్లతో చదివే 'బిలెస్ సైట్'ను అభ్యసించి చాలా మటుకు కృతకృత్యులయ్యారు

రష్యాలోనే కాక యావత్ ప్రపంచ శాస్త్రజ్ఞులందరినీ ఎంతో ఆలోచింపజేసిన అద్భుత మహిళ కులేషోవా పేరు పారాసైకాలజీ శాస్త్రమున్నంతవరకూ ఉంటుంది

ఒకసారి కులేషోవాను కొందరు పాత్రికేయులు ''మీరు సమాజంలో ఎంతో ఎత్తుకి ఎదిగారు కదా మీకింకేమైనా కోరికలున్నాయా' అని అడిగినపుడు ఆమె వారితో నవ్వుతూ ''ఈ విద్య నేను చదువుకునే సమయంలో వచ్చి ఉంటే, పరీక్షల్లో పుస్తకాలను జేబులో పెట్టుకుని వాటిని తడిమి, తెలుసుకుని రాసి ఈ పాటికి ఓ పెద్ద డాక్టర్నో, సైంటిస్టునో అయ్యి ఉండేదానిని అదే నా కోరిక'' అని హాస్యోక్తి విసిరింది ★

[పై వారం టెలిపతీనే జీవనోపాధిగా స్వీకరించిన ప్రఖ్యాత టెలిపతిస్టు వోల్ఫ్ మెస్సింగ్]

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street Gandhinagar Vijayawada 3
Editor S Radhakrishna

# పిల్లదాని వంటి తెల్లదనం పరంపరాగతమా కేవలం—చెప్పవే ఓ మనసా!

మీ కళ్ల రంగు, ముఖ ఆకారం, మీ ఎత్తు, తెల్లని శరీర ఛాయ— ఇవన్నీ సాధారణంగా వంశపారంపర్యంగా వస్తాయి. మీకు తెల్లని వంటి ఛాయ వచ్చినా, అది అలాగే నిలిచి వుండకపోవచ్చు. దానికి కారణం, ఏళ్లు గడుస్తున్న కొద్దీ మీరు నల్లబడుతూ ఉండటమే.

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది. ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటకి వెళ్లినప్పుడు సూర్యరస్మిలోని అల్ట్రావయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి.



## వంటి ఛాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది. మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్లీ....నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్. ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి తిరిగి ఎర్రగా రంగు తేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా, బయటా 2 విధాలుగా.

<u>చర్మం లోపల</u>: ఫెయిర్ అండ్ లవ్లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి, నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది.

<u>చర్మం బయట</u>: ఫెయిర్ అండ్ లవ్లీలో గల 'సూర్యరస్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు, అల్ట్రా వయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి. అయినప్పటికీ, సూర్యరస్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు.

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి. మొదట చర్మంమీద కాస్త జిమజిమలాడవచ్చు. ఫెయిర్ అండ్ లవ్లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం. ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకీ కన్పిస్తుంది. క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్లీ శరీర ఛాయలో అలాగే వుంటారు.

ఫెయిర్ అండ్ లవ్లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి:

FAIR & LOVELY ADVISER,
P. O. BOX 758,
BOMBAY 400 021.




**ఫెయిర్ అండ్ లవ్లీ**
నల్ల చర్మాన్ని ఎర్రపరిచే క్రీమ్

హిందూస్థాన్ లీవర్ వారి
విశిష్ట ఉత్పత్తి

ఇది సహజంగా, మృదువుగా మీ వంటి ఛాయను పెంపొందిస్తుంది.

LINTAS FALOV 31 2316 TL

